# న వ ల లు

| | | రు | అ |
|---|---|---|---|
| విషహృదయము | | 1 | 0 |
| వలపులరాణి | | 1 | 0 |
| నేనెవరిభార్యను? | | 1 | 4 |
| నేనెవరిభర్తను? | | 1 | 4 |
| **తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి** | | | |
| జీవనప్రభాతము(రఘునాథజీ) | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | | 1 | 8 |
| **దేవరాజు వేంకటకృష్ణారావుగారి** | | | |
| వాడేవీడు | 1 భా | 1 | 8 |
| నేనే | 2 భా | 1 | 8 |
| కాలూరాయి | 3 భా | 1 | 8 |
| (వంగభాషనుండి తర్జుమా చేయబడిన బహుచక్కని నవలలు 3 భాగములు చదివినచో కథ పూర్తియగును.) | | | |
| అగ్నిరాముడు | | 1 | 0 |
| భయంకరుడు | 1 భా | 1 | 0 |
| నరేంద్రుడు | 2 భా | 1 | 0 |
| రమేశబాబు | | 1 | 0 |
| సర్కిల్ రంగనాథన్ | | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | | 1 | 0 |
| చదువుకున్న భార్య | | 1 | 0 |
| నీవేనా? | | 0 | 12 |
| ఛాందసుడు | | 0 | 12 |
| శక్తికుమారి | | 1 | 0 |

| | | రు | అ |
|---|---|---|---|
| పంజాబుమెయిల్ | | 1 | 0 |
| కన్నపుదొంగ | 1 భా | 1 | 0 |
| పగటిచుక్క | 2 భా | 1 | 0 |
| డిటో | 3 భా | 1 | 0 |
| (పై మూడు భాగములు చదివిన కథ పూర్తియగును) | | | |
| రమాసుందరి | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| రక్తవాహిని (ఐదు హత్యలు) | | 1 | 0 |
| ఇంద్రజాలము | | 1 | 0 |
| రాజద్రోహి | | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3హత్యలు) | | 1 | 0 |
| గురాణి | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| దొంగలనాయకుడు | | 1 | 0 |
| మోహపిశాచము 270 పే॥ | | 1 | 8 |
| కాలసర్పము | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| ఆనందభవనము | | 1 | 0 |
| అల్లరిపిల్ల | | 0 | 12 |
| మగడుకానిమగడు | | 0 | 12 |
| ధర్మరాజు | | 1 | 0 |
| హాతింతాయి | | 0 | 12 |
| **కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి** | | | |
| అహల్యాబాయి | | 1 | [illegible] |
| రాజరత్నం | | [illegible] | 0 |

# నౌకాభంగము



[కమల]

## ద్వితీయభాగము

మహారాష్ట్రభాషనుండి

శ్రీ వాసుదేవరావుగారిచే

ఆంధ్రీకరింపఁబడినది



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్. డిపో,

రాజమహేంద్రవరము

1949

శ్రీ రా మ.

# నౌ కా భం గ ము

## ( క మ ల )

## ద్వితీయ భాగము.

## మొదటి ప్రకరణము.

### గృ హి ణి.

కలకత్తాలో నించుమించుగ నొక్క మాసముండి రమేశచంద్రుఁడు గాజీపురమునకు మరలెను. ఈయొక్క నెలయుఁ గమల కల్పకాలమనితోఁచుట యశక్యమయ్యెను. తనయదృష్టమున నేమి లిఖింపఁబడియున్నదో దాని నామె యూహింపఁజాలకపోయెను. ఇఁక ముందేమి కానున్నదో యను విచార మామెహృదయమును ప్రక్కలుచేయుచుండెను. మన ముషఃకాలప్రకాశము వీక్షించుచుండఁగనే యేవిధముగ సూర్యతేజము నలువంకలఁ బ్రసరించునో యావిధముగనే కమలయొక్క స్త్రీస్వభావ మల్పావకాశముననే జాగరితమయ్యెను. కమల కన్నపూర్ణతో నింతటిదృఢపరిచయము గలుగకుండినయెడల, నామెమూలమునఁ బ్రేమరహస్యమును, వియోగదుఃఖమును కమలహృత్పటమునఁ బ్రతిబింబితములు కాకుండినయెడల నింక నెన్నిదినము లీమె కోమలమనోవికారములకు వెలియైయుండునో యెవ్వరెఱుఁగుదురు.

రమేశచంద్రుఁడు శీఘ్రముగ రాకుండుటవలన నన్నపూర్ణయాలోచనమున ననుసరించి యామెతండ్రి కమలారమేశులు నివసింపఁదగు గృహమొకటి గంగాతీరమున నద్దెకుఁ బుచ్చుకొనియెను.

గృహము చక్కపఱచుటకును, నాగృహమున నుండవలసినవస్తువులలోఁ గొన్నిఁటిని సేకరించుటకును జక్రవర్తిగారు పూనుకొనిరి. ఆవశ్యకములగు నితర కార్యములను నెఱవేర్చుటకై సేవకులను సిద్ధపఱచెను.

రమేశచంద్రుఁడు కడకు గాజీపురమున కేతెంచెను; ఇపుడు చక్రవర్తిగారిగృహమున నుండుటాతనికి న్యాయముగ నుండలేదు. ఇంతకాలమునకుఁ గమల తనస్వంతగృహమునఁ బ్రవేశించెను. ఇంటికెదుట నొకబాటయుండెను; ఆబాటకిరుప్రక్కలను వృక్షపంక్తులుండెను. శీతకాలమగుటవలన గంగాప్రవాహముతగ్గి తీరమునకును జలమునకును నడుమ నొకగొప్పయిసుకమైదాన మేర్పడియుండెను. ఆయిసుకనేలను మడులుమడులుగాఁజేసి కృషీకులందు దోస, పుచ్చ మొదలగువిత్తనములు చల్లియుండిరి. ఆగృహమునకు దక్షిణపార్శ్వమున నదీతీరసమీపమునను న్నొకయున్నతాశోక వృక్షమూలమున నం దొకశిలావేదిక నిర్మింపఁబడియుండెను.

చాలకాలమునుండియు నాగృహము నిర్జనమై యుండుటచే లోపలిభాగమంతయును శిథిలమైయుండెను. తోఁటలోనొకపూలమొక్కయైన లేదు. ఇంట నెచటఁ జూచినను దుమ్ము క్రమ్మియుండెను. కాని, యందులకుఁ గమల యసంతుష్టి నందలేదు. గృహిణీపదములభించుననునానందముచే నామెకివియన్నియును సుందరముగనే కన్పట్టెను. ఏగదియెందున కుపయోగింపఁదగునో, తోఁటయందే వైపున నే మొక్కలునాఁటవలయునో, ఆమె యప్పుడే మనసున నిశ్చయించుకొనియెను. చక్రవర్తిగారితో నాలోచించి యానేలనంతను దున్నించుటకు నిశ్చయించెను. తాను సమీపమున నేయుండి వంటయింటిలో మట్టిప్రొయ్యి వేయించెను. ఆయింటి నంటియున్నగదిలో భోజనవస్తువుల నన్నిఁటి నుంచుటకుఁ దగినయేర్పాటులు చేయించెను.

లగృహామునకు భోజనమునకుఁ బోయెను. కమల వేఁడికోలుపైఁ జక్రవర్తిగారు రానాఁడు పాఠశాల కేగలేదు. అన్నపూర్ణ యశోకవృక్షముక్రిందఁ బొయ్యినుంచి వంటచేయఁదొడఁగెను. చక్రవర్తిగారు కూరగాయలు తఱుగసాగిరి. వారితో సుమేశుఁడును దనశక్తికొలఁది నూడిగములు చేయుచుండెను.

వంటపూర్తియైనపిదప నెచ్చెలులిరువురును దృప్తికరముగ భోజనముచేసిరి. చక్రవర్తిగారు తాంబూలమునమలుచు లోపలికేగి శయనించిరి; ఇట నానెచ్చెలు లశోకవృక్షచ్ఛాయ నాసీనలై ముచ్చటించుచుండిరి. ఇట్లు ముచ్చటించుచుండఁ గమలమనోవృత్తి మార్పునందుచుండెను. ఆమెకుఁ బ్రతిదినము నగపడు సృష్టియే నేఁడు నవీన స్వరూపమునఁ గనఁబడుచుండెను.

మూఁడుగంటలుకొట్టుసరి కన్నపూర్ణతటాలునలేచెను. ఆమె భర్త యింటికేతెంచుసమయ మయ్యెను. ఆమె బయలుదేరుటఁగని కమల "ఏమీ! ఈయొక్కదినమైన నీనిత్యనియమము మీరఁగూడదా?" అనిప్రశ్నించెను.

అన్నపూర్ణ మారుపలుకలేదు. ఆమెసస్మితవదనయై కమలను గాంచుచు నామెచుబుకమునుబట్టి కదలించెను. తుద కింటిలోని కరిగి నిదురించుచున్న చక్రవర్తిగారిని మేలుకొలిపి "నాన్నా! నేనింటి కేగుచున్నా" ననియెను.

చక్రవర్తి—(కమలతో)అమ్మాయీ! నీవుకూడ నడువుము.

కమల—ఇప్పుడుకాదు. ఇక్కడ నింకను గొన్నిపనులున్నవి వానిని నెరవేర్చుకొని దీపములుంచు వేళకు వచ్చెదను.

సేవకుఁడగుసుమేశునిఁ గమలకు సాహాయ్యముగనుంచి చక్రవర్తి యన్నపూర్ణ నింటియొద్ద దిగఁబెట్టివచ్చుటకు బయలుదేరెను.

బయలుదేరుచు నాతఁడు కమలతో "నేనిప్పుడే మరలివత్తును." అనియెను.

కమల తనగృహకృత్యముల నన్నిటిని ముగించెను. ఇంకను సూర్యుఁడపరవారిధి గ్రుంకుచుండలేదు. కాలుసేతులు శుభ్రపఱచుకొని యామె యశోకవృక్షచ్ఛాయకుఁబోయి కూర్చుండెను. గంగాజలప్రవాహమున నావలును బడవలును వచ్చుచుండెను. వానిశోభనుగాంచుటయందామె నిమగ్నమయ్యెను. చూచుచుండఁగనే రవి యస్తమించెను.

ఇట్టిసమయమున నేదోపనియుండి యుమేశుఁడు కమలచెంతకు వచ్చి "అమ్మా! చక్రవర్తిగారియింటనుండివచ్చునప్పుడేను తాంబూలమును తెచ్చితిని అది యింకను నాయొద్దనేయున్నది." అని చెప్పి వాఁడొక కాగితమున గట్టియున్నతమలపాకు లామె కిచ్చెను.

ఉమేశుఁడాడిన యీపలుకులచేతను, అతఁడొసగిన తాంబూలముచేతను కమలసావధానమయ్యెను. సాయంసమయమై నలువంకలను నంధకారమునిండియున్నదని యామెకుఁ దెలిసెను. ఆమె తటాలున లేచి నిలిచెను.

ఉమేశ—చక్రవర్తిగారు బండినంపియున్నారు.

బండిలోఁ గూర్చుండుటకు ముందుగ నొక్కమా టిల్లంతయుఁ జూచుటకై కమల లోనికరిగెను.

వర్షాకాలమున నుపయోగించుటకై వెలకుఁదీసికొనిన యొక మఱప్రొయ్యిగదిలోనుండెను. దానిప్రక్కనున్న బల్లపై నొకదీపస్తంభముండెను. దానిప్రక్కనున్న యొక కాగితముపై నాతాంబూలము నిడి కమల పుస్తకములయఱలోనుండి యొకపుస్తకమునుదీయఁ బ్రయత్నించెను. ఇంతలో దీపస్తంభముచెంతనున్న కాగితముపై గణేశచంద్రునిహస్తలిఖితమైన తననామ మామెకుఁ గనఁబడెను.

కమల—(ఉమేశునితో) ఈకాగితము నీకెక్కడదొరకినది?

ఉమేశ—బాబుగారి సామానులలోఁ బడియుండెను.

ఆకాగితమును మడతవిప్పి యామె చదువఁదొడఁగెను.

కలకత్తాలోనున్నప్పుడు నళినికిఁ బంపవలెనని రమేశుఁడు వ్రాసినయుత్తరమే యది. ఆజాబు తనచేతనుండి యెప్పుడెక్కడ జారి పోయినదియు రమేశునకుఁ దెలియదు.

కమల యాయుత్తరమును జదివిచూచెను.

ఉమేశుఁడు "ఇట్లు మౌనముతో నెంతకాలము నిలిచియుందురు? చీఁకటిపడుచున్నది" అనియెను.

కమల యేమియుఁ బలుకలేదు. ఒకానొక చిత్తరువువలె నిలిచినచోటనే నిలిచియుండెను. ఆమె యాకారమునుగని యుమేశుఁడు భీతిల్లెను. అంత నుమేశుఁడు "అమ్మా! లోనికిఁ బోవుదమురండు చీఁకటిపడినది" అనియెను.

కొంతతడవునకుఁ జక్రవర్తిగారిబంటువచ్చి "అమ్మా! బండి చాలసేపటినుండి బయట నిలిచియున్నది; శీఘ్రముగ బయలుదేరుఁడు" అనియెను.

---

## మూఁడవ ప్రకరణము.

### "ప్రేమనభిలషించను రమేశుఁడు!"

"కమలా! నేఁడు నీవు స్వస్థతగానగపడుటలేదేమి? నీకుఁదల నొప్పిగా నున్నదాయేమి?" అని యన్నపూర్ణ ప్రశ్నించెను.

కమల—లేదు. కాని, చక్రవర్తిగారెచటికేగిరి? వారిచ్చటఁ గనఁబడరేమి?

అన్నపూర్ణ—శీతకాలపు సెలవగుటచే, నమ్మ యవ్వగారిని జూచిరమ్మని పంపగా వారలహాబాదునకు వెళ్లియున్నారు.

కమల—వారెప్పుడు మరలివత్తురు ?

అన్నపూర్ణ—వారుమరలఁబట కించుమించుగ నొక్కవారమైన బట్టును. కాని, కమలా! నీవా క్రొత్తయింటిని బాగుపఱచుటలో నీశక్తికిమీరి కష్టించుచున్నావుసుమా! అందుచే నేఁడు మిక్కిలి యలసియున్నట్టులును. నస్వస్థతతోనున్నట్టును గనబడుచున్నావు. లెమ్ము; ఫలాహారముచేయుము.

కమల తనమనోగతమంతయు నన్నపూర్ణకు నివేదించి యున్నచో నామెమనఃఖములోఁ గొంతభారము తగ్గియుండును; కాని, యవి చెప్పనట్టివిగా నుండలేదు. "ఎవని నేనింతవఱకుఁ బతియనుకొని యుంటినో యాతఁడు నాపతికాఁడు" అని యింకెవరితోనైన నొక వేళఁ జెప్పినను చెప్పవచ్చునేమోగాని. యన్నపూర్ణతోమాత్రము వచించుట కెన్నటికిని శక్యముకాదు.

కమల తనశయనగృహములోనికరిగి తలుపుబిగించి దీప పుగాంతి నాయుత్తరమును మరలఁ బఠింపఁదొడఁగెను. ఈయుత్తర మెవ్వనికి వ్రాసియుండురా యని యాలోచించెను ఏమియు నూహింప లేకపోయెను. ఆవ్యక్తినామము పురము, నిత్యాను లాకమ్ములో స్పష్టీకరింపఁబడియుండలేదు. కాని, యావ్యక్తి స్త్రీయైయుండుననియు నామెకు, రమేశునకు వివాహముకావలసియుండెననియు, నావివాహ ము కమలమూలమున జరుగ లేదనియుమాత్ర మాలేఖవలన విశ దమగుచుండెను. రమేశున కాస్త్రీయెడల నత్యంత ప్రేమకలదు. కాని, దరదృష్టవశమునఁ గమల మధ్యఁదటస్థమయ్యెను. మఱియుఁ గమల యనాథస్థితియెడఁ గనికరము కలిగి రమేశచంద్రుఁడు తన ప్రేమబంధమును ద్రుంచివేయవలసివచ్చె ననియును నాపత్రము వలన విశదమగుచుండెను.

నావ నీటమునిఁగిన యనంతరము, నదీద్వీపమునఁ దనకును రమేశునకును, ప్రథమసందర్శనము కలిగినదాది జరిగినవృత్తాంత మంతయు నిప్పుడు కమల హృదయనయనములకు గోచరింపసాగెను. ఏది రహస్యముగా నుండెనో, యదియంతయుఁ బ్రత్యక్షముగ నామెకు దెలియవచ్చెను.

ఈ కాంత స్వకాంత కాదని పూర్ణముగ నెఱిఁగి, యీమె నేమిచేయచ్చునా యని యహోరాత్రము నాలోచనానిమగ్నమానసుఁడై రమేశుఁడుండఁ దానాతనిఁ బతి యని మది నెంచి నిస్సంకోచవృత్తితో, నత్యంతభక్తితో, నాతనియందనుండి, యతనిగృహకృత్యముల నడపించుటకు సంసిద్ధమైయుండుట యనునది బల్లెమువలె నామెహృదయమునఁ బొడుచుచుండెను. కడచినచరిత్రము లన్నియు నొక్కటొక్కటిగ నామెకు జ్ఞప్తికివచ్చి లజ్జచేఁ గ్రుంగిపోవుచుండెను. ఈలజ్జాబంధమునుండి విముక్తినిబడయనంతటి భద్రముగా నామెజీవితములో నీచరిత్రమంతయు సమ్మేళనమైయుండఁబోలు!

తనదుస్థితినిగురించి విచారించుచు దానిలోమునిఁగి యున్న కమల కొక్కింతసేపేమియుఁదోఁచదయ్యెను. గదిలోనుండి తోఁటవైపున నున్న కవాటమును దెఱచెను; తోఁటలోని కరిగి యొక్కవృక్షచ్ఛాయ నాసీనయయ్యెను. కృష్ణపక్షయామినియగుటచే నెల్లెడల నంధకారము వ్యాప్తమైయుండెను. గగనవీథిని మినుకుమినుకు మనుచుండు తారకాప్రకాశ మాయంధకారమున కధికభీషణస్వరూపము నొసంగుచుండెను.

కమల యొకానొక జాతిబొమ్మవలె నిశ్చలముగఁ గూరుచుండి యుండెను; ఆమెమనస్సున నట్టివిచారముండెనో యెవ్వరు నెఱుంగరు. ఈవిధముగా నెంతతడవయ్యెనో యామెకుఁ దెలియనేలేదు. అప్పుడు బలవత్తరమగు చలిచే నామెహృదయగోళము వణఁకసాగెను; దేహ

మంతయుఁ గంపింపనారంభించెను; ఉదయించిన చంద్రప్రకాశముచే నావనమునందలి యంధకారమంతయు గొంతవఱకు నశించియుండెను అప్పుడామె లేచి, మెల్లగ గదిలోనికరిగి తలుపు మూసికొనియెను.

అరుణోదయమునఁ గమల కన్నులు తెఱచిచూచుసరికిఁ దన మంచముదగ్గఱ నన్నపూర్ణనిలిచియుండుట గనఁబడెను. సూర్యుఁడు గగనవీథి నారోహించియుండెను. కమల సిగ్గుతోఁ దటాలున లేచి కూర్చుండెను.

అన్నపూర్ణ—కమలా! ఇంతలో లేవకుము; ఇంకను గొంత తడవు నిదురింపుము. నిశ్చయముగ నీవు బాగుగా నుండలేదు; నీమో మెంత వాఁడియున్నది! చాలకాలమునుండియు వ్యాధిగ్రస్తవైయు న్నట్లు కన్పట్టుచున్నావు. నీకెట్లున్నదియు నాతోఁ జెప్పరాదా!

అనియన్నపూర్ణ కమలను గాఢముగఁ గౌఁగిలించుకొనియెను.

కమలహృదయము విదీర్ణముకా సాగెను. ఆమె నేత్రములనుండి వెడలునశ్రుజలము చిన్నకాలువవలె పాఱుచుండెను. ఆమె యన్న పూర్ణభుజముపైఁ దలనిడి పట్టరాని దుఃఖముతో నేడువఁదొడఁగెను. అన్నపూర్ణ యామె నోదార్పఁ బ్రయత్నించెను.

ఒక్కింతసేపటిలో కమల యన్నపూర్ణసమీపమునుండి దూర ముగాఁ దొలఁగిఁ కన్నీరుఁ దుడిచికొని పకపక నవ్వసాగెను. "అంత గానవ్వగూడదు. స్త్రీలనెందఱనో చూచియుంటినిగాని, నిన్నుఁబోలి నయజ్ఞానబాలిక నెన్నఁడు నీజన్మమునఁ గాంచియుండలేదు. నీయంత రంగము నేనెఱుఁగనని నీవనుకొనియుంటివి కాఁబోలును; నేనంత పిచ్చి దానఁగాను. వినదలతువేని నేనిప్పుడే నీమనోగతముఁ జెప్పఁగలను. రమేశబాబు బలహాశబాదునకు వెళ్లినదిమొద లిప్పటివఱకు నొక్క యుత్తరమైన వ్రాయలేదని నీకు దుఃఖమగుచున్నది. నీవు మహాభి మానవవుగాఁ గనఁబడుచున్నావు. వారెక్కడి కెట్టికార్యమునకై

పోయియున్నారో, యదినీవాలోచింపవలసియుండెను. రెండుదినములు ముందు వెనుకలైననేమి, వారు తప్పక రాఁగలరు. ఇంతమాత్రమునకు నీవాయనమీఁద నింతగ నలుగుట యుచితమా? కాని, కమలా! ఇది మనసున నుంచుము; నేనిప్పుడు నీకింతగ నుపదేశ మొనర్చుటకు సంసిద్ధనై యున్నను. నిట్టిస్థితి నాకును గలిగినచో నేనును నీవలెనే ప్రవర్తించియుందును. "పరోపదేశే పాండిత్యం" అను వార్యోక్తి యెన్నఁడు ననృతముకాదు. ఇట్టియల్పకారణమునకో యలుక స్త్రీలూరక యేడువఁదొడఁగుదురు. కాని, వారునవ్వుటకు నెంతో కాలముపట్టదు. వారిక్రోధము తనంతటనశింపఁగలదు" అని యన్నపూర్ణయనియెను.

అన్నపూర్ణ కమలహస్తముంబట్టుకొని "నిజము—నిజము వచింపుము; ఇఁక నెన్నఁడును నీవు రమేశబాబును క్షమించుట లేదని నిశ్చయించియున్నావుకదా!" అనియెను.

"అవును."

కమలచెంపపై మెల్లగ నొక్కదెబ్బ వేసి యన్నపూర్ణ "పిచ్చిదానా! దీనికో యింతకోపమా? ఇట్టిగర్వము పనికిరాదు. పొమ్ము ముఖమును జేతులును కడుగుకొని రమ్ము" అనియెను.

అన్నపూర్ణ మఱునాఁడు తనతండ్రిగారి కొక యుత్తరమును వ్రాసెను. అందీ క్రిందియుదంతమును వ్రాసియుండెను.

"రమేశబాబు, ఒక్కకమ్మయైన వ్రాయకుండుటచేఁ గమల యత్యంతోత్కంఠయై పగలుఁ బొగలుచున్నయది. ఇచట నన్నియు నామెకుఁ గ్రొత్తగఁ గాన్పించుచున్నవి. దానికిఁదోడు రమేశబాబామెను పలుమాఱు వదలిపోవుచుందురు. ఉత్తరము వ్రాయరు. గావున నామె మిగుల దీనయై యున్నది. ఇందాశ్చర్యమేమి? అలహాబాదున వారికార్య మెప్పుడు ముగియునో? అందఱకును బనులుండును; కాని, తమ ప్రేమాస్పదలకు రెండక్షరములలోఁ దమయోగక్షేమములనుగుఱ్చి వ్రాయుటకు వలనుపడదా?"

చక్రవర్తిగారు రమేశుని దర్శించి తమపుత్రికవ్రాసినయుత్తరములోని కొన్నిసంగతులు వినిపించి యతనిపై నొక్కింతకోపించిరి.

రమేశచంద్రుని హృదయము కమలవైపునకుఁ బరుగెత్తు చుండెను. ఇందెంతమాత్రమును సంశయము లేదు; కాని, నడుమ నడుమ సంశయావిష్టమగుచుండెను.

ఈసంశయజాలమునఁ జిక్కుపడియుండుటవలననే రమేశచంద్రున కలహాశాహనుండి మరలుటయు వ్యర్థమని తోఁచెడి. ఇంతలో నాతఁడు చక్రవర్తిగారివలన నన్నపూర్ణ వ్రాసినయుత్తర మందలి సంగతులను వినెను. కమల తనకొఱకుత్కంఠయై యున్నదని యతనికి నమ్మకముకలిగెను. కేవలలజ్జావశయై స్వయముగ నామెయుత్తరము వ్రాయలేదని యనుకొనెను.

ఇపుడు రమేశచంద్రునిహృదయమందలి ద్వైధీభావముమెల్ల మెల్లఁగ నదృశ్యముకాఁజొచ్చెను. ఇంతవఱకును గమలకుఁ దనయెడ వలపులేదనియే యతఁడు శంకించుచుండెను; కాని, నేఁడదియు విశదమయ్యెను. అతనికిట్లుతోఁచెను—"కమలకుఁ దనయెడల నమిత ప్రేమకలదు. నదీద్వీపమున, నిసుకనేలయందు విధాత తనకు నామె దర్శనము సంఘటింపఁజేయుటమాత్రమేకాక, తమయిరువురిహృదయములను సమ్మేళన మొనరించియున్నాఁడు."

రమేశుఁ డొక్కక్షణమైనఁ గాలయాపనము సేయక కమల కొకయుత్తరమును వ్రాసెను.

"ప్రియతమా!

పైపంక్తిలో నేశబ్దముతో నేనునిన్ను సంబోధించుచున్నానో, యదియొక్కయుత్తరమునఁ బ్రారంభమున లిఖించుశిష్టాచారసమ్మతమగుపద మని నీవెంచకుము. నేఁడీజగమున నిన్ను నేనన్నిటికన్నఁ బ్రియముగఁ గాంచకుండినచో, నిన్ను "ప్రియతమా" యనుపద

మునను సంబోధించియేయుండను. నీమనమున నెన్నఁడైన నావిషయము న నెట్టిసంశయమైన నుద్భవించియున్నచో, నీకోమల హృదయమును నెన్నఁడైన నొప్పించియున్నచో, నేఁడు నేను నిన్నుఁ బరిశుద్ధభావము తోఁ బ్రియతమా! యను పేరున సంబోధనము చేయుచున్న కారణ మున నైన నీవు నీమనసునందలిసకలసంశయములనుద్యజింపవలయును; నీసర్వదుఃఖములను మఱచిపోవలయును; నీయూఱట కై యింతకన్న మఱియేవిషయమును నీకుఁ వ్రాయుదును? నీహృదయమునకు దుఃఖ కరములగు కార్యము లనేకసమయములలో నేనొనర్చియుందును; అందు లకై నీవు నన్ను దూషించుచుండినచో, నందాశ్చర్య మందఁదగిన దేమియునులేదు పలుమాటలేల? నేనెంతయోనొక్కి చెప్పుచున్నాను. నీవే నాప్రియతమవు; ఈజగమునసీకన్న నాకు మఱేవస్తువును బ్రియ ముకాదు. ఇంతటితో నాయపరాధము లన్నియుఁ దీరిపోవకున్న మఱి యెందునను దీరునవికావు;

నేను ప్రియతమా! యని సంబోధించి నేను నీసకలసంశయ ములను నివర్తింపఁజేయుచున్నాఁడను. ఈసంబోధనము మనయిరు పురినడుమను బ్రేమబీజ మంకురిత మయ్యెను. నావిన్నప మింతియె; నీవే నాప్రియతమవు! ఈనావాక్యమునందు నమ్మకముంచుము. నా విషయమున నీవెంతమాత్రము ననుమానింపకుము.

"ఇంతయైనవిస్మృటనుగూడ నీకు నాపై వలపు కలదో లేదో యని యడుగుసాహసము నాకులేదు. నేను చానిని గూర్చి ప్రశ్నించు వాఁడనుగాను. ఈప్రశ్నోత్తరమెన్నటికైనను నేతెరంగునన్నైన నీహృదయమునుండి గుప్తరీతిని నాహృదయమునఁ బ్రవేశించుటయే తథ్యము. నేనిట్లని నాప్రేమాధికారబలముచే నొక్కి చెప్పుచున్నాను. నాప్రేమబలముపై నాకు గర్వము కలదనికాదు; కాని, యేకార్యసి ద్ధికై నేనంతఃకరణపూర్వకముగఁ బ్రయత్నించుచున్నానో యదిది సిద్ధింపకుండు టెట్లు?

చక్రవర్తిగారు రమేశుని దర్శించి తమపుత్రిక వ్రాసినయుత్తరములోని కొన్నిసంగతులు వినిపించి యతనిపై నొక్కింతకోపించిరి.

రమేశచంద్రుని హృదయము కమలపైపునకుఁ బరుగెత్తుచుండెను. ఇందెంతమాత్రమును సంశయము లేదు; కాని, నడుమ నడుమ సంశయావిష్టమగుచుండెను.

ఈసంశయజాలమునఁ జిక్కుపడియుండుటవలననే రమేశచంద్రున కలహాశాకనుండి మరలుటదు ష్కరమని తోఁచెడి. ఇంతలో నాతఁడు చక్రవర్తిగారివలన నన్నపూర్ణ వ్రాసినయుత్తర మందలి సంగతులను వినెను. కమల తనకొఱకుత్కంఠతయై యున్నదని యతనికి నమ్మకముకలిగెను. కేవలలజ్జావశయై స్వయముగ నామెయుత్తరము వ్రాయలేదని యనుకొనెను.

ఇపుడు రమేశచంద్రునిహృదయమందలి ద్వైధీభావము మెల్ల మెల్లఁగ నదృశ్యముకాఁజొచ్చెను. ఇంతవఱకును గమలకుఁ దనయెడ వలపులేదనియే యతఁడు శంకించుచుండెను; కాని, నేఁడదియు విశదమయ్యెను. అతనికిట్లుతోఁచెను—"కమలకుఁ దనయెడల నమితప్రేమకలదు. నదీద్వీపమున, నిసుకనేలయందు విధాత తనకు నామెదర్శనము సంఘటింపఁజేయుటమాత్రమేకాక, తమయిరువురిహృదయములను సమ్మేళన మొనరించియున్నాఁడు."

రమేశుఁడొక్కక్షణమైనఁ గాలయాపనము సేయక కమలకొకయుత్తరమును వ్రాసెను.

"ప్రియతమా!

పైపంక్తిలో నేశబ్దముతో నేనునిన్ను సంబోధించుచున్నానో, యదియొక్కయుత్తరమునఁ బ్రారంభమున లిఖించుశిష్టాచారసమ్మతమగుపద మని నీవెంచకుము. నేఁడీజగమున నిన్ను నేనన్నిటికన్నఁ బ్రియముగఁ గాంచకుండినచో, నిన్ను "ప్రియతమా" యనుపద

ము: నను సంబోధించియేయుండను, నీమనమున నెన్నఁడైననావిషయము న నెట్టిసంశయమైననుద్భవించియున్నచో, నీకోమల హృదయమును నెన్నఁడైన నొప్పించియున్నచో, నేఁడు నేను నిన్నుఁ బరిశుద్ధభావము తోఁ బ్రియతమా! యనుపేరున సంబోధనము చేయుచున్న కారణ మున నైన నీవు నీమనసునందలిసకలసంశయములనుద్యజింపవలయును; నీసర్వదుఃఖములను మఱచిపోవలయును; నీయూఱటకై యింతకన్న మఱియేవిషయమును నీకువ్రాయుదును ? నీహృదయమునకు దుఃఖ కరములగుకార్యము లనేకసమయములలో నేనొనర్చియుందును; అందు లకై నీవు నన్ను దూషించుచుండినచో, నందాశ్చర్య మందఁదగిన దేమియునులేదు పలుమాట లేల? నేనెంతయొనొక్కి చెప్పుచున్నాను, నీవే నాప్రియతమవు; ఈజగమునసీకన్న నాకు మఱేవస్తువును బ్రియ ముకాదు. ఇంతటితో నాయపరాధము లన్నియుఁ దీరిపోవకున్న మఱి యెందునను దీరునవికావు;

నేను ప్రియతమా! యని సంబోధించి నేను నీసకలసంశయ ములను నివర్తింపఁజేయుచున్నాఁడను. ఈసంబోధనము మనయిరు వురినడుమను బ్రేమబీజ మంకురిత మయ్యెను. నావిన్నప మింతియె; నీవే నాప్రియతమవు! ఈనావాక్యమునందు నమ్మకముంచుము. నా విషయమున నీవెంతమాత్రము ననుమానింపకుము.

"ఇంతయైనపిమ్మటనుగూడ నీకు నాపై వలపు కలదో లేదో యని యడుగుసాహసము నాకులేదు. నేను దానిని గూర్చి ప్రశ్నించు వాఁడనుగాను. ఈప్రశ్నోత్తరమెన్నటికైనను నే తెరంగునసైన నీహృదయమునుండి గుప్తరీతిని నాహృదయమునఁ బ్రవేశించుటయే తథ్యము. నేనిట్లని నాప్రేమాధికారబలముచే నొక్కి చెప్పుచున్నాను. నాప్రేమబలముపై నాకు గర్వము కలదనికాదు; కాని, యేకార్యసి ద్ధికై నేనంతఃకరణపూర్వకముగఁ బ్రయత్నించుచున్నానో యదిది సిద్ధింపకుండు టెట్లు?

"నేనిప్పుడు వ్రాయునదంతయు స్వాభావికముగా నుండక కృత్రిమముగ నగపడుచుండునని నేనెఱుంగుదును. ఈయుత్తరమును దుత్తునుకలుగఁజేసి విసరి పారవేయవలెనని నాకుఁ దోఁచుచున్నది. కాని, యన్నివిషయములలోను బ్రీతిగొల్పించునట్టియుత్తర మింతలో నింక వ్రాయుటకు నాకలవిగాకున్నది. ఏలయన, నుత్తరమునునీవస్తు విరువురికొఱకై యున్నయది. అందులిఖించువానికల్పనకు యథేష్ట సంచారము చేయఁదగదు. ఏనాఁడును నయిరువురిహృదయముల నెట్టి భేదమునుండకుండునో, యానాఁడు నీమనసున కింపుగఁదోఁచున ట్లుత్తరమును వ్రాయుదును. గదిలోని రెండువైపుల తలుపులను దెఱచియుంచినప్పుడే వాయు వేయాటంకమును లేక విచ్చలవిడిగ సంచరించును. ప్రియకమలా! నీవు నీహృదయమును స్వచ్ఛమగుదర్పణమువలె నాయెదుట నెప్పుడుంతువో, యది నేనిప్పుడు వచింపలేను.

"కాని, యంతయును క్రమముగ జరుగఁగలదు. అందును గుఱించి చింతింపనక్కఱలేదు. ఈయుత్తరము నీకందినముఱునాఁడే గాజీపురమునుండును. నేనక్కడకు వచ్చునప్పుడు నీవు మననూతన గృహమున నుందువని నమ్ముచున్నాను. మనముచాలాకాలమునుండియు కలసిసంచరించుచునే యున్నాము. నేనిప్పుడు కడుంగడునధీరుఁడనైయున్నాఁడను. నూతన గృహమునఁ బ్రవేశించి నాప్రియతమను గృహలక్ష్మిస్వరూపమున నెన్నఁడు తిలకింతునా యని నామనంబత్యంతమును కుతూహలపడుచున్నది. ప్రేమస్నిగ్ధబగునీదృష్టిచే చిరసంతప్తంబగు నాహృదయమును దనుపఁజేయ నెంతయు నుత్సుకుఁడనై యున్నాఁడను. నీకుమఱపుకలిగియుండఁబోదు. ఆనాఁటివెన్నెలరాత్రి యేనదీతీరమున మనయిరువురకును బ్రథమసందర్శన సౌఖ్యము లభించెనో, యచ్చట నావరణములులేవు; పైకప్పులేదు; ఆప్తపరివారమునులేదు. ఆస్థల మన్నివైపులను తెఱవఁబడియే యుండెను. కాని,

యాస్థలమే నేఁడు స్వప్నమునందువలె నసత్యమని తోఁచుచున్నది. కావున, నొకనాఁడు గృహాంతరంగమందు నాసమ్మేళనమునకుఁ బూర్ణముగ సత్యస్వరూపము నొసంగుట కిచ్ఛగించుచున్నాను. సరళహృదయముతో ద్వారముకడనిలిచియుండు నీసహాసవదనమూర్తి నొక్కమారు తిలకించి దాసని శాశ్వతముగా నాహృత్పటమున నంకిత మొనర్పుట కాలోచించుచున్నాఁడను. నేనునీహృదయమందిర మందలియతిథినై యున్నాను, నాయెడల విముఖవుగాకుము.

నీప్రేమనభిలషించు రమేశుఁడు,"

---

# నా లు గ వ ప్ర క ర ణ ము.

## గంగా స్నానము.

కమల యుదాసీనయై యుండుటఁగని యామెచిత్తమును రంజింపఁదలచి యన్నపూర్ణ 'నేఁడు నీవు నీక్రొత్తయింటికడ కేగుదువా' అనియెను.

కమల—ఇప్పు డక్కడ కేగుటకుఁ బనిలేదు.

అన్నపూర్ణ—నీగృహమును శృంగారించుపను లన్నియుఁ దీరినవా?

కమల—ఆఁ తీరినవి.

అన్నపూర్ణ— (కొంతసేపూరకుండి) నీకొకవస్తువు నొసంగిన నాకేమి పారితోషిక మిచ్చెదవు?

కమల—నాయొద్ద నీకీయఁదగిన దేమున్నది?

అన్నపూర్ణ—ఏమియును లేదా?

కమల—ఏమియును లేదు.

అన్న—(చెంపఁగొట్టి) ఔను; నీవనినది నిదిమే. నీయొద్దనుండినదంతయుఁ నీవాకరి కర్పణముఁ గావించివేసితివి కాదా?

అని యన్నపూర్ణ పయ్యెదలో దాఁచి తెచ్చినయుత్తరమును బయటికిఁ దీసెను.

ఆయుత్తరముపై రమేశునిహస్తాక్షరములుండుటఁ గని కమల హృదయము విదీర్ణమయ్యెను. ఆమెముఖమునటు త్రిప్పుకొనియెను.

అన్న—సెబాస్! చాలుఁజాలు! ఇఁక శాంతింపుము. నేను నీమనసులోనియుదంత మంతయుఁ దెలిసికొంటిని, ఈ యుత్తర మెప్పుడు నాచేతిలోనుండి లాగికొందునాయని నీమనసులోనున్నది. కాని, పైకిమాత్ర మిట్టివేషము! బేష్! ఎప్పుడు నీవడుగుదువో యప్పుడే దీని నీకిచ్చెదను. ఎంతసే పిట్టిధైర్యమునటింతువో చూతము.

ఇంతలో నాడుకొనుచున్నయుమ తనయాటబండికి దారము నుగట్టి యీడ్చుకొనుచు వచ్చి "పిన్నీ" యని కమలను బిలిచెను.

కమల యాకూనను దటాలున నెత్తుకొని యానిసువుమోము నెల్లెడలను ముద్దులతో నించుచు శయనగృహమునకు వెడలిపోయెను. బండినీడ్చుట కాటంకము కలిగినందున నాపాప యేడువ నారంభించెను. కాని, కమల యాపసిబాలను విడువదయ్యెను. శయనగృహమున సుమను గూర్చుండఁబెట్టుకొని యనేకవిధముల నూఱడింపుఁబలుకులఁ బలుకుచు నాబాలిక నూరార్పఁ బ్రయత్నించుచుండెను.

అన్నపూర్ణ యట కేతెంచి "నేనోడిపోయితిని. నీవే గెలిచితివి. ఇంతధైర్యముతోనుండుట నావలనఁగాదమ్మా! నిశ్చయముగ నీవే ధన్యురాలవు. నీయట్టిస్త్రీ నెందు నెన్నడును నేనుఁజూచియుండలేదు. ఇదిగో నీయుత్తరము! వ్యర్థముగా నేనెందులకే నిన్నాయాస పెట్టవలయును!" అని యాయుత్తరమును కమలముందిడియుమ నెత్తుకొని వెడలిపోయెను.

కమల యుత్తరమును చేతనుంచుకొని కొంతసేపాలోచించెను. తరువాత నాయుత్తరమును విప్పెను. ఆకమ్మలోని మొదటి మూఁడు నాల్గుపంక్తులు చదునప్పటి కామెముఖ మెఱ్ఱవాఱెను. లజ్జాక్రోధములకు వశయై యామె యాలేఖను నేలఁ బడవైచెను. అనంతరము కొంతతడవున కామెశాంతించి, నేలపైఁ బడియున్న యుత్తరమును దీసి తుదవఱకుఁ జదివెను. అందలి సర్వభావములు నామె హృదయమున నాఁటెనో లేదో మీము చెప్పలేము. కాని, యామెచేతుల కా యుత్తరము భారమయ్యెనని మాత్రము నిశ్చయముగ వచింపఁగలము ఏలయన, నామె యాలేఖను నలిపి దూరముగా విసరివైచెను. ఏపురుషుఁ డామెకుఁ బతికాఁడో, యాతనిగృహమున గృహిణియై యుండుటయా? ఇందులకేనా యాతఁడామె నిక్కడకుఁ దెచ్చినది ఈవిచారముచే నామె మిక్కిలి దుఃఖించుచుండెను.

"రమేశచంద్రుఁ డెట్టెట్టియొటిఁగి యింతకాలమున కిప్పుడు నాపై ప్రేమజాలమును బ్రసరింపఁజేయుచున్నాఁడు. నేను గాజీపురమునకువచ్చినదాదిగా నాతనివిషయమై యింతటిప్రేమను వ్యక్తపఱచుట యాతనిఁ బతియనుకొనియేగదా! రమేశచంద్రుఁడు నేఁడీ ప్రణయపత్రికను లిఖించియున్న కారణమునుబట్టిచూడ నాతఁడు నాయెడ ననురక్తుఁడై యందువలన నాపై నింతగ దయఁజూపుచున్నట్లు తోఁచుచున్నది" ఇట్టివిచారాగ్ని యామెమనసునఁ బ్రబలి మండుచుండెను.

అజ్ఞానవశమునఁ జిక్కి కమల రమేశునియెదుట నేప్రేమభావమును బ్రదర్శించియుండెనో యీభాగము నిప్పుడేవిధముగా మరల గైకొనఁగలదు ? ఈ విచారమే యామె హృదయమును దగ్ధమొనరించుచుండెను. "ఇట్టిలజ్జాకరమును, ఖేదదాయకము నగుచరిత్రము నానొసటవ్రాసియుండఁబోలును? నేనింతవఱకు నెవ్వరికి నెట్టి

యపరాధమును జేసియెఱుంగను; ఇట్టిఘోరసంకటములు నాకొదవ నేల? నేను రమేశచంద్రునింట గృహిణీపదారూఢనై యుండనప్పుడు యీసంకటమునుండి భయానకత్వము పరమావధియే యగును."

యీసంకటమునుండి విముక్తిగాంచుమార్గము కమల కెఱుకపడ లేదు. రమేశచంద్రుఁ డన్న నిప్పు డామె కెంతభయమగుచుండెనో, యంతభయము రెండు దినములకుఁబూర్వ మామెకు స్వప్నముననైన గలిగియుండలేదు.

ఈసమయమున నుమేశుఁడు ద్వారముకడ కేతెంచిదగ్గెను. కమల నెమ్మదిగాఁ గూర్చుండియుండుటఁ గని, వాఁడు "అమ్మా!" యని మెల్లగఁ బిలిచెను. కమల తలుపుకడ కేతెంచెను. ఉమేశుఁడు "శ్రీపతిబాబుగారు తమకుమార్తె వివాహమునకుఁ గలకత్తానుండి యొకనాటకసంఘమును బిలిపించియున్నారు." అనియెను.

కమల—సరే నీ వాఁట జూడఁబొమ్ము.

ఉమేశ—రేపటియుదయమున మీకుఁ బుష్పములు కావలెనా?

కమల—అక్కఱలేదు. పూలతో నాకుఁ బనిలేదు.

ఉమేశుఁడు పోఁబోయెను. కమల మరల వానిని బిలిచి "ఉమేశా! నీవు నాటకముఁ జూడఁబోవుదువేని పోవునపుడు వీనిని దీసికొనిపొమ్ము!" అని వానిచేతి కైదురూప్యము లొసంగెను.

ఉమేశునకు మహాశ్చర్య మయ్యెను. నాటకముంజూచుట కైదురూపాయ లెందులకో యివియేమిచేయవలయునో వానికిఁ దెలియ లేదు, వాఁడు "బజారునుండి యేమైన మీకుఁ దేవలయునా?" యని యడిగెను.

కమల—వలదు. నాకొఱకు నీవేమియుఁ దేనక్కఱలేదు నాకేమియు వలదు. రూప్యములు నీయొద్ద నుంచుకొనుము. అవి నీ కుపయుక్తములగును.

ఉమేశుఁడు పోఁబోయెను. కాని, వానిని గమల మరలఁ బిలిచి "ఉమేశా! నీవిట్టివస్త్రములు ధరించియా నాటకముఁ జూడ నేఁగెదవు? లోకులు నిన్నేమందురు?" అనియెను.

తన పేదతనపు వస్త్రములఁ గని లోకులు నవ్వుదురని యుమేశుఁ డెన్నఁడు ననుకొనలేదు. కమలమాటలచే వానికిఁ గౌతుకమయ్యెను. వాఁడు నవ్వెను. కమల రెండు పట్టంచుధోవతులుతీసి "వీనిం గొని యిందొకటి కట్టుకొనుము; వేరొకటి పైని ధరింపు" మనియెను.

ధోవతులమనోహర మగుపట్టంచుఁ గని యుమేశునిహృదయ మానందముతోఁ దాండవమాడుచుండెను. వాఁడు కృతజ్ఞతాపూర్వక బుద్ధితో నామెపదములపై మస్తకము నిడెను. అటుపిమ్మట నతి కష్టముతోఁ దననవ్వు నణంచుకొని యుమేశుఁడు మెల్లమెల్లఁగ నట నుండి వెడలిపోయెను.

ఉమేశుఁడు వెడలిపోయిన పిమ్మటఁ గమల కిటికీసమీపమున నిలుచుండి యశ్రువుల వెల్లార్పఁజొచ్చెను.

అంతట నన్నపూర్ణ యట కేతెంచి 'కమలా! రమేశబాబు నీకువ్రాసినయుత్తరము నాకుఁ జూపవా!" యనియడిగెను.

అన్నపూర్ణ తనయభిప్రాయమును కమల కెటింగించియున్న కారణమునఁ బైవిధముగ నడుగుట కామె కనుమానము కలుగ లేదు.

'ఆయుత్తర మచ్చటఁ బడియున్నది

అన్నపూర్ణ యాశ్చర్యచకితయై తనలోఁ ' బతిపైనింతక్రోధమా! ఈక్రోధ మింకను శాంతింపలేదా! ఈక్రోధమునకు ధిక్కార మగుఁగాక!" యనియనుకొనెను.

పుడమిపైఁ బడియున్న యాయుత్తరముఁదీసికొని యామె తుద వఱకుఁ జదివెను. ఉత్తరము వలపు లోలుకుపదములచే నిండియుండెను; కాని, యందలిభావ మామెకు బోధపడలేదు. పురుషుఁ డెవ్వఁడును దనపత్నికిట్టియుత్తరములు వ్రాసియుండఁడు. ఇనియు నొక యుత్తరముౘ్రాయు విచిత్ర పద్ధతియేయని యామెకుఁ దోఁచెను.

అన్నపూర్ణ—కమలా! నీభర్త కాదంబరి వ్రాయుటకుఁ గూర్చుండియుండఁడుకదా?

భర్త" యనుపద మామెకర్ణమునఁ బడినంతనే కమలముఖము వివర్ణమయ్యెను. 'నాకుఁ దెలియదు' అనిప్రత్యుత్తరమిచ్చెను.

అన్నపూర్ణ—నేఁడు నీవు నీక్రొత్తయింటికరుగుదువా? నిన్నాన్నాయింటనే యుండుమని రమేశబాబు సూచించియున్నాఁడు

'పోవుదును '

"నేఁడు సాయంకాలము మహానందమున నీతో నీగృహాము నకు వచ్చియుందును; కాని, నేఁను నరసింహబాబుగారిభార్య వచ్చుచున్నదని నీకుఁ దెలియునుగదా! నీ వెంట మాయమ్మవచ్చును."

కమల—(బెదఱుచూపులతో) వలదు. వలదు. వ్యర్థముగా వారి కీప్రయాస యెందులకు? అట సేవకులున్నారు. నాకేమియుఁ గావలసియుండదు.

అన్నపూర్ణ—(నవ్వి) అంతియే కాక నీయుమేశుఁడును నీయొద్ద నున్నాఁడు. మఱి, నీకేమిభయము?

ఈసమయమున నుమ పెన్సిలుతో నొకపలకపై తనకిచ్చవచ్చినట్లు వంకరగీతలు గీచుచు, నర్థరహితములగుపలుకుల నుచ్చరించుచుండుటలో మగ్నమైయుండెను. ఆబాల తానేమో చదువుచున్నానని యనుకొనుచుండెను.. అన్నపూర్ణ యాశిశువుచేతిలోని పెన్సిలును బలకను లాగికొనగా, నాకూన చదువున కాటంకముకలి

గెను. ఉమ యేడువఁదొడగెను. కమల యాబాలిక నెత్తికొని తొడపై నుంచికొని యూరార్ప నారంభించెను.

"ఊరకుండుము; నీకొకవింత వస్తువునిచ్చెద" నని కమల తన చంక నాపాప నెత్తుకొని యోదార్చెను. కాని, నాకు వింతవస్తువిమ్మని యాశిశువుపట్టు పట్టెను. అప్పుడు కమల తనపేటికను దెఱచి యందలి సువర్ణకంకణములజత తీసెను. ఇట్టిరమ్యవస్తువు తనకాటలాడుకొనుటకు లభించుననుగదాయని యుమ సంతోషభరితస్వాంతయయ్యెను కమల యాకంకణద్వయము నాబాలహస్తములఁ దొడిగెను. ఉమయా "వింతవస్తువును"జూపుటకై తనతల్లికడ కేగెను. ఆపిల్లచే తిసువర్ణకంకణములఁ గాంచి యన్నపూర్ణ యాశ్చర్యచకిత యయ్యెను. ఆమె యామురుగులజతను దీసి కమలకడ కరిగి"కమలా! నీవు పిచ్చిదానవు కావుకదా? ఇట్టియమూల్యపదార్థము నెవ్వరైనఁ బసిపిల్లల చేత నిడుదురా?" యనియెను.

తనతల్లియొక్క కఠోరవర్తనముం గని యుమ ప్రలాపింపఁ జొచ్చెను. కమల "ఈబంగరు మురుగుల నీబాలిక కేనిచ్చివేసితిని" అనియెను.

"నీకు మతిచాంచల్యము కలిగియుండ లేదుకదా?"

"నేనుశపథపూర్వకముగ నుడువుచున్నాను; వీని నింక నెన్నఁడును మరలఁగైకొనుదానఁ గాను. వీనింగరఁగించి హారము చేయించి యాబాలమెడ నిడుము."

"కమలా! నిశ్చయముగ నేనెన్నఁడును నీయట్టి సరళహృదయను గాంచి యెఱుంగను" అని అన్నపూర్ణ కమలను గౌఁగిలించుకొనియెను.

కమల—(బాష్పాంబువులు కపోలములపైఁగారఁ)అన్నపూర్ణా! నేఁడు నేను నీయింటినుండి వెడలిపోవుచున్నాను. ఇన్నిదినములు నేని

చ్చట సౌఖ్యమున గడిపితిని. ఇట్టిసౌఖ్యము నేనీజన్మమున వెన్నఁడు ననుభవింపనైతి.

అన్నపూర్ణ నేత్రము లశ్రుజలపూరితము లయ్యెను. అట్లుండియు ధైర్యోత్సాహమొసఁగు కంఠముతో "నెచ్చెలీ! నీవింత యధీరనైతి వేల? నీదీనవదనముఁజూడ నీవేదో పరదేశమునకుఁ బోవుదాని వలెఁ గన్పట్టుచున్నది. నీవు నాయింటనుండి యెట్టిసౌఖ్యముల ననుభవించితివో యది చెప్పనక్కఱలేదు. నేనంతయు నెఱుఁగుదును. ఇప్పుడు నీమార్గమునందలిసకలవిఘ్నములును దూరమైనవి. ఇఁక నీవు నీయింటికేగి స్వతంత్రముగ రాజ్యమేలుము. మేమెన్నఁడైన మీయింటి కేతెంచినచో, నీవీడ యెచటనుండి వచ్చెనా యని నీకుఁ దోఁచును" అనియెను.

వెడలునపుడు కమలయన్నపూర్ణచరణములపై మస్తకమిడెను.

అన్నపూర్ణ—(దీవించి) రేపురెండుజాములకు నేను నీయింటికి వత్తును.

కమల మాటాడలేదు. దీనస్వరముతో నటనుండి బయలుదేరెను. నూతనగృహమున కేతెంచినవెంటనే యట నుమేశునిఁ గాంచి కమల "ఏమిరా? నీవు నాటకమును జూడఁబోలేదా?" యని ప్రశ్నించెను.

ఉమేశ—మిమ్మిచట నొంటరిగ డించి నేను—

కమల—నీకావిచార మేల? నీవు నాటకముఁ జూడఁబొమ్ము. ఇచట మోహనుఁ డున్నవాఁడు.

ఉమేశ—ఆట ప్రారంభించుట కింకను నవకాశమున్నది.

కమల—అయిన నేమి? శ్రీమంతులయింట పెండ్లి; అచ్చట ననేకము లగు వేడుకలు జరుగును. అవన్నియుఁ జూడరాదా?

ఈవిషయమున సుమేశున కింతకన్న నెక్కుడుత్సాహ మొసంగుట యనావశ్యకము. వాఁడు పోఁబోయెను; కాని కమల వానిని మరలఁ బిలిచి "చక్రవర్తిగారు మరలినపిమ్మట నీవు—"

అనియేమో చెప్పఁబోయి, యంతలో నాఁగెను. మరలఁ గొంత తడవున కామె "చక్రవర్తిగారికి నీయెడలఁ బ్రేమ కలదు. నీకెన్నఁడైన నేదైన వలసియున్న వారినడుగుచుండుము; వారు నీకు గావలసినవన్నియు నిత్తురు. వారికి నావందనములర్పింపుము. మఱవకుము" అనియెను.

ఈపలుకులయందలిభావ మెఱుఁగక వాఁడు "చిత్రము" అని వెడలిపోయెను.

మూఁడవజామునఁ గమల పోవుచుండుటఁ గని మోహనుఁడు "అమ్మగారూ! ఎక్కడికిఁ బోవుచున్నారు?" అని యడిగెను.

"గంగాస్నానమునకు."

"నేనును వత్తునమ్మా!"

"వలదు. నీవిటనుండి గృహముఁ గనిపెట్టుచుండుము."

అని వచించి కమల మోహనుని హస్తమున నొకరూపిక నిడి యటనుండి వెడలిపోయెను.

---

## ఐదవ ప్రకరణము.

### ఆనందము.

ఒకనాఁడు మూఁడవజామున దేనీరుత్రాఁగుటకై నళినిని వెదకుచు ఘనానందబాబు మేడమీఁది కేగెను. ఆమె మేడపైఁ దన గదిలో లేదు. శయనగృహమునకుఁ బోయి చూచెను. అచ్చటను గనఁబడలేదు. ఆమె బయటి కెక్కడికి నేగలేదని సేవకుఁడు

చెప్పెను. అప్పుడు ఘనానందబాబు భయపడెను. బయటికిఁ బోయి మ్మూచెను. సూర్యుఁడస్తాద్రికేగుచుండెను. ఒకమూలఁ గూర్చుండి నళిని తనకపోలములపైఁ జేయినిడికొని దీర్ఘాలోచనా నిమగ్నయై యుండెను.

ఘనానందబాబెప్పుడామె వెనుకకువచ్చి నిలిచెనో యామెకుఁ దెలియలేదు. కడకాతఁ డామెను సమీపించి వీపుపైఁ జేయిడెను; ఆమె యులికిపడి వెనుకకుఁ దిరిగిచూచెను; ఆమె సిగ్గుతో లేవఁజూచెను గాని, యింతలో ఘనానందబాబామెకడ గూరుచుండి యొక్క నిట్టూరుపు విడిచెను,

"అమ్మాయీ! మీయమ్మ యిపుడు జీవించియుండిననీకింతటి దుఃఖము కలిగియుండునా? నీదుఃఖమును లేశమాత్రమైన నివారణము సేయుట నావలనఁ గాకున్నది కదా!"

వృద్ధజనకుని యీకరుణాపూర్ణభాషణములువిని కాంబోలు, నామెకుఁ బటాలున దెలివివచ్చెను; ఒక్కపటి తనతండ్రివంక నీక్షించెను. ఆముఖమున స్నేహము, కరుణ, శోకము, ఒక్కసమయము ననే ప్రతిబింబితములైయున్నట్లు లామెకుఁగనఁబడెను. ఇటీవల నాతని మనసొకింత మారియుండెను. నళినీవిషయమై కలిగినకల్లోలమున నాతఁ డొక్కఁడే యామెపక్షమునఁ బలుకుచుండెను. ఆతనికి సాహాయ్యమొనర్చువారింక నెవ్వరు నుండలేదు. హృదయమును భేదించు వాక్శరపరంపరలచే నామెను దూలనాడుట కెందఱో సిద్ధముగ నుండిరికాని, యామెనుసాంత్వనవచనములచే నూరడించుభార మంతయు ఘనానందబాబొక్కనిమీఁదనే యుండెను. అందునను దనకు యశ ముకలుగకుండుటచే నాతనికి నేఁడు భార్య స్మరణకువచ్చెను.

కొంతతడవువఱకు నళిని తలవంచి యూరక కూర్చుండి యుండెను.

పిమ్మట క్షణకాలము సుఖదుఃఖముల నన్నిటిని మఱచి నళిని తండ్రినిగని "నాన్నగారూ! మీ దేహస్థితి యెట్లున్నది?" అని యడిగెను.

దేహారోగ్యమునెడల లక్ష్యముంచు విషయమై ఘనానంద బాబు మఱచియుండెను. అతఁడు "నా దేహస్థితియా! నా దేహస్థితి బాగుగనేయున్నది. నావిచార మంతయు నీస్థితిగూర్చియే. నాకింక నేమి కావలసియున్నది? వార్ధకము వచ్చియుండి ననునొక్క విధమునఁ బరికింప నాశరీరస్వాస్థ్యము సమాధానముగనె యున్నయది. కాని నీయీదురవస్థం గని నీయారోగ్యమునకు భంగముకలుగునేమో యని నాకు భయమగుచున్నది." అని వచించి యతఁడామెవీఁపుపైఁ జేయిఁ జఱచెను.

నళిని—మాయమ్మ మరణించినప్పుడు నేనెన్నేళ్ళదానను?

ఘనానంద—నీకప్పుడు మూఁడేండ్లు, కొంచెము కొంచెము మాటలు వచ్చుచుండెను. నాకింకను జ్ఞప్తియున్నది, నీవు "అమ్మ యేది?" అని నన్నడిగితివి. నేను "మీయమ్మ తనతండ్రి దగ్గఱకుఁ బోయిన" దని యంటిని, నీవు పుట్టుటకుఁ బూర్వమే నీమాతామహుఁడు పరలోకమున కేగెను. నీవు వారినిఁ జూడలేదు. మాతామహుఁడన నెవరో నీకప్పుడు తెలియదు. నీప్రశ్న కేనిచ్చినయుత్తరము నీకర్థము కాలేదు. నీవూరక నాముఖమును జూచుచుంటివి. పిమ్మట నీవు నాచేయిని బట్టుకొని నీతల్లియుండినస్థలమునకుఁ బిలుచుకొని పోవసాగితివి. నేను నిన్ను నీతల్లియొద్దకుఁ బిలిచికొనిపోవుదుననియు, నీతల్లి నీకుఁ గనబడుననియు నీవు తలచియుంటివి. అన్నియు నీతండ్రి యెఱుఁగుననుకొనియుంటివి. కాని, తెలిసియున్న సంగతినిఁ జెప్పుట కాతనికి శక్తి లేదని నీవెఱుఁగవు. అప్పుడు నేనెట్టు లుంటినో యిప్పుడు నట్టులే యున్నాను. పరమేశ్వరుఁడు నీతండ్రి

హృదయమున స్నేహము దయ మొదలగునవి యిచ్చియున్నాఁడు గాని అమర్త్య మిచ్చియుండలేదు.

అని ఘనానందబాబు తనదక్షిణహస్తము నామెశిరముపై నిడెను. పితృవాత్సల్యభావముచే నళిని శరీరము పులకరించెను.

'అమ్మసంగతులు నాకుఁ గొన్నియే జ్ఞప్తియున్నవి. రెండు జాముల వేళ కామె మంచముపైఁ బరుండి యేదో పుస్తకముఁజదువుచుండెను. నాకది యిష్టముగా నుండలేదు. ఆమెచేతిలోని పుస్తకము లాగికొని దానితో నాడుచుండవలెనని నాకుఁదోఁచుచుండెను.

ఇత్తెఱంగునఁ దండ్రిబిడ్డలు సంభాషించుచుండఁ బూర్వ వృత్తాంతము లన్నియు వెలువడెను. సూర్యాస్తమయమగును వచ్చెను. కలకత్తాపురవాసు లందఱుఁ దమతమ సాయంకాలకృత్యముల యందు మగ్నులైరి. ఘనానందబాబును, నళినితో మాత్రము మేడపై గూర్చుండి సుఖదుఃఖముల సంగతు లన్నియు మాటలాడుకొనుచుండిరి.

ఇంతలో మెట్లపై యోగీంద్రుని యడుగులచప్పుడు వినవచ్చెను. మాటల నాపి యిరువురుఁ బ్రదటాలున లేచి నిలిచిరి. యోగీంద్రుఁడు తీవ్రదృష్టితో వారింగని 'నళినిసభ యిటీవల నిక్కడ సమావేశ మగుచున్నట్టులున్నది!' అనియెను.

నళిని స్వతంత్రవిచారప్రవృత్తియెడ యోగీంద్రునకుఁ గోపించుచుండెను. ఇంట రేయుంబవలు వసించుచున్న శోకమూర్తిఁ గని యిల్లనిన నతని కసహ్యముగ నుండెను. అప్తులగృహముల కేగినచో నళినీ వివాహసంబంధమయి యందఱు నెన్నియో ప్రశ్న లడుగుచుందురు; వారికందఱకును బ్రత్యుత్తర మొసఁగుచుండవలెను. కావున, నాప్తులగృహముల కేగుటకు నతని కిష్టములేకపోవుటచే నింటనుండ వలసివచ్చెను. అతఁడు పలుమఱుఁ దనలో నిట్లనుకొనును. నిశ్చయ

ముగ నళిని పిచ్చిది. ఆమె వంశపరంపరాగతమైనలజ్జామర్యాదాదుల ద్యజించినది. స్త్రీల కింగ్లీషునవలలు చదువ నిచ్చినచో నిట్టికల్లో లము లుద్భవించుట తథ్యము. రమేశుఁడు తన్నుఁ బరిత్యజించిన కారణమునఁ దనజీవితము నిష్ఫలమనియుఁ దనహృదయ మేటికింకను వేయివ్రక్కలు కాలేదనియు నళినికిఁ దోఁచుచుండును! నవలలఁ జదువుటవలనను, నాటకావలోకనము మూలముననుస్త్రీలెందఱో తమ జీవితములను మంటఁగలుపుచున్నారు. ఈప్రేమపిశాచ మెందఱో స్త్రీలశిరసులపై స్వారిచేయుచు వారివలన నెట్టికృత్యములైనఁ జేయించుచుండును.''

యోగేంద్రుఁ డింకను నళినినుద్దేశించి యేదోమర్మభేదకశబ్దము.లుచ్చరించు నేమో యనుభయముచే ఘనానందబాబు''నళినితో నేనేమో మాటలాడుచుఁ గూర్చుండియున్నాను. ''అనియెను. అందలిభావార్థ మిది—నేనే స్వయముగ మాటాడుట కామెను మేడ మీఁదకుఁ బిలిచితిని. కాని, యామె స్వయముగ ''సభసమావేశము'' చేయు లేదు.

యోగేంద్ర—అదేల? తేనీరుఁ ద్రాగుచు నటఁ గూర్చుండియే మాటలాడుచుండవచ్చునుగదా!

నళిని—(చకితయై) నేఁడు నాన్నగారు తేనీరుద్రాగ లేదు.

యోగేంద్ర—తేనీరనఁగా, సూర్యాస్తమయ సమయమున నెట్టిని యాకసమునుండి పడునట్టి కవికల్పనావస్తువుకాదు. మేడపైఁ గూర్చుండియుండునెడఁ దేనీరుగిన్నె తనంతట మీచేతులకు రాఁజాలదు. దానికొఱకుఁ జేతులును గాళ్లును గదలింపవలయును.

నళిని విచారహృదయ యగుటంగని ఘనానందబాబిట్లనియెను నేఁడు నేను తేనీరు త్రాగనందున మేడఁ దిగిరాలేదు.

యోగేంద్ర—అనఁగా భోజ్యములు వదలి తాపసులగుదురా యేమి? కేవలవాయుభక్షణము చేసి నేనుండలేను,

ఘనానంద—నిన్న రాత్రి నాకు నిద్దురపట్టలేదు. కావునఁ దేనీరుఁద్రాగకుండిన ప్రకృతి యెట్లుండునో చూడదలఁచియున్నాను.

ఇప్పుడు నళినితో సంభాషించుచుండ ఘనానందబాబుగారి ముందఱ నెన్నియోమారు లెన్నియో తేనీటిగిన్నె లెదుటఁగనబడుచుండెను. కాని, వానియెడ నాతఁడు నిర్లక్ష్యభావముంచెను. బహుకాలమునకు నేఁడు నళిని యితనితో నిష్కళంక హృదయముతోఁ బలుకులాడుచుండెను. అతనిహృదయము ప్రేమతో నిండి యుబికియుండెను.

రాత్రి నిద్దుర పట్టనందునఁ దేనీరుఁ ద్రాగలేదని ఘనానందబాబనియెనేగాని యది నిజమని నళినికిఁదోఁచలేదు. ఆమె తేనీరుఁ ద్రాగుటకు లెమ్మని తండ్రిగారి నెంతో ప్రతిమాలెను. ఘనానందబాబు నిద్దుర రాదనుమాటఁ దత్క్షణము మఱచిపోయి తేనీరుబల్ల చెంతకేగి కూర్చుండెను.

మేడదిగివచ్చి చూడ నాబల్ల చెంత నక్షయకుమారుఁడు కూర్చుండియుండెను. అతనిఁ గాంచినంతనే ఘనానందబాబు మనసునకుఁ గష్టము దోఁచెను. నేఁడు నళినిహృదయముసైతము ప్రసన్నమై యుండెను' కాని, యక్షయకుమారునిఁ గాంచినంత నామె మరల మ్లానభావము వహించునని తండ్రికిఁ దోఁచెను. కాని, యతఁడిప్పుడేమిచేయఁగలఁడు? అనతికాలముననే నళినియుఁ దేనీరుఁద్రాగుస్థలమునకు వచ్చెను. ఆక్షణముననే యక్షయకుమారుఁడు లేచి నిలిచి యిట్లనియెను. "యోగీంద్రబాబూ! నేను వెళ్లుచున్నాను."

నళిని—ఏమి! అక్షయబాబూ! ఇంత తొందరయేల? ఇంటనేవైన నవసరకార్యము లున్నవా? తేనీరుఁద్రాగి పోవచ్చునుగదా?

నళినియాడిన యీపలుకులు విని యందఱకు నాశ్చర్యమయ్యెను. అక్షయకుమారుఁడు మరల కుర్చీపైఁ గూరుచుండి "మీ

రిక్కుడకు రాకమున్న నేను రెండుగిన్నెలతేనీఁటితోఁ బొట్ట నిండించు కొంటిని. ఎవ్వరైనఁ బ్రార్థించిన నింకను రెండుగిన్నెలఁద్రాగుట కెట్టి యాటంకమును లేదు. అనియెను.

నళిని—(నవ్వి) తేనీఁరు ద్రాగువిషయమున మిమ్మొకరు ప్రార్థించుట యనావశ్యకముకదా!

అక్షయ—అవశ్యము లేకపోయినను, మంచివస్తువుల నేనెన్న డును దిరస్కరింపను. ఈశ్వరుఁడు నాకంతయోగ్యత నొసంగి యున్నాఁడు.

యోగీంద్ర—మీ యాశ్రద్ధంగని యామంచివస్తువు సైతము మిమ్మెన్నఁడు ననాదరణము సేయకుండుఁగాక! అని నే నాశీర్వ దించుచున్నాను.

చాలకాలమునకు నేఁడు ఘనానందబాబుగారియింట హాస్య వినోదములు జరుగుచుండెను. ఇంతకుఁబూర్వ మితరసమయములలో నెవ్వరైన నవ్వుఁబుట్టించుపలుకు లాడినను నళిని నక్కయె తన గాంభీర్యముద్రను వీడకుండెను. కాని, నేఁడామె పలుమఱు నవ్వు చుండెను. ఈమె యెప్పటినళినియేనా? ఎవ్వరు నీమెయే యనలేరు. ఆమె యక్షయకుమారునిఁ బరిహాసింపనెంచి యిట్లనెను. "నాన్నగా రూ! అక్షయబాబుగారి యీాయన్యాయముఁ గనుఁడు! మీామా త్రల నుపయోగపఱుపకయె వీరు స్థూలకాయులును, దృఢశరీరులు నైయున్నారు. వీరికి మీామాత్రలయెడ లవమాత్రమైనఁ గృతజ్ఞత యున్నయెడల వారేదికాకున్నను శిరోవేదనయనియైనఁ జెప్పుకొను చుందురు.

యోగీంద్ర—ఇందులకే మోసమని యందురు. ఆమాత్ర లవలన నితఁడు కృతఘ్నుఁడయి యున్నాఁడు.

ఘనానందబా బానందహృదయముతో నవ్వసాగెను. నేను తనమాత్రలసంబంధమైనపలుకులు వెడలుటవలన నెల్లరిహృదయములు శుద్ధమయియున్నవని తలంచి ఘనానందబా బానందించి నిశ్చితుం డయ్యెను.

"నామాత్రలపై లోకులకు విశ్వాస మధికాధిక మగుచున్నదని నాకుఁ దోఁచుచున్నది. అతఁడు నామాత్రలను సేవించుచుండును. కాని, యతఁడు వానిగుణమును మఱుఁగు పఱచుచున్నాఁడు."

అతఁడు—అందువలనమీరుచింతింపనక్కఱలేదు. మఱుఁగు పఱచుట నాకు సులభము కాదు.

యోగీంద్ర—అంతియేగాక, యొకరిని మోసము సేయుట యన నరహత్య సేయుటయే.

ఇవ్విధముగ నేఁడు తేనీరుఁగ్రోలుబల్లకడ నానందముఖములు కనఁబడుచుండెను. అనంతరము నళిని తనగదికి వెడలిపోయెను. అతఁడు నిష్క్రమించెను.

---

## ఆఱవ ప్రకరణము

---

### మీవివాహదివసము నిశ్చయము.

ఇదియే మంచిసమయమని యెంచి యోగీంద్రబాబు తండ్రిగారితో "నాన్నా! ఇంకఁ గాలయాపనముసేయుట మంచిదికాదు. నళినికి వివాహము సేయవలయును" అనియెను.

ఘనానందబాబు స్తబ్ధుఁడై యోగీంద్రుని వదనమును గాంచుచుండెను.

యోగీంద్ర—నళినిని రమేశచంద్రునకిచ్చి వివాహముసేయుటకు నిశ్చయించితిరికదా! ఏలచేయుటలేదని లోకులందఱు ననేకవిధములుగ ననుకొనుచున్నారు. నేనొక్కడ నందఱినోరులు మూయఁగలను! ఎందఱికి సదుత్తరము లొసఁగుచుండఁగలను? అన్నియును స్పష్టముగాఁ జెప్పఁదగినవిగా నున్నచో బాగుగనుండును. కాని, నళిని తనహృదయ మిప్పటికి నేవైపుననుంచియున్నదో తెలియకునికి నాకేమి చెప్పుటకును వీలులేకున్నది. ఆనాఁడు నే నఖిలచంద్రునితో బాగుగనే వాదించితిని. నళినివిషయమై వాఁడు తననోటికివచ్చిన ట్లెల్లఁ బ్రేలుచుఁ దిరుగుచున్నాఁడు. వెంటనే నళినికిఁ బెండ్లి చేసితిమా, యివన్నియు శమింపఁగలవు. కావుననే యిఁక విలంబము సేయుట నర్థదాయక మని నాయభిప్రాయము.

ఘనానంద—ఎవరికిచ్చి పెండ్లిచేయుట?

యోగీంద్ర—ఉన్నాఁడొకవ్యక్తి—ఇపు—డెల్లెడలను వ్యాపించియున్న కళంకమువలన నళినికి వరుఁడు దొరకుట కష్టము. అతఁ యుఁ డున్నాఁడుకదా! అతఁడెన్నఁడు ననుమానింపఁడు. పాపము! వానికి మాత్రనిచ్చి తినుమనుఁడు. తినును. పెండ్లిచేసికొమ్మనుఁడు; చేసికొనును.

ఘనానంద—నీకుఁ బిచ్చిపట్టలేదుకదా! నళిని యక్షయకుమారునిఁ బెండ్లియాడుట కెన్నఁడైన సమ్మతించునా?

యోగీంద్ర—ఊరక మీరు సమ్మతింపుఁడు; తరువాతఁ గావింపవలసినదంతయు నేను చూచికొందును.

ఘనానం—(భీతితో) వలదు; యోగీంద్రా! వ్యర్థముగ నళిని హృదయమును నొప్పింపకుము. భయపెట్టిగాని, నిష్ఠురభాషణము లాడిగాని, యామెహృదయమును ఖేదపెట్టకుము. ఇంకను గొన్నిదినములు గడువనిమ్ము; పాప మాబిడ్డ పుట్టినదాదిగ దుఃఖము లను

భవించుచున్నది. చాలఁ గష్టము లోర్చియున్నది. పెండ్లి కింకను గావలసినంత యవకాశమున్నదికదా!

యోగీంద్ర—నేనామె కణుమాత్రమును గష్టముఁగలిగింపను; సాధ్యమైనంతవఱకు జాగరూకతతో మాటలాడుదును. తగవులాడకుండ మాటలాడుట నాచేతఁగాదని మీరనుకొనుచున్నారు కాఁబోలును!

యోగీంద్రుఁడు మిగులఁ జంచలహృదయుఁడు. ఆనాఁడే నళిని మరలఁ గచేరిచావడికి వచ్చినప్పు డాతఁ డామెతో "నళినీ! నేను నీకొక్కమాట చెప్పవలసియున్నది" అనియెను.

ఈపలుకులకు నళినిహృదయము కంపింపనారంభించెను. ఆమె యోగీంద్రుని వెనుకకుఁజని కూరుచుండెను.

యోగీంద్ర—నళినీ! నాన్నగారియారోగ్యము దినదినమును చెడుచుండుట నీకుఁ దెలిసినవిషయమే.

నళిని స్వరూప ముద్విగ్నముగఁ గాన్పించుచుండెను. ఆమె యేమియుఁ బలుకలేదు.

యోగీంద్ర—ఈవిషయమున మనము చేయవలసినప్రయత్నములు సేయకున్న వారు వ్యాధిపీడితులగుదురుకదా!

తండ్రియస్వస్థతకుఁ గారణము తానేయనియు, నందులకుఁ దన్ను దూషింతురనియు నామెకుఁ దోఁచెను. ఆమె క్రిందివైపునకు జూచుచుఁ గూర్చుండెను.

యోగీంద్ర—అయినదేమో యైనది. కావలసినదానినైనఁ జేయయత్నింప వలయునుగదా! తండ్రిగారిని సమాధానపెట్టవలెననియు, వారిశరీరారోగ్యము బాగుగ నుండవలెననియు హృదయపూర్వకముగఁ గోరుదువేని, నీవు సాధ్యమగునంతవఱకు నీపట్టును, వీడుము.

ప్రత్యుత్తరము నపేక్షించి యోగీంద్రుఁడు నళినిమోముఁ గాంచెను.

నళిని—(లజ్జావనతవదనయై) నేను నావిషయమున నన్నను నాన్నగారిని దుఃఖపెట్టను.

యోగీంద్ర—వారిని నీవు దుఃఖపెట్టవు; కాని, వీనివలన లోకములో నితరులనోళ్ల నెట్లు మూయఁదగును?

నళిని—అందుల కేమిచేయవలెనో నీవే చెప్పుము.

యోగీంద్ర—నలువంకలను బ్రసరించుచున్న కళంకముల నన్నిటిని దుడిచివేయుట కొక్కటే యుపాయము కలదు.

యోగీంద్రుఁడు యోచించియున్న యుపాయము నూహించి నళిని తత్క్షణమే యిట్లనియెను. "కొంతకాలము నాన్నగారు పశ్చిమదేశములలోఁ బ్రవాసముచేసిన లాభముకలుగఁజాలదా? మూఁడు నాలుగునెలలు ప్రవాసముచేయుచుండినచో సమాజదూషణముకూడ నాఁగునుగదా!

యోగీంద్ర—ప్రవాసములచే దోషములు నశింపఁజాలవు. నీహృదయము నిశ్చలమైనదని వారి కెంతవఱకు నమ్మకముకలుగదో, యంతవఱకు వారి యసమాధానవృత్తి శాశ్వతముగ నుండు నదియే.

నళినిలోచనము లశ్రుపూరితములయ్యెను. ఆమె కన్నులు తుడిచికొని "నీవు నాకేమాజ్ఞాపింతువు?" అని ప్రశ్నించెను.

యోగీంద్ర—నీకాయాజ్ఞ కఠోరముగనుండునని నేనెఱుఁగుదును. కాని, యన్నివిషయములు నాలోచించి క్షేమమార్గమును గోరుదువేని, నీవు పెండ్లిచేసికొనుట కిఁక నాలస్యము సేయకుము.

నళిని యూరకుండెను. యోగీంద్రుఁడు చాలసేపూరకుండ లేక పోయెను.

"కావున, నళిని! కల్పనాబలమున నల్పవిషయములనుగూర్చి విచారణముసేయుటలోనే నీతెలివితేటలన్నియును వినియోగపఱచుచున్నావు, నీవివాహవిషయమునఁబ్రజలేమనుకొనుచున్నారో, నీవెఱుగవు. అట్టికష్టము లనేకస్త్రీలకుఁ గలుగవచ్చును కాని. వెంటనే వారు విముక్తులగుచున్నారు. అదినుగాక, ప్రతిగృహమునను, వివాహవిషయమై యనేకవిధములగు కల్పనలచే గ్రంథరచనకుఁ దొడఁగిన పిమ్మట, వాకష్టములనుండి తొలఁగుట మిగుల నసాధ్యము. నీకీవిషయమై యేమియుఁ దోఁచకుండుటయును న్యాయమే కాని, మేము సిగ్గుతోఁ దలవంచుకొనుచున్నాము. నాయింటి విషయముల నాధారముగాఁ దీసికొని గ్రంథకర్తలు నవలలను వ్రాయకుండఁగనే వీని నడఁగింపవలయును. నామాటలు నీకిష్టములగునేని వినుము. కులీనుఁడగు నొకవరుని గోరుకొని యాతనిని పెండ్లియాడుము" అనియెను.

యోగీంద్రుని పలుకులలోనిభావము నళినికిఁ దెలియుచుండెను; కావున; యోగీంద్రునిభాషణములన్నియు నామెహృదయమున శల్యములరీతిఁ గ్రుచ్చుకొనుచుండెను. ఆమె "నేను కన్యావ్రతము నవలంబించి సన్యాసమును స్వీకరింతుననియా నీవనుకొనుచున్నావు!" అనియెను.

యోగీంద్ర—అట్లయినచో, నీవేటికి శీఘ్రముగఁ పెండ్లియాడవు! స్వర్గమునందలి యింద్రునిఁదక్క నన్యపురుషుల నీవెంతవఱకు మెచ్చవో యంతవఱకును నీవు సన్యాసమును స్వీకరించుటయే మేలు. జగమున నన్నియుఁ దనయిచ్చవచ్చినట్లుగ జరుగనేరవు. అబ్బినయంతలో శాంతులనణంచుకొని సంతృప్తులై సుఖింపవలయును. నేననున దింతియే. "సంతోషేణ వినాపరాభవపదం ప్రాప్నోతిమూఢోజనః."

నళిని—ఇట్టిమాట లెందులకు? ఆవరుఁడు నాకిష్టము; ఈవ రుఁడు నాకిష్టములేదు; అని నేనెన్నఁడైననని యుంటినా?

యోగీంద్ర—అనకున్న నేమి? లక్షణములు దాఁగవుకదా! నేనప్పుడప్పుడు చూచుచునే యున్నాను; నీవు నిష్కారణముగ నీహితచింతకులపైఁ గోపపడుచుందువు; అన్యాయముగ వారి నవమాన మొనర్చుచుందువు. నేఁటివఱకు నీకెంతపరిచయమున్నదో యంద ఱిలోను నొక్కపురుషుఁడే నీసుఖములయందును, దుఃఖముల యందును తోడు నీడయై, నీవుమర్యాదచేసినను, అమర్యాద చేసినను, నొకేవిధమగునాదర భావముతో నున్నాఁడని నీవొప్పుకొనక తప్పదు. ఈకారణమున నాతనిపై నాకత్యంతమగుభక్తి కుదిరియున్నది. నీకు సౌఖ్య మొనఁగూర్చుటకొఱ కాతఁడు తనప్రాణములనైనఁ బాటింపఁడు. ఇట్టిపతి నీకు యోగ్యుఁడనితోఁచినచో నాతనిని వెదకుట కెంతో దూరము పోవఁబనిలేదు. కాని, నీకుఁ గావ్యములలోనినాయకుఁడే కావలెననిన—"

నళిని—(లేచి) ఏమనుచున్నావు? నాన్నగా రేమాజ్ఞాపింతురో దానినిచేయుటకు నేను సంసిద్ధనై యున్నాను. నేను దానిని మన్నింపకపోయినచో, మీరు మీయిష్టమువచ్చినట్లుగ కావ్యము నందలి నాయకునిఁగూర్చి యోచింపవచ్చును.

యోగీంద్రు—(కరుణతో) నళినీ! అలుగకుము. కోపమువచ్చునేని నాకొడలు తెలియదని నీవెఱుఁగుదువు. నామనసునను న్నదంతయును. వంచింతును. చిన్నతనమునుండియు నిన్ను నేను చూచుచున్నాను. నిన్ను నేను గుఱితింపలేనా? నీవెంతసిగ్గరివో, తండ్రిగారి యెడల నీకెంత శ్రద్ధకలదో, నే నెఱుఁగనా?

అనిపలికి యోగీంద్రుఁడు ఘనానంద బాబుగారిగదిలోనికిఁ బోయెను. యోగీంద్రుఁడు తనసోదరితో నేమిమాట లాడుచున్నాఁ

డో? కదాయని ఘనానందబాబు చింతించుచుండెను. వారిసంభాషణ ములు వినవలయు ననుకుతూహలముతో ఘనానందుఁడు చావడి లోనికిఁబోవుదుమాయనియుఁ దలఁచెను; కాని, యింతలోనే యో గీంద్రుఁ డాతఁడున్నస్థలమునకు వచ్చి నిలిచెను. ఘనానంద బాబాతని ముఖమువంకఁ జూచుచుండెను.

యోగీంద్ర—నళిని పెండ్లియాడుటకు సమ్మతించినది. నేనా మెను బలిమిని సమ్మతింపఁజేసితినని మీరనుకొందురేమో! కాని, యట్లుకాదు. మీరొక్కమా టారక చెప్పినఁజాలును. అతఁడను మారునిఁబెండ్లి యాడుటకుఁ దక్షణమే సమ్మతింపఁగలదు.

ఘనానంద—నేను చెప్పవలయునా?

యోగీంద్ర—లేకున్న, నామె స్వయముగవచ్చి "నన్నతఁ డకుమారునకిచ్చి పెండ్లిచేయుఁ" డని చెప్పునా? అట్లులాజ్ఞాపించు టకు మీకు సంకోచముగనున్నచో, నాకాజ్ఞాపింపుఁడు; నేనేగి మీ యాజ్ఞ నామెచెవిని వేయుదును.

ఘనానంద—వలదు. చెప్పవలసినదానిని నేనే స్వయముగాఁ జెప్పుదును. కాని, యింత తొందరచేయుట మంచిదా? నేను చెప్పిన మాటవినుము. ఇంకను గొన్నిదినములు పెండ్లిముచ్చట నెత్తవలదు.

యోగీంద్ర—నాన్నగారూ! ఇంక నాలస్యముచేయుటలోఁ బ్రయోజనమేమియులేదు. ఈవిధముగ నెంతకాలము గడుపనగును? ఆలసించినకొలఁది ననేకవిఘ్నములు రావచ్చును.

యోగీంద్రుని ముందెవ్వరిపట్టుదలయును సాగనేరదు. అతఁ డేకార్యమునైనఁ జేయుట కొక్కమాఱు ప్రయత్నించెనా, యదియో నసాగువఱకును విడుచువాఁడుకాఁడు. అందువలన ఘనానందబా బాతనిని జూచి భయపడుచుండుచు. వివాహ మింకను గొన్నిదినము

లాపవలయుననుతలంపుతో ఘనానందబాబు "సరే నేనామెతోఁ జెప్పెదను" అనియెను.

యోగీంద్ర—చెప్పుట కిదియే మంచిసమయము. మీయాజ్ఞకై వేచియున్నది. ఏమైనను గానిండు, నేఁడే యీమాట లామెకడ నెత్తిన నుత్తమమగును.

ఘనానందబా బాలోచింపఁదొడఁగెను.

యోగీంద్ర—బాబా! ఆలోచించుచుఁ గూర్చుండుటయందర్థమేమున్నది? ఒకసారి నళినికడకుఁ బోవుదము రండు.

ఘనానంద—నీవిక్కడనే కూర్చుండుము. నేనొక్కడ నామెకడ కేఁగుదును.

• యోగీంద్ర—అట్లే కానిండు. నేనిక్కడనే యుందును. మీరు పోయిరండు.

నళినికూర్చుండి యున్నకచేరిచావడిలోనికి ఘనానందబాబు తొంగిచూచెను. లోపల నంధకారమయమై యుండెను. ఆతని యడుగులచప్పుడు విని నళిని; బాబా! దీప మారిపోయినది. మీరు కూర్చుండుఁడు. సేవకునిఁ బిలిచివచ్చెదను.

ఘనానంద—పోనిమ్ము. దీపమక్కఱలేదు.

ఘనానందబాబు నళినిదగ్గఱ నొకకుర్చీపైఁ గూర్చుండెను.

నళిని—నాన్నా! మీయారోగ్యవిషయమై జాగ్రత వహింపరేల?

ఘనానంద—జాగ్రత వహింపకుండుటకుఁ గారణము లేకపోలేదు. దేహారోగ్యము బాగుగ నున్నదనియే నేనంతగ శ్రద్ధవహించుటలేదు కాని, నీయారోగ్యము చెడుచున్నను నీవు దానియెడ లక్ష్యముంచవేమి?

నళిని—మీరందఱు నొక్కరీతినే యనుచుండుట యన్యాయము నాస్థితి చాలబాగుగనున్నది. నాయారోగ్యముంగూర్చి నేను

లక్ష్యముంచుటలేదని మీరేమి చూచియనుచున్నారు? పోనిందు నాశరీరసౌఖ్యమువిషయమై నేనజాగ్రతిగనున్నానని మీకుఁ దోఁచునెడల నేనేమిచేయవలెనో మీరు చెప్పరాదా? మీయాజ్ఞలనెన్నఁడైన నేను తిరస్కరించియున్నానా? మీయభిప్రాయమునకు విరుద్ధముగా నేను చరించుదాననుగాను,

ఘనానంద—లేదులేదు. నీకునాయెడలఁబూర్ణమగు శ్రద్ధకలదు. నేను నీక మంగళము కలుగునట్టి వాక్యములనెన్నఁడు నాజ్ఞాపింపను నీవును నేఁటివఱకు నాయభిమతము నెఱిఁగియె ప్రవర్తించుచున్నదానవు. నాయాశీర్వాదము వృథ కాఁజాలదు. పరమేశ్వరుడు నీకు దీర్ఘసౌఖ్య మొసఁగుఁగాక! నీయభీష్టము నెఱవేఱుఁగాక!

నళిని—నాన్నా! నన్ను మీరు మీచెంతనే యుండనిత్తురా?

ఘనానంద—ఎందులకుండనీయను?

నళిని—ఎంతవఱకు నాకు వదినె రాదో యంతవఱకునైన నేను మిమ్ము వీడియుండను. నేనుగాక మఱెవ్వరు మీసేవలొనర్తురు?

ఘనానంద—నాసేవలమాటలకేమి? నిరంతరము నీవు నాయొండ నుండుటకు నేనెక్కడనోఁచితిని?

"చీఁకటి మిక్కుటమైనది దీపముఁ దెత్తు" నని నళిని యటనుండి పోయి దీపముఁ దీసికొనివచ్చెను. పిదప నామె "ఇటీవలి వార్తాపత్రికను జదివి మీకు వినిపించుటకు నాకు సమయము లేకుండెను. నేఁడు చదివివినిపింతును." అనియెను.

ఘనానంద-(లేచి)సరేగాని, నీవుండుము, నేనిప్పుడేవచ్చెదను.

అని చెప్పి యతఁడు యోగీంద్రునికడ కేగఁబోయెను. అతఁడు "నేఁడేమియుఁ జెప్పలేను; రేపు చెప్పెద" నని యోగీంద్రునితోఁ జెప్పుట కుద్దేశించియుండెను. కాని, తండ్రిగారు తనగదిలోని

కరిగి నంతనే యోగీంద్రుఁడచటఁ బ్రత్యక్షమై "ఏమైనది! వివాహవిషయము మాటలాడితిరా?" అని ప్రశ్నించెను.

"ఆఁ చెప్పితిని." అని ఘనానందబాబు ప్రత్యుత్తరమొసఁగెను. లేదని చెప్పిన మరల నాతఁడామెను బాధించునేమో యను భీతిచే ఘనానందబాబు "ఆఁ చెప్పితిని." అని యనవలసివచ్చెను.

యోగీంద్ర—మీమాటలు విని యామె మిక్కిలి సంతోషించియుండఁబోలును!

ఘనానంద—అవును. ఒకవిధముగా నేనామెను సమాధానము చేసియేవచ్చితిని.

యోగీంద్ర—మఱి నేనీవృత్తాంత మక్షయ కుమారుని చెవిని వేయుదునా?

ఘనానంద—ఇప్పుడేమియుఁ జెప్పకుము. ఇట్లు తొందరపడినఁ గార్యము చెడిపోవును. ఆత్రమువలన నేకార్యమును సులభముగఁ గాఁజాలదు. ఇంతలోనే యెవ్వరితోడ నేమియుఁ జెప్పకుము. మనము పశ్చిమమునఁ బ్రవాసముచేసి వచ్చినపిమ్మట నంతయు నిశ్చయము కాఁగలదు.

యోగీంద్రుఁ డేమియుఁ బలుకక యటనుండి కదలిపోయెను. ఉత్తరీయము భుజముపై వేసికొని యక్షయ కుమారునిగృహమువంక కేగెను. అక్షయకుమారుఁ డొకపుస్తకమును జదువుచుండెను. యోగీంద్రుఁ డక్షయకుమారుని చేతిలోనిపుస్తకమును లాగికొని "పుస్తకము సావకాశముగఁ జదువవచ్చును; కాని, త్వరగ నీవివాహముహూర్తము నిశ్చయింపుము." అనియెను.

అక్షయ—(ఆశ్చర్యముతో) ఏమంటివి?

———

## ఏడవ ప్రకరణము.

### ప్రేమపత్రిక.

మఱునాఁడు ప్రాతఃకాలముననే శుచిర్భూతయై నళిని ఘనానందబాబుగదిలోని కరిగెను. ఘనానందబా బొకకుర్చీపైఁ గూర్చుండియుండెను. ఆగదిలో విశేషముగ సామాను లుండలేదు. ఒకమంచము, నొకమూల నొకబీరువాయు నుండెను. ఎదుటనున్న యొకగోడపై ఘనానందబాబుగారిపత్ని చిత్రపటమొకటి వ్రేలాడఁబడియుండెను. ఆసమీపముననే యున్న యొకబీరువాలో నామెచేఁ గుట్టఁబడిన యనేకములగుచిత్తరువులుండెను. ఆమె జీవించియుండఁగా స్వహస్తముతో నామె యేయేవింతవస్తువు లందుంచియుండెనో, యవన్నియు నింక నట్టులే యుండెను. అంగేమాత్రమును భేదముండలేదు. నళిని తండ్రి వెనుక నిలిచి "నాన్నగారూ! నేఁడు త్వరగానే తేనీరుఁ ద్రాగుదము. నిన్నటివలెనే మీగదిలో మాటలాడుచు గూర్చుండుటకు నాకు మనసగుచున్నది. మీరు చెప్పెడు పూర్వవృత్తాంతములన్నియు వినుటచే నాకుఁ గలుగుచున్న యానందమును వర్ణింప శక్యముఁ గాకున్నయది." అనియెను.

ఇటీవల నళినివిషయమై తండ్రిగారిహృదయ మెన్నివిధములనో పరితపించుచుండెను. నేఁడీమె తేనీరుఁ గ్రోలుట కింత యాత్రపడుటెందులకో యతని కప్పుడే తెలిసెను. ఇఁకఁ గొంతసేపటిలో నక్షయకుమారుఁడు తేనీరుఁద్రాగుటకు రావచ్చును; కావున, నావిధిని దీవ్రముగ నెఱవేర్చుకొందమని నళిని యాశయముకాఁబోలు, నని ఘనానందబాబూహించెను. వ్యాధునిభీతివలన హరిణి యేవిధముగ స్వతంత్రమనస్థితియందుండునో, యదేతీరున నక్షయకుమా

రనిమూలమున నళినిస్థితియు నయియుండుటచే ఘనానందబాబు మిగుల ఖిన్నుఁడై యుండెను. కాని, యూరక ఖిన్నుఁడగుచుపచ్చునే గాని, యందునకుఁ బ్రతీకార మొనర్పు సామర్థ్యమతనికి దైవముసంగి యుండలేదు.

అతఁడు మేడదిగిపోయి చూచెను; సేవకుఁ డప్పటి కింకను దేనీరు సిద్ధపఱచియుండలేదు. అందునకు ఘనానందబా బా సేవకుని పైఁగోపించెను. అందులకు సేవకుఁడు "మీరు నేఁడెప్పటికంటె శీఘ్రముగ లేచితి" రని యెంతయో విన్నవించెను గాని, యావిన్న పమంతయు వ్యర్థమయ్యెను. ఘనానందబాబు కోపపడుచునేయుండెను "నాసేవకు లందఱును నవాబులై యున్నారు! వారి నందఱను జాగ్రతగా నుంచుటకును, వారివారిపనుల నప్పటికప్పుడు జ్ఞాపక పఱచుచుండుటకొఱకును వేఱుసేవకుని నియమించుట యావశ్యక మని నాకుఁ దోఁచుచున్నది!" అని విసివికొనియెను.

ఇవ్విధముగఁ జాలసేపటివఱకుఁ గోపపడుచునే యుండెను.

సేవకుఁడు తత్క్షణమే తేనీరు సిద్ధపఱచి వారిముందఱనుంచెను.

ఇంతకుఁబూర్వ మెప్పుడును ఘనానందబాబు లోకాభిరామా యణమునఁ గాలక్షేపము సేయుచు సావకాశముగఁ దేనీరుద్రాగు చుండెను. నేఁడాతఁ డొక్కమాటయు నాడక నొకగ్రుక్క నా తేనీరు ద్రాగి గిన్నెను క్రిందనుంచెను.

నళిని—(ఆశ్చర్యముతో) బాబా! మీ రేదైన నావశ్యక కా ర్యార్థమై యెక్కడకైనఁబోవలయునా?

ఘనానంద—ఎక్కడకును లేదు? శీతకాలమున వేడి తేనీరొ క్కగ్రుక్కను ద్రాగిన దేహమంతటను జెమ్మటపట్టి శరీరమున కారోగ్య మొసఁగఁగలదు.

కాని, ఘనానందబాబు దేహమునకుఁ జెమటపట్టులోపల వత్సయకుమారుఁడును, యోగీంద్రుఁడు నటకు విచ్చేసిరి. నేడత్సయకుమారుని వస్త్రాలంకారము లెప్పటికంటె శోభాయమానములై యుండెను. ఆతనిహస్తమునఁ బైడిబెత్తము, ఱొమ్ముపై సువర్ణమయ శృంఖలము, జేబున గడియారమునుండెను. వామహస్తమున బాదామురంగుగల మృదువగు కాగితముచే నాచ్ఛాదితమగువస్తు వేదో యుండెను. ఆతఁడు లోని కరుదెంచినవెంటనేఁ యెప్పటివలెఁ దన చోటఁ గూర్చుండుటకు మారుగ, నళినిప్రక్కనున్నకుర్చీపై నాసీనుఁడై మందస్మితముతో "నేఁడు మీగడియార మొకింత వేగముగా నడచుచున్నట్లున్నది." అనియెను.

నళిని యతనివంకఁ దలయెత్తి చూడలేదు. ఆతనిప్రశ్నలకు నేమియుఁ బ్రత్యుత్తరము నొసంగలేదు. ఘనానందబాబా మెతో "నళినీ! మేడమీఁది కరుగుము, నావస్త్రములన్నియు నెండలో నారవేయుము." అనియెను.

యోగీంద్ర—బాబా! ఎండ యెక్కడకుఁ బారిపోవును? ఇంత తొందరయేల? (నళినినుద్దేశించి) నళినీ! అత్సయకుమారునకుఁ దేనీరొసఁగుము. నాకును గావలయును. కాని, ప్రథమమున నతిథులనుసత్కరించుట యుచితము.

అత్సయ—(శృంగారపూర్ణహాసముఁ గావించి) కర్తవ్యపాలనమునకై నేఁటివఱకు నింతటియాత్మత్యాగ మెవ్వరైనఁ జేసియుందురా? యోగీంద్ర బాబనఁగాఁ బ్రతిహారిశ్చంద్రుఁడనియే నేనను కొనుచున్నాఁడను!

ఘనానంద—ఉష్ణము తీవ్రమగును. నళిని! పోయి నావస్త్రము లన్నియు నారవేయుము. పొమ్ము. ఆలసింపకుము.

యోగీంద్ర—నేఁడు వస్త్రము రెండవేయుమని నాపుఁడు. అక్షయబాబుగా రేతెంచియున్నారు.

ఘనానంద—(కోపముతో) అన్నివిషయములలోను నీయభిమతమే నెఱవేర్చుకొనుట కాత్రపడుచుందువు నీదురాగ్రహము మూలమున మేలుకీళ్ళు నెఱుఁగవు. ఇతరులమనసులు నొచ్చినను మేలే; కాని, స్వమతముమాత్రము వదలవు. ఇందువలననే నీకు గొప్పతన మబ్బుచున్నది. నీపట్టుదల నింతవఱకు నెంతయో యోర్చితిని; కాని, యిఁక నోర్వ నాతరముకాఁజాలదు. నళినీ! పొమ్ము! తేపటినుండి మనము మేడదిగి రానక్కఱలేదు. అచ్చటనే తేనీరు గ్రోలుదుము.

అని వచించి ఘనానందబాబు భామతో మేడమీఁదికిఁ బోవుటకు లేచెను. కాని, నళిని గాంభీర్య స్వరూపముతో నిట్లనెను. "బాబా! కొంచెమాఁగుఁడు. నేఁడు మీరెప్పటివలెఁ దేనీరుఁ ద్రాగలేదు. అక్షయబాబా! మీహస్తములలోని కాగితమున నున్నదేమో నేనడుగవచ్చునా?"

అక్షయ—ఊరక యడుగుటకుమాత్రమే కాదు; దానిని దెఱచి చూచుటకును నీకెట్టియభ్యంతరమును లేదు.

అని పలికి యతఁడా కాగితమునఁ జుట్టియున్న వస్తువు నా కాగితముతో నామె ముందిడెను.

నళిని పైకాగితమును దొలఁగించి చూచెను. లోపల నొక ప్రేమపత్రిక యుండెను. దానిని జూచినంత నామె భీతిల్లెను. ఆమె దేహమంతయు నెఱ్ఱవాఱెను. ఇట్టిప్రేమపత్రికయే యొకప్పుడు రమేశబాబు వ్రాయఁగా నామె చూచియుండెను. దాని నిప్పటికింకను నొకబీరువాలో నతిజాగ్రతగఁ బ్రేమతో గుప్తముగా దాఁచియున్నది.

యోగీంద్ర—(నవ్వి) "ఇందేమి వ్రాయఁబడియున్నదో నీవింకను దెలిసికొనలేదుగాఁబోలును!" అనియతఁడు పై కాగితమును దూరముగా దొలఁగించెను. పైని "శ్రీమతి నలినీదేవి కక్షయునిప్రేమోపహారము" అని వ్రాయఁబడియుండుటఁ జదివెను. అంతలో నామెహస్తమునుండి యాపత్రిక జారి నేలపై బడియెను. దానియెడ నించుకయు లక్ష్యముంపక యామె "నాన్నా! పోవుదము, రండు" అనియెను.

ఇరువురును వెడలిపోయిరి. యోగీంద్రుని నేత్రములు క్రోధముచే నెఱ్ఱనయ్యెను. సర్వాంగమునుఁ గంపితమయ్యెను. "లేదు. ఇఁకనుం దిక్కడ నుండలేను. నాకెక్కడనైన నొకపాఠశాలోపాధ్యాయ పదవి లభించినఁ దత్క్షణమిటనుండి వెడలిపోవుదును. ఒకక్షణమైన నేనిక్కడ నుండజాలను.

అత్తయ—యోగీంద్రబాబూ! వ్యర్థముగ నీవేల సంతప్తుఁడవయ్యెదవు? నీదే యీతప్పు. నీవేమైనఁ బొరపడియుందువని నేను రాత్రియే యెంచితిని; కాని, నీవెంతయో ప్రార్థించి యాశ్వాసించుటవలన నేను నాయభిప్రాయమును మార్చుకొనుట కుద్యుక్తుఁడనైతిని. కాని, నేను నీకు నిశ్చయముగాఁ జెప్పుచున్నాను; నళినిమనసెప్పటికిని నాపైఁ గుదురఁజాలదు. ఆమె యెన్నటికిని నన్నంగీకరింపదు. ఇదిమాత్రము నీమనసున గట్టిగ నమ్ముము. అసంభవవిషయములకొఱ కింతకష్టతరపరిశ్రమ చేయుట పిచ్చితనమే యగును. కావున, రమేశచంద్రుని నామె మఱచుమార్గమెద్దియో దానిని మాత్ర మాలోచింపుము, చాలు.

యోగీంద్ర—చేయవలసినపని యేదో చెప్పితివి కాని, యదెట్లు చేయవలెనో యదియుఁ జెప్పరాదా?

అత్తయ—నళినినిఁ బెండ్లియాడుటకు నేనుతప్ప యావన్మనుష్యులీజగమున నే లేరా? ఎట్లయిన నొక చక్కని వరుని వెదకి

తెచ్చినచో, నతని జూచి వస్త్రముల నెండ వేయునిచ్ఛ యామెకు గలుగకుండును.

యోగీంద్ర—అగును. కాని. వరుఁడనఁగాఁ దలఁచినమాత్ర మున లభించువస్తువు కాదుగదా!

అక్షయ—ఇంతగా భీతిల్లెద వేల? "ఉద్యమేన హి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః" అనునట్లు ప్రయత్నముచేసినచో నేది కాఁ జాలదు? యోగ్యుఁడగువరుఁడు లభించుస్థలము చెప్పెదను కాని, త్వరపడినచో నేమియుఁ గాఁజాలదు. ప్రథమముననే పెండ్లివిషయ ములు చెప్పి వధువునకు భీతి పుట్టింపఁదగదు. మెల్లమెల్లగ నిరువురకు బరిచయముఁ గల్పించినచో, వారిరువురకు మైత్రి యొదవఁగలదు. ఆమైత్రివలననే మనోగతము వెల్లడియగును. అటుపిమ్మట నెమ్మదిగ లగ్ననిశ్చయము నగును.

యోగీంద్ర—చక్కనియుపాయమే వచించితివి. ఇఁక వరు నినామధేయాదుల నెఱింగింపుము.

అక్షయ—నీవతనిఁ జక్కగ నెఱుఁగవు. కాని యతనిపేరు మాత్రము వినియుందువు. ఆతనిపేరు కమలనయనబాబు. ఆతఁడొక డాక్టరు.

యోగీంద్ర—కమలనయనబాబా?

అక్షయ—ఇట్లు భయమందెద వేల? వారివిషయమై బ్రహ్మ సమాజమున గొప్పకల్లోల ముద్భవించియుండుట నిజమే; ఇంతమా త్రమున నింతయోగ్యుఁడగు వరునిఁ బోనాఁడుటయా!

యోగీంద్ర—నాకది సాధ్యమయియుండినచోఁ బోనాడుదునా? కావునఁ బ్రయత్నమొనరించుపని నీపైనున్నది. కాని, యేమోయీ! కమలనయనబాబు పెండ్లాడుటకు సిద్ధముగ నున్నాఁడా?

అక్షయ—నేఁడే యతఁడుసిద్ధమగునని నేఁజెప్పఁజాలను. కాని సమయముచేకూరిన నేదియు నసాధ్యముకాఁజాలదు. నామాటల యెడ లక్ష్యముంచుము. రేపు కమలనయనబాబుపన్యసించుచున్నాఁడు ఆయుపన్యాసము వినుటకు నళినిని వెంటఁబెట్టుకొనిపొమ్ము. ఆతని వాగ్ధాటి మనోహరమైనదియుఁ బరిణామకారకమునైనది. ఇంక స్త్రీలమనసా, యాతనివక్తృత్వముకడఁ జేరి ద్రవింపక మానదు. మూర్ఖస్త్రీలు కొందఱుపన్యాసమిచ్చుపురుషునికన్న నుపన్యాసమును విను పురుషుఁడే నూరురెట్లెక్కువ సౌందర్యవంతుఁడని యనుకొను చుందురు.

యోగేంద్ర—కమలనయనబాబు కులశీలసంబంధముచు నీకేమి తెలియును ?

అక్షయ—ఇదిగో! యోగేంద్రబాబూ! ఆతని కులశీలముల నొక్కింతదోషముండినను దానిని గమనింపకుము. ఒకానొకయల్ప దోషముమూలమున నమూల్యవస్తువులు సైతము గవ్వకుఁ గొఱగాక పోవుచున్నవి. కావున, నదిసులభముగఁ బ్రాప్తించుచున్నది. ఇదియు నొక లాభమే యని, నేననుకొందును.

అక్షయకుమారుఁడు కమల నయనబాబు కులశీలములనుగూర్చి యివ్విధముగాఁజెప్పెను—

"కమల నయనబాబు జనకుఁడు రాజవల్లభబాబు, ఫరీద్‌పుర పుజిల్లాలో నొకకీర్తిమంతుఁడు, నొక్కచిన్నసంస్థానాధిపతియు నైయుం డెను. వారికి ముప్పదేండ్లువచ్చినప్పుడు బ్రహ్మసమాజ ధర్మము నవలంబించిరి. కాని, యాతనిపత్ని, యేమిచేసినను, బ్రహ్మస మాజధర్మము నవలంబింపదయ్యెను. ఆమె తనయాచారవ్యవహార ములకొక్కింతయు విఘ్నముకలుగనీయకయే తనపతిసన్నిధి నుండెను. కాని, యామె యాచార స్వాతంత్ర్యము విచారస్వాతంత్ర్యము,

పతి కనిష్ఠమైయుండెను. వారిపుత్రుఁడగు కమల నయనబాబు పూర్ణయౌవనదశ ప్రాప్తించుటకుమున్నే స్వధర్మప్రసారోత్సాహ ప్రేరితుఁడై, తనవాక్పటుత్వమహిమవలన బ్రహ్మసమాజమునఁ బ్రతిష్ఠ నార్జించెను. అటుపిమ్మట నాతఁడు వైద్యశాఖ నొకవై ద్యుని పదవి నంది యందునను దనప్రావీణ్యమునగపఱచి లోక ప్రియత్వముఁ గీర్తియు నార్జించెను. ఇంచుమించుగ నీసమయముననే యొకసంగతి సంఘటించెను. వార్ధకమున నుచ్చదశ నందియుండిన రాజవల్లభబాబొకతరుణవితంతువును వివాహమాడుట కుత్కంఠితుఁ డయ్యెను. అతనితో వలదని చెప్పుట కెవ్వరును ముందడుగిడఁ జాల రైరి. ఆతఁడు "నాప్రస్తుతపుభార్య నాకు నిజమైన సహధర్మచారిణి కాదు. ఎవ్వతె ధర్మవిషయమునను విచారవిషయమునను వ్యవహా రవిషయమునను నాతో నైక్యమగుచున్నదో యట్టియామెను నిరా కరించుట మహాపాపము." అనియందఱితో ననుచుండును. తుదకు రాజవల్లభబాబు జనాపవాదములనైన లక్ష్యపెట్టక యావితంతు వును బెండ్లియాడెను. అటుపిమ్మటఁ గొంతకాలమునకుఁ గమలన యనబాబుతల్లి కాశికిఁబోవ నిశ్చయించెను. ఈవృత్తాంతము కమల నయనబాబునకుఁ దెలిసినవెంటనే రంగపురమునుండి యాత డేతెంచి "నేను నీతోవచ్చెద"నని తల్లితోఁజెప్పెను. అందులకామాత నేత్ర ములనుండి బాష్పము లురులుచుండఁ గుమారునితో "వత్సా! నా కును నీకును నేవిషయమునను సరిపడకున్నది. నాయాచారములు వే ఱు; మీవివేఱు; ఇట్లుండ నీవు నావెంటవచ్చి వ్యర్థముగా నేటి కా యాసపడెదవు?" అనియెను. కాని కమలనయనబాబు తల్లిని సుఖ పెట్ట నిశ్చయించియుండెను. కావున, నాతఁ డామెతోఁ గాశికేగెను. అచ్చటకుఁ బోయినపిదప నామె కుమారునిఁగని "నాకోడలి ముఖము నాకుఁ జూపవా?" యనియడిగెను. కమలనయనబా బాలోచనలోఁ

బడెను. "ఇప్పుడెందులకింతమాత్రము. సావకాశముగఁ జూచుకోందము" అని యాతఁడనియెను. బ్రహ్మసమాజమునఁ జేరనికన్నియను వివాహమాడు టాతనికిష్టము లేదనియు, నాకారణముననే యతఁడు తనమూలమున నవివాహితుఁడై యున్నాఁడనియుఁ దల్లితలఁచి బిడ్డా! నామూలమున నీవిట్లు సన్యాసివై యుండు టుచితముకాదు. నీకిష్టమువచ్చినపిల్లను బెండ్లిఁ జేసికొనుము. నేనందున కొకింతయును విఘ్నముకలుగనీయను" అనియెను. కమలనయనుఁడు రెండుమూఁడు దినము లాలోచించి తుదకుఁ దల్లితో నిట్లనియెను. "అమ్మా! నీకిష్టమువచ్చిన యేపిల్లనైనను బెండ్లియాడి యామెను నీసేవకై నీయొద్దనుంచెదను. నీయిష్టమునకు విరుద్ధముగఁ బ్రవర్తించి నీహృదయమును నొప్పించుపిల్లను బెండ్లియాడను." అటుపిమ్మట ననురూపవధువు నన్వేషించుకార్యము తనపైఁ బెట్టుకొని కమలనయనబాబు తనదేశమునకుఁ బోయెను. పిమ్మట గొన్నివిషయములు సంఘటించెను. ఆతఁడు రహస్యముగ నొకయనాథబాలికను బెండ్లియాడెను. గాని, వివాహానంతరము కొన్నిదినముల కాతనికిఁ నామెకును వియోగముకలిగెనని కొందఱందురు. మఱికొంద ఱీపలుకులయందు విశ్వాసముంచుట లేదు. పెండ్లిచేసికొనునుద్దేశముతో నాతఁ డిటకు వచ్చెను కాని. ముహూర్తము కుదురనందున నాతని యిచ్ఛ యతని మనసుననే యుండిపోయినదని మఱికొందఱనుచున్నారు."

ఈప్రకారముగాఁ గమలనయనబాబును గురించి యతఁడు కుమారుఁడు వచించినపిమ్మట యోగీంద్రబా బిట్లనియెను—

"పదియేట్టులున్నను, దసకింపుగఁదోఁచుఁగన్నియను పెండ్లియాడుటకుఁ గమలనయనబా బొప్పుకొనును. ఆతనితల్లియు నతని యభిప్రాయమునకు వ్యతిరిక్తముగఁ బ్రవర్తింపఁజాలదు. ఇక రెండవది; నళినికింటె రూపవతియు గుణవతియు నగువధువాతనికి మఱెందు

లభింపఁగలదు? నళినిస్వభావ ముత్తమమైనది. ఆమె తనయత్తగారికి దగురీతి శుశ్రూషలు చేయఁగలదు. అత్తగారి కావంతయు శ్రమ యొసఁగదు. అన్నివిషయములలోను నామె యిచ్ఛానుసారముగనే నళిని నడువఁగలదు. కమలనయనబాబొకటిరెండు దినములలోనే నళిని సుస్వభావమును, సచ్ఛీలమును గుర్తింపఁగలఁడు. కావున, నేతీరుననైనఁ గమలనయన బాబుగారితో నళినికిఁ బరిచయము కలుగఁ జేయవలయును. ఇంతియే నేననుచున్నాఁడను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

### వాగ్జాలము.

అతిథియుఁడు వెడలిపోయిన యనంతరము యోగీంద్రుఁడు ఘనానందబాబు గదిలోనికి కరిగెను. అటఁ దండ్రిగారు నళినితో ముచ్చటలాడుచుఁ గూర్చుండియుండిరి. యోగీంద్రునిఁ గని ఘనానందబాబొక్కింత లజ్జితుఁడయ్యెను. నేఁడు తేనీరుఁ గ్రోలునపుడు స్వాభావికశాంతగుణము నష్టమయి తనకు సంతాపము కలిగినందునకిప్పుడెంతయు నాతనిమనసు బాధించుచుండెను. ఇందువలన నధికోత్సుకతతో నాదరభావమున "యోగీంద్రా! రమ్ము; కూర్చుండుము" అనియెను.

యోగీంద్ర—మీరీనడుమ సభలకు, నుపన్యాసములకుఁ బోవుట మానివేసితిరి. ఎల్లపుడు మీరిరువురు నింటనే కూర్చుండియుందురు. నాకిది బాగుగనుండలేదు. పరిశుద్ధవాయువులోఁ దిరుగుచుండకున్న శరీర మెట్టులారోగ్యస్థితియందుండఁగలదు?

ఘనానంద—నాజీవితమంతయు నించుమించుగ నిర్వ్యాధి నింటిలో మూలఁగూర్చుండుటచేతనే గడచిపోయినది. ఏదైన నవసర

కార్యముండిననేగాని, నేను తిరుగఁబోను మఱి యిప్పుడో, నళిని మూలమున బయటికరుగుట బొత్తిగా మానివేసితిని.

నళిని—నాన్నగారూ! ఈవిషయమున నన్ను దూషింపనేటికి మీరాయిచ్చవచ్చిన చోటునకు నన్నుఁ గొనిపొండు; వచ్చుటకు నేను సంసిద్ధనైయున్నదానను.

నళిని తన యిష్టముననుసరించి యిటీవల స్వాతంత్ర్యముగ వ్యవహరించుచుండినను, శోకాకులచిత్తయై తానింటనే కూర్చుండి యున్నదనుమాటమాత్ర మంగీకరింపనిచ్ఛగింపదు.

యోగీంద్ర—నాన్నా! రేపొకసభ సమావేశము కాఁగలదు. నళినితో మనము నటకుఁ బోవుదము.

ఈమధ్యఁ గొంతకాలమునుండి జనసమూహమునఁ జేరుటకుఁగాని, సభాభవనముల కరుగుటకుఁగాని నళిని సంకోచముతో నుండెనని ఘనానందబా బెఱింగియుండెను, కావున, ఘనానందబాబు కుమారునిపలుకులకు సమ్మతించుటకుమున్నొక్కమాఱు కుమార్తెముఖము నీక్షించెను.

నళిని— (ఉత్సాహమునునటించి) సభయా? ఉపన్యాసకులెవరు?

యోగీంద్ర—కమలనయనబాబు.

ఘనానంద—కమలనయనబాబా?

యోగీంద్ర—అవును. ఆయన యసమానమేధాసంపన్నులు. వారివక్తృత్వశక్తి యలౌకికమైనది. ప్రతిభాశాలురగు నిట్టి యుపన్యాసకులసంఖ్య యీహిందూస్థానమునఁ బ్రస్తుత మత్యల్పమని చెప్పఁదగును. ఆయనజీవనచారిత్రముమాత్ర మత్యాశ్చర్యకరమైనది. ఎంతస్వార్థత్యాగబుద్ధి! ఎంతనిశ్చయము! ఎంతకర్తవ్యపరాయణత్వము! వారివంటి తేజోవంతులగు పురుషులదర్శన మదృష్టవశమునఁగాని లభింపదు.

కమల నయన బాబు సంబంధమగు విషయములు యోగీంద్రు
వకు రెండు గంటలకుం బూర్వ మేమియుం దెలిసియుండలేదు. ఒక్క
పేరుమాత్రమే వినియుండెను. కాని, యతఁడు యకుమారుఁడు వంచించిన
చరిత్రమున కప్పును గారమును పట్టించి, తన యసాధారణశక్తిచే
దండ్రికడ నాతఁడు వాక్చాతుర్యమును బ్రదర్శించెను.

నళిని—నాన్నా! ఇట్టిపురుషుని యుపన్యాసము వినవలసినదే
నేను మీతో వచ్చెదను.

నళినియాడిన యీయుత్సాహపూర్వక భాషణములు ఘనా
నంద బాబునకు విశ్వసనీయములని తోఁచలేదు. అట్టులుండియు
నాతని కొక్కింత సమాధానమయ్యెను.

ఘనానంద—(తనలో) నళిని స్వాభీష్టమునకు విరుద్ధముగ
బహుజనసమాజమున కేగుచువచ్చుచు నుండినచో నామెమనను
స్వస్థమగునేమో! మనుష్యుని మనోవ్యాధికి సాంగత్యమునకన్న వేఱౌ
షధమేమున్నది? లేదు లేదు; (ప్రకాశముగా) సరే. యోగీంద్రా!
రేపు మమ్ములు నాయుపన్యాసమునకుం బిలిచికొనిపొమ్ము. మఱి కమ
లనయనబాబు స్వభావాదులను గురించినీకేమైనం దెలియునా?
లోకు లతనివిషయమై యనేక విధములఁ జెప్పుకొనుచున్నారు.

అతని విషయమై యున్నదియు లేనిదియుఁ గల్పించి కేవలము
దోషముల నారోపించుజనులను తననోటికివచ్చినట్లుతిట్టుచు యోగీం
ద్రుఁడు—

“ఎవ్వరికి నీతియుధర్మము సక్కఱలేదో యాజనులు “ఒక్కొ
క్కవిషయమునను బరుల నిందించుచుండుటకొఱకే యీశ్వరుఁడు
మమ్ములను నిర్మించియున్నాఁడు” అని యనుకొనుచుందురు. ఈవేష
ధారులకన్న మిగుల నీచులును సంకీర్ణహృదయులునై నజను లీజగ
మున నుండఁజాలరు” అనియెను.

మాటలాడుచుండఁగ యోగీంద్రుఁ డావేశమునకు వశుఁడయ్యెను. అతని నెమ్మదిపఱచుటకై ఘనానందబాబు "నీవనునది నిశ్చయమే. అందేమియు ననృతములేదు. పరదోషాన్వేషణమొనరించుటకు నరుఁడు కడుంగడు సంకీర్ణహృదయుఁడగుచున్నాఁడు. అతని బుద్ధియు సంశయాత్మకమగుచున్నది. అతనియుదారస్వభావ మావిషయమున సర్వవిధముల నశించిపోవుచున్నది" అనియెను.

యోగీంద్ర—బాబూ! మీరీమాటలాడుట నన్నుద్దేశించియే కాదుకదా! కాని, నాస్వభావ మీవేషధారులయొక్కయు, సాధులయొక్కయు స్వభావమును పోలినది కాదని గట్టిగ మనమున నుంచుఁడు. ప్రశంసనుగూర్చియే కానిండు, నిందనుగూర్చియే కానిండు, నేనేమిమాటలాడుటకై తలంతునో దానిని మొగమునెదుటనే చెప్పివేయుదును. అందువలన నొకరుప్రసన్నులైన నేమి? కోపగించుకొన్న నేమి? అవియేవియును నేను పాటించుచుండువాఁడఁగాను.

ఘనానంద—(తొందరతో) యోగీంద్రా! నీకున్మాద మావిర్భవించియుండలేదుకదా! నేను నన్నుద్దేశించి పలుకుదునా? నీస్వభావము నేనెఱుఁగనా!

పిమ్మట యోగీంద్రుఁడు కమలనయనబాబును స్తుతించుటకై ప్రారంభించెను—

"తల్లిని సుఖపెట్టుటకై ప్రేరితుఁడై కమలనయనబాబు మిగులఁ బ్రేమతోఁ గాశికి వెడలిపోయెను. ఈకారణముననే బ్రహ్మసమాజములోనిసంకీర్ణహృదయులగుజను లాతని నిందించుచుందురు. కాని, నేనుమాత్ర మాతని నీవిషయమై స్తుతించుదును. నళినీ! నీయభిప్రాయ మెట్లున్నది?"

"నాయభిప్రాయము నట్టిదియే."

“నీవు మంచియభిప్రాయ మిత్తువని నేనెఱుఁగుదును. ఏలయన—నీవు మనతండ్రిగారి నెల్లప్పుడు సౌఖ్యపెట్టుటకై స్వార్థత్యాగముసేయుటకు సంసిద్ధవై యుండుట నేనెఱుఁగనా?”

ఘనానందబాబు ప్రేమైకవీక్షణములతో నళినివదనబింబము నీక్షించెను. ఆమె లజ్జతోఁ దలవంచుకొనియెను.

---

## తొ మ్మి ద వ ప్ర క ర ణ ము.

### రహస్యాలోచనము.

సభముగిసినపిదప ఘనానందబాబు నళినతో గృహమునకు వచ్చిచేరెను. అప్పుడు సూర్యుఁ డపరవారినిధిఁ జేరుటకుఁ గొంత సావకాశ ముండెను. తేనీరు గ్రోలుచుఁ గ్రోలుచు ఘనానందబాబు “నేడు నిశ్చయముగ నాకు మిగుల నానందముగ నున్నది.” అనియెను.

ఇంతకన్న నెక్కుడుగ నాతఁడు మాటలాడలేకపోయెను. ఆతనిమనసమునఁ బరిపరివిధముల నూతనభావస్రోతము ప్రవహించుచుండెను. తేనీరుఁ ద్రాగినపిమ్మట నళిని మేడమీఁది కరిగెను. ఘనానందబాబు ధ్యానమటుండలేదు. వేఱువిషయమున లీనమై యుండెను. నేఁటిదినమున సభలోనుపన్యసించుట కమలనయనబాబు డాక్టరుపదవియందున్న ఒకయౌవనపురుషుఁడు. ఆతనిముఖమున బాల్యచిహ్నములింకను సంపూర్ణముగా మాసియుండలేదు. ఆతని దేహసౌకుమార్యమును, నాతనిప్రసన్నత్వమును గన్నహృదయము ముగ్ధమగుచుండెను. ఆయౌవనునిభాషాశైలియం దొకవిధమగు నద్భుతశక్తి యిమిడియుండెను. ఆపురుషునివాక్పటుత్వము సహస్రక

ర్ణములచే వినవలయునని శ్రోతలకుఁ దోఁచుచుండును. ఆకమలనయనబాబు హృదయమునందలి ప్రతిభావతరంగమును నాతనిముఖమండలమునఁ బ్రతిబింబితమగుచుండును. నేఁడాతనియుపన్యాస విషయము "త్యాగము" ఆయుపన్యాసమునందలి ముఖ్యాభిప్రాయ మీవిధముగ నుండెను. "జగమున నేజను లేమియుఁ ద్యాగముచేయకుందురో, వారి కేదియు లభింపఁజాలదు. స్వార్థత్యాగమే నిక్కవమగుపురుషార్థము. ఇదికాక, మనము సంపాదించుచున్నదంతయు మన కేదిలభించునో యదియే సాత్వికలాభము. అదియే మనకు వాస్తవమగుధనము. ఆధనమును మాత్రము మన మెన్నటికినిఁ బోఁగొట్టుకొనరాదు. దానిని బోఁగొట్టుకొంటిమేని మనలను బోలినయభాగ్యులీజగమున నింకొకరుండరు. ఏనరులు పరోపకారార్థ మాత్మత్యాగమొనర్తురో, వారి కావిధముగనే యాంతరంగిక శాంతియు, సమాధానవృత్తియు లభింపఁగలదు. మనుజునియం దెంతస్వార్థత్యాగబుద్ధి కలదో, వాఁడంతయధికసంపత్తి కలవాఁడగును. స్వార్థత్యాగపూర్వక మగుదాన మెద్దియో యదియే సాత్వికదానమగును. ఆదానప్రభావ మవర్ణనీయము. ఏదానమున నభిమానగంధముండునో యది దానముకాదు. ఏలోకులుస్వార్థరహితులై నిరహంకారబుద్ధిచే నితరునకు దానమొసంగుదురో వారికే యాదానమువలన శ్రేయమబ్బును ఇట్టిదానప్రభావము వలననే మిగుల నల్పవస్తువైనను మహదుచ్చదశ నందును అనిత్యత్వము నిత్యముగ మాఱును. మఱియు, నేది మన సామాన్య జనులవ్యవహారవిషయమైయుండునో యదియే మనకు బూజ్యమై యంతఃకరణమున నతిభద్రముగ సేవించునంతటి యోగ్యతగల దగును."

నేఁడీ విచారములన్నియు నళిని హృదయాకాశమున మేఘములవలె వ్యాపించియుండెను. ఆమె మేడపైఁ గూర్చుండి తనలో

దర్శించుకొనుచుండెను. వేఱొంపు విచార మూఢహృదయమునఁ బ్రవేశించుటకు నేఁడు తావులేదు. నేఁడామె తన్నుఁ దానే మఱచియుండెను.

సభామందిరమునుంచి మగిడివచ్చుచుండ యోగీంద్రుఁ డక్షయకుమారునితో "నిక్కువముగ నీవు యోగ్యుఁడగువరుని నెమకి తెచ్చితివి! మఱి, యీతఁడు సన్న్యాసివలెఁ గాన్పించుచుండెను. ఈతని భాషణములో నర్థభాగమైన నాకర్థముకాలేదు" అనియెను.

అక్షయ—వ్యాధిపీడితునిస్థితిం జూచి యౌషధమిచ్చుటకు యోచింపవలసినది. నళిని రమేశచంద్రునిపై ధ్యానమున మునిఁగి యున్నది; ఆధ్యానమును బోఁగొట్టుటకు సన్న్యాసియే కావలయును. మాయట్టి సామాన్య మనుష్యులమాట లచట సాగవు. ఉపన్యాసము జరుగుచుండ నీవు నళిని ముఖమును జూచియుంటివా?

యోగీంద్ర—అవును; ఆబా కాయుపన్యాస విషయము చక్కఁగఁ దెలిసియుండవలయును. కాని, యుపన్యాసము చక్కఁగ నున్నదను కారణమున నుపన్యాసకుని మెడలో హారము వైచునని నిశ్చయముగఁ జెప్పఁగలమా?

అక్షయ—మఱి యాయుపన్యాసకుని యెడల విశేషమగు సద్గుణ ముండినఁగదా? ఈవాగ్ధాటియే నీనోటఁగాని నానోటఁగాని వెలువడియున్నచో నది లోకులకు రుచించునని నీవు తలచెదవా? యోగీంద్రా! తపోబసంపన్నులయెడ స్త్రీలశ్రద్ధ శీఘ్రముగకుదురునని నీ వెఱుఁగవా? సన్న్యాసమునున్న శివునికై పార్వతి తపస్సు చేయలేదా? ఆదంపతులపై కాళిదాసమహాకవి యొక కావ్యమును రచించెను. నేను నిజము చెప్పుచున్నాను వినుము మీరు శ్రీమహావిష్ణువును దెచ్చి నళిని ముందునిలువఁ బెట్టినను నామె యాతని రమేశునితోఁ సరిచూచును. అట్లుచూచి రమేశచంద్రుఁడే యధిక యో

గ్యాంశమని నిర్ణయించును. కాని, కమలనయనబాబసామాన్యుడు నత్యాంశపురుషుండైన యున్నవాడు. ఆతనితో నింకొకరిని బోల్చుటకు స్వప్నమునైన నామన మిచ్చగింపదు. అంతియే కాక, వేఱొక యువనుని దెచ్చి మీరామె యెదుట నిలువబెట్టినచో నామె తత్క్షణమే మీయభిప్రాయమును గ్రహింపగలదు; పిమ్మట నాతరుణుని భర్తగ స్వీకరించుట కామె యంగీకరింపదు. కాని, యేయుక్తిప్రయుక్తులచేనైనం గమలనయనబాబు నిటకుం దెచ్చినచో నామె కె ట్టియనుమానమును గలుగదు. ఆమెకే మెల్లమెల్లగ నతనిపై శ్రద్ధ యుదయించును. అట్లుండగనే యామె వేసినవరమాలిక యతని కంఠమునకు శోభనొసంగును.

యోగీంద్ర—యుక్తిప్రయుక్తులను నాకును భూమ్యాకాశములకున్నంతదూరము. నేను విస్పష్టమగురీతినే మాటాడం గలను. నటాడుపని నాపైనిడి, యుక్తిప్రయుక్తభారము నీవు వహింపుము. నిజము చెప్పవలసియున్నచో నీవరుండుమాత్రము నాకిష్టము లేదు.

అక్షయ—ఇదిగో, యోగీంద్రా! నీవు నీదురాగ్రహమునకు వశుండవై యెల్లకార్యములను నాశనము చేయుదువుసుమా! అన్నిగుణములు నొక్కచోటనుండవు. ఎట్లయిననుర మేశచంద్రునిసంబంధముగువిచారము నళినిహృదయమునుండి పారదోలవలయును. నేంజెప్పినట్లు నడుతువేని యిది సహజముగ తనంతటనే యగునని తోంచుచున్నది.

యోగీంద్ర—నీవేమైనననుము; నాదృష్టికిం గమలనయనబాబు పూర్ణాంధునివలె నగపడుచున్నాడు. ఇట్టిభ్రష్టులగు వారితో సంబంధముం గల్పించుకొనుటయన గొప్పయాపద తెచ్చుకొనుటయే ఈ బావినుండి బ్రతికిలేచి యాబావిని బడుచున్నట్లున్నది.

# తొమ్మిదవ ప్రకరణము

అత్తయ—యోగీంద్రా! నీచంచలబుద్ధి నీకే శోభించుచున్నది. కమలనయనుఁడు డాక్టరగుటవలననా మీకింతభయము! రమేశచంద్రునివిషయమై తొలుత నీకెట్టియభిప్రాయముండెను? ఆతనివంటి కరుణుఁ డీపృథివీతలమున లేఁడని నీవనుచుండెడివాఁడవు. మోహనదిని వానియూరనైన లేదని యనుచుండెడివాఁడవు. ధర్మశాస్త్రమున నీకాతఁడు మూర్తీభవించినశంకరాచార్యులనియే తోఁచుచుండెను. సాహిత్యశాస్త్రమునసైత మీపందొమ్మిదవశతాబ్దమున సరస్వతీదేవియే పురుషరూపమున రమేశచంద్రుఁడై యవతరించె ననుకొంటివి ఆతఁడుసర్వజ్ఞుఁడని పలుకరాదు; ఆతనియెడ సమయౌచిత్యము లేదు; అటుకాకున్ననీవాతనిఁగని "వాణీబాణో బభూవ; బాణో రమేశో బభూవ" అనియట్టియసంబద్ధప్రలాపము చేసియుందువు! నేనుమాత్ర మాతని నాదినుండియు గుర్తెఱిఁగి యున్నాను; కాని, యతనిసంబంధమున మాటలాడుటకు నాకేమిస్వాతంత్ర్య మున్నయది? సజ్జనులయెడ నెట్లు మాత్సర్య ముంచవలెనో. యంతమాత్రమే నేనెఱుఁగుదు నని నీవనికొని యుందువు. కానిమ్ము మెల్ల మెల్లగ నీవు నాపక్షమునఁ జేరితివి, కమలనయనబాబువంటి మహాపురుషునియెడల దూరమున నుండియే భక్తి యుంచుట మంచిది; కాని యతనికి సోదరి నిచ్చుట యపాయకరమని నీకుఁ దోఁచుచుండఁబో లును! మఱి గత్యంతరము లేకున్న నేమిసేయఁదగును? కంటకమును తో నేకంటకము నూడఁదీయవలయును; కమలనయనుఁ డను బ్రహ్మరాక్షసునిఁ జూపిననే కాని నళినీహృదయమునందలి రమేశుఁడనుభూతము వెలవడదు."

యోగీంద్ర—రమేశచంద్రుని నేనందరికన్న ముందుగ నెఱుఁగుదు నని నీవు వేయిపర్యాయములు చెప్పినను, నేను నీమాట నమ్మను. ఒరులయెడ మత్సరబుద్ధితోడను, గోపైకదృష్టితోడను నుండు

టఘే నీస్వభావము. అందున నీకౌశల్య మేమియు లేదు. ఏది యెట్ల యిన నేమి, యుక్తి ప్రయుక్తులఛార మంతయు నీపై మహానందము తో వైచుచున్నాను. కాని, యీపురుషుఁడుమాత్రము నాకింపుగ నుండ లేదు.

యోగీంద్రాక్షయు లిరువురును ఘనానందబాబు తేనీరుబల్ల చెంతకు వచ్చినతోడనే నళిని మేడమీదకిఁ బోవుచుండుటను చూచిరి అక్షయకుమారుఁ డందలిభావమును దెలిసికొనియెను. ఆతఁడు వచ్చుట నళిని కిటికీమార్గమునఁ జూచియుండెను. అక్షయకుమారుఁడు చిరునగవుతో ఘనానందబాబుప్రక్కనే కూర్చుండి తేనీరు గిన్నె నిండనింపి "కమల నయనబాబు మాటలాడునదంతయు మనఃపూర్వకముగఁ బలుకుచుండును. కావుననే యాతనిమాటలు లోకులకు వినవింపుగ నుండును. ప్రభావశాలియగు నాతనివక్తృత్వము విన్న నెవ్వరిహృదయ మాకృష్టము కాఁజాలదు?" అనియెను.

ఘనానంద—నిస్సంశయముగా నతఁ డొక యోగ్యపురుషుఁడు.

అక్షయ—ఆతనిఁబోలిన సచ్చరిత్రుఁ డీభూతలమున నఱుదు.

యోగీంద్రుఁ డక్షయుని కార్యములతో నొక్కింతయేకీభవించి యుండినను, నీమాటలు విని యతఁ డూరకుండ లేకపోయెను—"అహాహా! ఆతని సచ్చరిత్రముగూర్చి చెప్ప నేల! ఇట్టిమహాత్ముల సాంగత్యమునుండిమమ్ముఁ బరమేశ్వరుఁడు రక్షించుఁగాక!" అనియెను

నిన్ననే కదా యీయోగీంద్రుఁడు కమల నయనునిఁ బ్రశంస చేసి, యతని ప్రతిపక్షులను నోటికొలఁదిఁ దిట్టియుండెను!

ఘనానంద—యోగీంద్రా! నీ వేమనుచున్నావు? ఇట్టిపలుకులను మరల నుచ్చరింపకుము. బహిరంగముగ నెవరు పరిశుద్ధముగఁ గప్పింతురో వారంతరంగమునసైత మంతపరిశుద్ధముగ నుందురు.

నానిశ్శంకవిశ్వాసము మూలమున నేనొకవేళఁ బొరపడినను పడవచ్చును, గాని, సాధుజనుల ననుమానించుట నావలనఁ గాదు కమలనయనబాబు తనమాటలలో నేభావమును వ్యక్తీకరించెనో, యది సామాన్యజనులకుఁ దెలియజాలదు. ఆతఁడు తనయాధ్యాత్మికానుభవమున నేమేమివచించెనో యవి యన్నియు నాకు నవీనముగనే తోఁచెను. కపటాచరణునకిట్టి సత్యప్రియత్వ మెటనుండి రాఁగలదు? ఇనుము బంగారమెట్లు కాఁజాలదో, యట్లే, కపటాంతఃకరణు నిహృదయమున నిట్టియున్నతభావ ముత్పన్నము కాఁజాలదు. ఆపని నెప్పుడు ప్రత్యక్షముగ సందర్శించి ధన్యవాద మొసఁగ్తునాయని నామన సుత్సహించుచున్నది.

అక్షయ—ఇఁక నాకో, ఆకమల నయనబాబుయొక్క పార్థివ శరీరము శీఘ్రముగనే నష్టమైపోవునేమో యనిభీతివొడముచున్నది.

ఘనానంద—(బెదరి) ఏమి? ఆతనిశరీరము వ్యాధిగ్రస్తముగ నున్నదా?

అక్షయ—ఏటికుండదు? ఆతఁ డహోరాత్రములు ధర్మాచరణమున మగ్నుఁడై యుండును. అందును గొంచెము వీలుండిన, నాకాలమున శాస్త్రచింతనలోఁ గడపును. శరీరమునందు లక్ష్యముంచుట కతని కవకాశ మేది?

ఘనానంద—అది గొప్పదోషమే. శరీరము సురక్షితముగ నున్న నెల్లగార్యములు సాధింపవచ్చును. "ధర్మార్థకామమోక్షాణాం శరీరం సాధనం పరం." ఇట్టియుపయుక్తమగు శరీరమును జెఱచుకొనుట యోగ్యము కాదు; కాదు. ఆయధికారమే తనకు లేదు. మనశరీర రచనము మనము సేయలేదుకదా! ఎవ్వరు దానిని జేసిరో యాతఁడే తన కిష్టమువచ్చినట్లు తత్క్షణమే నశింపఁజేయును. కొంత కాలమువఱకుఁ గమల నయనబాబు నాయుండ నుండినచో నాతని

శరీరమును స్వస్థపఱచు సదుపాయములు నేనొనర్తును. స్వాస్థ్యరక్షణ మున కెన్నియో నియమములు కలవు. అందు ముఖ్యమైనది—

యోగీంద్ర—(అర్ధోక్తియందే) బాబా! ఊరక మీకేటి కీవిచారము? కమల నయనబాబుశరీరము కావలసినంతపుష్టికలిగి యున్నది. ఆతని శరీరదార్ఢ్యముంగని నేఁడు సాధుత్వమును, శరీరసంపదయు నొండొంటితో దృఢసంబంధము జరిగియుండునని తెలిసికొంటిని. కొంతకాలమువఱకైన సాధుత్వ మవలంబించవలెనని నాకును దోఁచుచున్నది.

ఘనానంద—ఇదిగో! యోగీంద్రా! అక్షయకుమారుఁ డనున దేమియు నసత్యముకాదు. అది సుసంగతమును, సాధారణము నైనదియే. మన దేశప్రజలలోఁ బడిరి; వారందఱును స్వశరీరము నెంత యుపేక్షసేసి దేశమున కెంతటినష్టముఁ గలిగించిరో, నేనిప్పుడు చెప్ప నశక్తుఁడను. కావున, సాధ్యమైనంతవఱకును సాధుజనులయందలి యీదోషమును బారద్రోలుటకుఁ బ్రయత్నింపవలయును. నీవు కల్పించినను, కమల నయనబా బట్టివాఁడుకాడు. ఆతఁడు నిశ్చయమైనసాధువు. ఆతనియెడ నాధ్యాత్మికబల మున్నది. ఆతని నిప్పటి నుండియు మేల్కొల్పినచో, నాతఁడు శరీరము నింతగ నుపేక్షసేయఁడు.

అక్షయ—నేనతనిని మీకడకుఁ దెత్తును. మీరాతనికి వలయునుపదేశము లొనర్చినచో లాభ మందఁగలఁడు. మీరు నాకొసఁగినమాత్ర లత్యంతశక్తివర్ధకము లని నాయనుభవమువలన నాకుఁ దెలియుచున్నది. శరీరస్వాస్థ్యముఁ జెఱచుకొన్నవారందఱకు నీమాత్రలవంటియౌషధము మఱొండు లేదు. మీరు దానిని కమల నయన—

యోగీంద్రుఁ డాకస్మికముగ లేచి నిలిచి "అక్షయబాబూ! నీవిట నన్నుఁ గూర్చుండనీయవు. ఇదిగో, నేను పోవుచున్నాను." అని యోగీంద్రుఁ డటనుండి వెడలిపోయెను.

# పదియవ ప్రకరణము.

## పరిచయ ప్రసాదము

ఘనానందబాబు సుదృఢగాత్రుఁడైయున్నప్పు డాతఁ డాంగ్లేయాయుర్వేదౌషధముల నెల్లప్పుడు సేవించుచుండెను. కాని, యౌషధము సేవించునాస యిప్పుడు తగ్గెను. అంతియేకాక, తన దేహస్వాస్థ్యమునుగుఱించి లోకులతోఁ జెప్పుకొనుటయు నిటీవల మానివేసెను. ఒకదినముపగలు ఘనానందబాబు వారమ్‌కుర్చీపైఁ బరుండి నిదురించుచుండెను. నళిని యతని సమీపమున నున్నకుర్చీపై గూర్చుండి కుట్టుపనులు చేయుచుండెను. ఇంతలో మేడమెట్లుపై నెవ్వరిదో యడుగులచప్పు డామెకు వినఁబడుటచేఁ దలుపుసందున నుండి చూచెను. యోగీంద్రుఁడును, కమల నయనబాబును వచ్చుచుండిరి. వారినిఁ జూచి నళిని యాగదినుండి ప్రక్కగదికి బోఁబోయెను. అంత యోగీంద్రుఁడు, "నళినీ! డాక్టరువారు వచ్చియున్నారు. నీ వెక్కడకుఁ బోవుచున్నావు ?" అనియెను.

నళిని వెనుకకు మరలవలసివచ్చెను. కమలనయనబాబు నేలపై దృష్టినిడియే యామెకు నమస్కరించెను. ఘనానందబాబు మేల్కొనియెను. ఆతఁ డదటిపడి లేచి, కమలనయనున కాదరపూర్వకముగ నమస్కరించి "నేఁడు నేను ధన్యుఁడ నైతిని. తమవంటి సత్పురుషులపాదస్పర్శనమున నామందిరము పావనమయ్యెను. నళినీ! ఎక్కడికేగెదవు ? కూర్చుండుము. కమలనయనబాబూ ! ఈ నా కుమారితయు నాఁటిదినమున మాతోవచ్చి మీయుపన్యాసమును విని మిక్కిలి సంతసించెను. స్వార్థత్యాగ్యముంగూర్చి మీరు ప్రకటించిన యుదారవిచారము నామనసున దృఢముగ నాటియున్నది. డాక్టరు

గారూ ! మిమ్ము నేనొకవిషయమున వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. అదేమన, మీరప్పుడప్పు డీనాగృహమున కరుదెంచి మీదివ్యదర్శన మొసఁగుచుండుఁడు ! ఆయోగమున మాయెల్లరకు మీరుపకారము చేసినవారగుదురు. మేమిప్పు డెక్కడకును బోవుచుండుటలేదు. ఏదైన నావశ్యక కార్య మున్ననేగాని యెక్కడికి నరుగము. మీరేవేళ కెప్పుడువచ్చినను నేనును నళినియు నింటనే యుందుము.” అనియెను.

నళిని లజ్జావనతవదనము నొక్కమా ఱీక్షించి కమలనయన బాబు “ నేను నాయుపన్యాసమున, ధ్యానమునను౦చుకొనవలసిన విషయము లేమిచెప్పితినో, వానివలన నేనొకమహాత్ముఁడనని మీరు భావింపకుఁడు! పాఠశాలలో విద్యార్థులు నన్నువిడువక మిక్కిలి బలవంతపఱచుటచే నేనావిషయమై యుపన్యసింపవలసివచ్చెను. ఎవ్వరైన నేమైనఁ బ్రార్థించిన నిరాకరించుసామర్థ్యము నాయొద్ద లేదు. కావున, సభలో నన్నన్నటికిని మాటలాడుటకుఁ బ్రార్థింపకుండుటకై నేనిట్లు పలికితిని. నాయుపన్యాసమునఁ గొంతభాగము తమకుఁ దెలియలేదనియు, రుచింపలేదనియు విద్యార్థులెల్లరు ననుచున్నారు. యోగీంద్రబాబూ ! మీరు నానాఁడు సభకేతెంచియుంటిరికదా ! మీరు సతృష్ణనేత్రములతోఁ బలుమారు మాగడియారమువంకఁ జూచుచుంటిరి. మీమనోగతము నేనెఱిఁగియు, నాయుపన్యాసమును శీఘ్రముగ నేను ముగింపనందులకు నన్ను మన్నింపుఁడు ! ”

యోగీంద్ర—మీభావము నాకు బాగుగఁ దెలియలేదు. కాని, యాదోషము మీదికాదు; నాబుద్ధియల్పమగుట యేదోషము!

ఘనానంద—యోగీంద్రా ! నీవిట్టిగూఢవిషయములు తెలియునంతటివయసువాఁడవుకావు.

కమలనయన—ఇంతకంటె వానిని దెలిసికొనవలసినంత యావశ్యకము లేదు.

ఘనానంద—నేను మీకొకగొప్పవిషయమును సూచింపనెంచియున్నాను. ఈజగమున మహాధార్మికకృత్యముల నొనరించుటకొఱకే మిమ్మీశ్వరుఁడు పంపియున్నాఁడు! కావున, మీరు మీ శరీరప్రకృతియెడ లక్ష్యముంచకపోవుట మంచిది కాదు. పరోపకారదక్షు లెల్లరును మనసున నుంచవలసినవిషయ మిదియే; మూలధనముఁ బోనాడి కూర్చుండుట మేలా? అందువలన దానము సేయుబలము కొఱవడునుగదా!

కమలనయన—మీకును నాకును జక్కఁగఁ బరిచయము లభించుయోగము కలిగినచో నేనిభూతలమం దెట్టియుపయుక్తవస్తువునైన ననాదరణముసేయువాఁడఁ గానని మీకు గట్టిగ నమ్మకము కలుగఁగలదు.

యోగీంద్ర— మీరందఱు నిట మాటాడుచుండుఁడు. నే నేగెదను.

కమలనయన—క్షమింపుఁడు! ఈమాటలు మీకు విసుఁగు కలిగించి యుండవచ్చును. నేనును మీతో వచ్చెదను; నడువుఁడు!

యోగీంద్ర—వలదు; వలదు. మీరుండుఁడు! నావర్తనము నెడ మీరిసుమంతయు సంశయింపకుఁడు. చాలసేపువఱకు నేనొక్కచోఁ గూర్చుండలేను. నాస్వభావ మట్టిది.

ఘనానంద—ఈతనిమాట లనృతములు కావు. డాక్టర్సాహెబ్! దానివిషయమై మీ రేమియు సంకోచింపవలదు. వానిస్వభావ మతివిచిత్రము. అతఁడు స్వేచ్ఛాచరణుఁడు. ఒక్కచోటఁ గట్టి కూర్చుండఁజేయుట శక్యము కాదు.

యోగీంద్రుఁడు వెడలిపోయినపిమ్మట ఘనానందబాబు "ఇప్పుడు మీరెక్కడనుందురు?" అని ప్రశ్నించెను.

కమలనయన—(నవ్వి) మీయీప్రశ్న కేమని నే నుత్తర మిత్తును? నాకు నిశ్చితనివాసస్థాన మిదియని చెప్పలేదు. నాకు స్నేహితు లనేకులు కలరు. వారెక్కడకు నన్నుఁ గొనిపోవుదురో, యక్కడకుఁబోవుచుందును. కాని, యేకాంతము కావలెనన్న నేదైన నొకనిశ్చితస్థానము కావలసియున్నది. కావుననే, యోగేంద్రబాబు తమగృహమునకుఁబ్రక్క నొకగృహ మున్నదనియు, నందు నేనుండ వచ్చుననియుఁ జెప్పెను.

ఈపలుకులు విని ఘనానందబాబు తన సంతోషమును వెల్లడించెను. గాని, యతఁడు నళిని ముఖమువంక నీక్షించియున్నచో నామెముఖము వివర్ణమైయున్నట్లాతనికిఁ గనబడియుండును. ఈప్రక్క యింటనే రమేశబాబు నివసించుచుండెను! కమలనయనబాబా గృహమువిషయమై పలికినతోడనే యామెకుఁ బూర్వవృత్తాంతము లన్నియు జ్ఞప్తికివచ్చెను.

ఇంతలోఁ దేనీరుసిద్ధమైనదని సేవకుఁడు వచ్చి చెప్పెను. అందఱును మేడదిగి క్రిందికి వచ్చిరి. ఘనానందబాబు నళినితో "బిడ్డా! డాక్టరుగారి కొకగిన్నెలోఁ దేనీరు నింపి యిమ్ము!" అనియెను.

"వలదు! నేను దేనీరుఁ ద్రాగను!" అని కమలనయనబాబనెను.

ఘనానంద—ఒకగిన్నె మాత్రము ద్రాగుట కభ్యంతర మేమి? తేనీరుఁద్రాగు నభ్యాసము మీకు లేనిచో నింత ఫలాహారము నారగించి దాహముంబుచ్చుకొనుఁడు.

కమలనయన—క్షమింపుఁడు!

ఘనానంద—మీరు డాక్టరులు! మీకు నేనేమిచెప్పఁగలను? భోజనానంతరమున మూఁడు నాలుగు గంటలవఱకుఁ దేనీరు లేకపోయిన మానెఁగాని, కొంచెము వేఁడినీరు ద్రాగినఁబచనమునకు సాహాయ్యమగును గదా!

కమలనయనబాబు నళినినీక్షించి ఘనానందబాబుతో "మీ హృదయమందలి యనుమాన మేనెఱింగితిని. కాని, యది నిజము కాదు. మీరాయింటఁ దేనీరుఁ బుచ్చుకొనుట దే నేనునిరాకరించుచున్నా నని మీరనుకొనియుందురు. అట్లుగాదు. నేను పూర్వము తేనీరు మి తిమీఱఁ ద్రాగుచుండువాఁడను. ఇప్పుడును దేనీరు వాసనకే నేను త్కంఠితుఁడ నగుచున్నాను. కాని, నాతల్లిగారు పురాణమతాభి మాని యగుటచే నామెయభిమతమునకు వ్యతిరిక్తముగా నేను నడు చుటలేదని మీ రెఱిఁగియుండవచ్చును. ఇందువలననే నేను దేనీరుఁ గ్రోలుట మానివేసితిని." అనియెను.

ఇంతవఱకు నళిని కమల నయనబాబుమాటలు విని యసంతు ష్ట యగుచుండెను. అతఁడు నిజవృత్తాంత మేమియుఁ జెప్పక దాచు చున్నాఁడని యామె భావించుచుండెను. కాని, యాతఁడు మాతృ శ్రీనామ ముచ్చరించునప్పు డాతనిముఖమున నుద్భవించినభక్తిచ్ఛటఁ గని యామెసంశయము లన్నియు దూరమయ్యెను; ఆమె యంతః కరణము ద్రవించెను. కమల నయనబాబు మాతృశ్రీవిషయమై యింక నాతనిఁ బ్రశ్నించి విశేషము లన్నియు నెఱుంగఁదలఁచెను. కాని, లజ్జచే నామెముఖమున మాట వెలువడదయ్యెను.

ఘనానంద—ఆహాహా! ఈవృత్తాంతము నాకుఁ దెలిసియుం డినయెడల మిమ్ముఁ దేనీరుఁ ద్రాగుడని బలవంతపఱచియే యుం దను. క్షమింపుఁడు.

కమలనయన—(నవ్వి) నేను దేనీరుఁ ద్రాగలేదని మీకు నాయెడ నున్న ప్రేమ కొఱవడదని నమ్ముచున్నాఁడను!

కమల నయనబాబు వెడలిపోయినపిమ్మట నళిని తన జనకు నితో మేడమీఁది కరిగెను. ఒకమాసపత్రిక యందలి మంచిమంచి వార్తలను నళిని చదివి తండ్రిగారికి వినిపించుచుండెను. వినుచుండఁ

గనే ఘనానందబాబు నిద్రావశుఁడయ్యెను. ఇటీవల నాతని దేహమున నేకార్యమునైనఁ దడవుసేయ లేనంతయాయాస ముద్భవించి యుండెను.

---

## పదునొకండవ ప్రకరణము

---

### శాంతిలాభము.

కొంతకాలమునకే ఘనానంద బాబును కమల నయనబాబును దృఢమిత్రులైరి. ప్రథమారంభమున నళిని తనమనసునఁ గమల నయన బాబుంబోలిన వేదాంతియొద్ద నుండి యాత్మజ్ఞానసంబంధమై యేమైన నుపదేశ మందవలయు నని తలఁచెను. సర్వసాధారణుల తోఁబలె నిట్టిజ్ఞానవంతుఁడగు పురుషునితో, లోకాభిరామాయణ కాలక్షేపము సేయుచు ముచ్చటించు టనుచితమని యామెకుఁ దోఁచెను; ఆలోచింపఁగా నీకల్పనయు నిరాధారమైనది కాదు. ఏలయనఁ గమలనయనబాబు హాస్యవినోదసంభాషణలోఁ గలసిమెలసి యుండుచుండలేదు. ఒకనాఁడు ఘనానందబాబు, నళినియుఁ గమల నయన బాబును మంతనము లాడుచుఁ గూర్చుండియుండిరి. ఇట్టిసమయమున యోగీంద్రుఁడట కరుదెంచి యావేశముతో "బాబా! లోకులనేకు లిప్పుడు మీరు కమల నయనబాబునకు శిష్యులైతిరని యనుకొనుచున్నారు. ఈవిషయమై నేఁడు ప్రదీపునితో నాకెంత వాదము జరిగినదో మీకుఁ దెలియదు" అనెను.

ఘనానంద—(నవ్వి) అందు విచారింపవలసిన దేమున్నది? ఎందు నందఱుగురువులేయై శిష్యులెవ్వరును లేరో, యట్టిజనసమూహమునఁ గలసియుండుటకు నాకు సిగ్గగుచున్నది. అందుపదేశము లభించుననునాసయే లేదు.

కమలనయన—నేనును శిష్యవర్గములోఁ జేరినవాఁడనే యని నమ్ముఁడు.

యోగీంద్ర—కమల నయనబాబూ! ఇదేమియు బాగుగ నుండలేదు. మీరిట్టియాడంబర మేలచేసెదరు?

కమల నయన—ఎట్టియాడంబరము?

యోగీంద్ర—మీరుఁరిప్రాణాయామము సేయుచుందురని విని యున్నాను. ప్రాతఃకాలమున నర్కునివంక నేకదృష్టితోఁ జూచుచు నిలుచుందురు. భోజనపానీయముల విషయములలో నెన్ని యోనేమములున్నయవి, ఈయోగములవలననే పనుగురునుమీతో నేకీభవింపరు.

యోగీంద్రుని యీమాటలువిని నళినితలవంచుకొనియెను. కమల నయనబాబు మందహాసముసేసి "మీరనునది సత్యమే. నాని ధర్మధర్మములమూలమున నలుగురిలోఁ గలసియుండుటకు వీలు లేకుండుట విచారణీయమే. అట్లున్నను, వీనినన్నిటిని రహస్యముగానే చేయుచుందును. అట్టిచో నివియన్నియు నందఱకు నెట్లు తెలియు చున్నవో నేనెఱుఁగను" అనియెను.

యోగీంద్ర—లోకుల నభివృద్ధిపఱచు భారము తమపైనిడికొని యున్న వారిట్టిరహస్యములఁ బరిశోధించుటలో మగ్నులై యుందురు. సామాన్యజనులు చేయని రహస్యకృత్యము లెట్టివైనను బయల్పడకమానవు. అంతదూర మేలనులకు? నళినియే మీయభివృద్ధిం గోరుచు, మీలోఁ గొంతమార్పు సేయనెంచియున్నయది. కావున, మీరు మీమేడపై బయట రహస్యముగా నేమేమి సేయుచుందురో యన్నియుఁ మరుఁగుననుండి నళిని చూచుచున్నది.

నళినిముఖ మారకర్త మయ్యెను. ఆమె యేమియో పలుకను ద్యమింప నామెభావ మెఱిఁగి కమల నయనబాబు "ఇందువలన మీ కేమియు నపకారముఁ లేదు. మీరు మీమేడమీఁద నటునిటుఁ దిరుగు

చుండవచ్చును; అప్పుడే నేను ప్రాణాయామము సేయుచుండుట తట స్థమయియుండును. సహజముగనే నేను మీదృష్టిం బడియుందును. అందు మీతప్పేమియు లేదు'' అనియెను.

ఘనానంద—మీ యీనిత్యకర్మముల విషయమై నళిని మిమ్ము నిందించుచుండలేదు. వానివిషయమై శ్రద్ధతో నెన్నియో ప్రశ్నలడుగుచున్నది.

యోగీంద్ర—కమల నయన బాబూ! నేనొకసాధారణమనుజుఁడను. నామత మేమన—నలుగురు నెట్లు ప్రవర్తించుచుందురో యట్లులే ప్రవర్తింపవలెను; అటుగాక విశేషప్రవర్తనల నెలఁగిన, లోకులు పరిహసింతురు. విచిత్రముగ నీక్షింతురు. కావున, నిట్టి పరిహాసపాత్రమగుజీవిత మెట్లు గడపవచ్చును? అందు సుఖమేమున్నది? అంతకన్న సాధారణవృత్తిని స్వీకరించుటయే మేలుకదా!

కమల నయన—మఱి మీరెక్కడకుఁ బోవుచున్నారు?

యోగీం—చాలసేపు మీతో సంభాషించితిని. ఇంకఁ గొంచె మటుతిరిగి వచ్చెదను.

యోగీంద్రుఁడు వెడలిపోయిన పిమ్మట నళిని యవనతవదనయై బల్లపైఁ బఱచియున్న వస్త్రమును బట్టి నిష్కారణముగ నటునిటులాగుచుండెను. ఆసమయమున నామెవంక నెవ్వరైన లక్ష్యపూర్వకదృష్టి నిగుడించియున్నచో నామెకన్నులశ్రుజలపూరితములై యున్నట్లు దృగ్గోచరమయియుండును. పిమ్మటఁగొన్నిదినములు గడచెను కమల నయను ననుకరింపవలెనని నళినికిఁదోఁచెను. ఆమెయౌదాసీన్యహృదయమున నేదైనఁ గఠినవ్రతము నాచరింపవలెనని తోఁచెను. పలయున, దానిమూలమున హృదయమున కొకవిధమగునవలంబనము లభింపఁగలదు. ప్రప్రథమున లోకులు తన్నుఁ బరిహాసింతురని యామెకుభీతి తోఁచుచుండెను. కాని, కమల నయ

నునియుదాహరణము ప్రతిదినము కన్నులఁ బడుచుండుటచే నామె భీతి నష్టమయ్యెను. ఆమెయొకవిధముగ బ్రహ్మచారిణియయ్యెను. నిత్యమును ప్రాణాయామ మొనరించుటకు నిశ్చయించి యున్నందున నామెముఖమున నొక విధమగు నానంద కాంతి ప్రసరించెను. ముఖమున శాంతిచ్ఛట క్రమ్మియుండెను ఆజవ్వని తన గదిలోని సకల శృంగారవస్తువులకు శాశ్వతముగ సెలవిచ్చివేసెను. ఆమె గదిలో మధ్యభాగమున నొకమట్టియరుఁగుండెను. నిత్యము నుదయమున నామె హస్తములచే నాయరుఁగునలికి యొకచీనామట్టిపాత్రను శుభ్రముగఁ దోమి యందుఁ బుష్పములనైచి యాయరుఁగుపై బెట్టును. తదనంతరము స్నానముచేసి శుభ్ర శ్వేత వస్త్రమును ధరించి యొక చాపవేసికొని దానిపైఁ గూరుచుండును. ఆ మందిర ద్వారములన్నియుఁ గిటికీద్వారము సైతము తెఱచియుంచును. అందువలనఁ బరిశుభ్ర వాయు వంతఃప్రవేశించును. ఆ పరిశుద్ధమారుతముచేతను, స్వచ్ఛప్రకాశముచేతను నామె స్వాంతఃకరణమును బట్టాభిషేక మొనర్చి భక్తిపూర్వకముగఁ బరమేశ్వరుని స్మరించి యాసర్వవ్యాపి యొక్కొక్క నామము నుచ్చరించి యొక్కొక్క పుష్పము సమర్పించును.

నళినియొక్క యీవర్తనక్రమము నఘహానంద బాబుయొక్క పూర్ణసహానుభూతి యుండుట శక్యముకాదు. గాని, యీనియమపాలనము మూలమున నళిని ముఖేందుబింబమునకుఁ గలిగియున్న ప్రసన్నతఁ గాంచి యావృద్ధ పితరునివ్హాదయము స్నేహవిహ్వలమయ్యెను. గాని, యోగేంద్రుఁడుమాత్ర మామెను నిర్భర్త్సనసేయుటలోఁ దక్కువసేయుటలేదు. అతఁడు "నీవెట్టినియమము నవలంబించియున్నావు! ఉపాసనాడంబరముచేసి మీరు గృహమంతయు దుర్గంధముగఁ జేసివేసితిరి. నాయట్టిఘనుజున కిట్టిగృహమున నుండుటకు శక్యముకాదు!" అని యనుచుండెను.

పూర్వము నళిని యోగీంద్రునిపైఁ గోపించుచుండెను. ఇప్పు డది మాని వేసెను. అతఁడెట్టి కఠోర భాషణములాడిన నామెయూరక మందహాస మొనరించుచుండెను. ఇప్పు డామె యోగీంద్రుఁడుగాని మఱెవ్వరుగాని పరిహసించినను లక్ష్యపెట్టకుండెను. ఆమెకుఁ గమల నయనునియెడలను నతఁడుపదేశించిన మార్గమునెడలను దృఢవిశ్వాస ముండెను. ఆమె హృదయము శాంతమును నిర్వికారము నగుచుండెను. ఒక్కనాఁడు నళిని ప్రాతఃస్నానము చేసి, యీశ్వరోపాసన మొనరించి తనగదిలో నెమ్మదిగఁ గూర్చుండియుండెను; ఇంతలోఁ గమలనయన బాబుతో ఘనానంద బాబటకు విచ్చేసెను. నళిని హృదయమున శాంతభావము వ్యాప్తమయి యుండెను. తటాలున లేచి యామె తొలుతఁ గమలనయన బాబుగారికి సాష్టాంగప్రణామ మొనర్చి, పిదపఁ దండ్రిగారికి నమస్కరించి యాయిరువురి పాదధూళియుఁ దనమస్తకముపై నిడికొనెను. కమలనయనున కత్యంత సంకోచమయ్యెను. కాని, ఘనానందబాబు "మీరిట్టులనుమానింపనేల? నళిని తనకర్తవ్యమును బాలించెను" అనియెను.

ఎప్పుడును గమలనయన బాబింత ప్రాతఃకాలమున వచ్చుచుండలేదు. ఈ కారణముచేతనే నళిని యుత్కంఠితముద్రయై యాతని యాననమువంకఁ గాంచుచుండెను.

కమలనయన—గాశీనుండి మాయమ్మగారి యుత్తరము వచ్చినది. ఆయుత్తరమువలన నామె దేహమస్వస్థముగ నుండినటుల తెలియుచున్నది. గావున, నేఁడుసాయంకాలపుబండిలోఁ బ్రయాణమైపోవ నిశ్చయించితిని. ఇచట మిత్రులనందఱ నొక్కమాఱు సందర్శించి పోవుట ముఖ్యముకదా! కావునఁ బ్రథమమున మీకడకేవచ్చితిని.

ఘనానంద—డాక్టరుగారూ! తమతల్లిగారికిఁ బరమేశ్వరుఁడు శీఘ్రమే యారోగ్య మొసఁగుఁగాక! ఇన్నిదినములవఱకు మీసత్సాం

గత్యలాభము మాకబ్బియుండెను. మీరు మీదివ్యోపదేశములచే మాయందఱకును మహోపకార మొనరించి యున్నారు; మీయీ ఋణము మేమెప్పుడు తీర్చుకొందుమో కదా ?

కమలనయన—మీహృదయ ముదారము కావుననే మీరిట్టు లనుచున్నారు. నిశ్చయముగఁ బరికింప మీరే నాకనేకవిషయముల నుపకరించితిరి. నేను గించిజ్ఞుఁడనై యుండినను మీరు నన్నింతగా గౌరవపఱచితిరి; మీగృహమునకుఁ బ్రక్కగృహమున నన్నుంచితిరి, నా యోగక్షేమముల నారయుచుంటిరి. ఇవన్నియు స్వల్పోపకారము లేనా?

ఘనానంద—మీయాగమనము మహాయోగ్యసమయమున నయ్యెను; కావున, మాకు శుభ మొదవెను. మేమెల్లరమును జింతాసాగరమున మునిఁగియుంటిమి. ఇట్టిసమయమున మీదర్శనము లభింపకుండినచో మేమెట్టిదుర్దశలపాలై యుందుమో యెవ్వరెఱుఁగుదురు! వినుఁడీయాశ్చర్యము! మేమిటీవల నెక్కడకును బోవుటయు వచ్చుటయు మానియుండినను, నాఁడు మీరుపన్యసింతురని వినఁగనే యాయుపన్యాసమును వినుకుతూహలముతో బయలుదేరితిమి. అందునను విశేషముగ నళినియు నాతో వచ్చుటకు సంసిద్ధయైనది గొప్ప యాశ్చర్యమే! అప్పటినుండియు మీపైమాకు శ్రద్ధ యుదయించెను. మనస్నేహము చిరకాలము నుండుఁగాక యని మేమీశ్వరునిచరణములఁ గొలుచుచున్నాము.

కమలనయన—నేను నేఁటివఱకు నాజీవితరహస్యముల నొరులకుఁ జెప్పియుండలేదు; కాని, మీదృఢశ్రద్ధంగని మీతోఁ జెప్పితిని. ఇప్పుడేవిషయమును మీకుఁ దెలుపక నేనుదాచియుంచలేను.

ఈపలుకులు నళిని మనఃపూర్వకముగ వినుచుండెను. తుదకుఁ గమలనయనబాబు లేచి వెడలునపు డామెనమ్రతతో "అమ్మగారి కెట్టులుండునదియు నప్పుడప్పుడు మాకుఁ దెలియుచుండునట్టులొనర్పుఁడు" అనియెను.

నళిని కమలనయనునకు సాష్టాంగప్రణామ మొనరించెను.

---

# పండ్రెండవ ప్రకరణము.

---

## అక్షయ కుమారుఁడు.

ఈనడుమఁ గొంతకాలమునుండియు నక్షయకుమారుఁ డెందుండుటయు, నేమిచేయుచుండుటయు, నెట్లుండుటయు నేజాడయు దెలియలేదు. కమలనయనబాబు కాశికి వెడలిపోయినసమయమునఁ డక్షయుఁడు ఘనానందబాబు తేనీరుబల్లదగ్గఱ ప్రత్యక్షమయ్యెను. నళినికి రమేశునియెడ నత్యంతానురాగము కలదనియు, దనయెడఁ గ్రోధమున్నదియు నాతఁడు చక్కగ నెఱిఁగియుండెను. కాని, నేఁడు నళినీస్వరూపము నితాంతశాంతముగా నుండుట యాతనికగపడెను అక్షయకుమారునిగాంచియు నామెరూపము మాఱదయ్యెను. నళిని ప్రసన్నముద్రతో "అక్షయబాబూ! నేఁటికిఁ జాలదినములనుండియు మీదర్శనము లభింపలేదు. ఎక్కడనైనఁ బరదేశముల కరిగియుంటిరా?" అని ప్రశ్నించెను.

అక్షయ—పరదేశములకుఁగా దెక్కడకుఁగాదు ఇంటనే యుంటిని. కాని, నేననుదినమునుఁ జూచునంతటి యోగ్యత గలవాఁడనా?

నళిని—(నవ్వి) యోగ్యత లేదని మీరు బయటికి రాకపోకలు మానివేసినయెడల మాలోఁ గొందఱింటనే దాఁగియుండవలసివచ్చునేమో!

యోగీంద్ర—వినయశీలభాషణంబులచే సంపూర్ణయశమార్జింపవలెనని యక్షయుఁ డనుకొనియుండెను; కాని, నళిని వినయశీలములవిషయమై యతనితోఁ దగవులాడి యశమంతయు నామెయే గడించెను. కావున, నిక్కడ నేనిప్పు డొకటి చెప్పనెంచియున్నాను. మేము సామాన్యమనుష్యుల మగుట నిశ్చయమే; అట్లుండియు

మేమనుదినమును దృష్టింబకుచుందుము. అసామాన్యవ్యక్తి దర్శనము మాత్రము కేవలదైవయోగమువలననే కలుగును.

అక్షయ—ఆమహాత్ము లెల్లప్పుడు నరణ్యములలోను, బర్వతగుహాలయందును నివసించుచుందురు.

ఏజాడయులేక యెచ్చటనో యున్నరమేశచంద్రు నుద్దేశించి యాక్షయుం డాడినయీమర్మభేదకభాషణములు నళినీహృదయమున కశాఘాత మొనరించెను. కాని, యావిషయమై యొకయక్షరమైనం బలుకక మౌనముతో నామె మూండుగిన్నెలలోం దేనీరు నింపి ఘనానంద, యోగీంద్రాక్షయులముం దిడెను.

యోగీంద్ర—నీవు తేనీరుం ద్రాగవని తోంచుచున్నది!

• యోగీంద్రుం డేమైనం గఠోరభాషణము లాడునని తెలిసియుండియు నళిని శాంతభావముతో "లేదు; నేను దేనీరుం గ్రోలుట మానివేసితిని" అనియెను.

యోగీంద్ర— ఇంక విధిపూర్వకముగం దపశ్చరణమున కారంభమైనట్లున్నది. తేయాకులో నాధ్యాత్మికగుణ మేమియు లేదని తలంచెదను. ఉన్నదంతయు హారీతకమున నున్నది. దుర్దైవము! దుర్దైవము! నళినీ! నామాట విని నీవీయాడంబర మంతయు వదలివేయుము! ఒకగిన్నె తేనీరుం గ్రోలుటవలన నీతపస్సంతయు నష్టమగుచున్నయెడల నీవింటనుండుటకుం దగవు. ఎచ్చటనైన నొకపర్వతగుహలో నుండి తపశ్చరణ మవలంబించి, కఠినవ్రతధారిణివై శీఘ్రముగనె సిద్ధురాల వగుము! ఇట్టికఠోరవ్రతము నవలంబించి గృహమున నెట్లుందువు?" అని యనుచు యోగీంద్రు డొకగిన్నెనిండం దేనీరు నింపి దానిని నళినిముందిడెను. కాని, యట నిర్లక్ష్యము వహించి యామె తండ్రిగారితో "మీరు నేడు తేనీరుమాత్రమే త్రాగితిరి; ఏమియు దినరైతిరి." అనియెను.

ఘనానంద.—(గద్గదస్వరముతో) బిడ్డా! నీకు నిక్కమును చెప్పుచున్నాను. ఈబల్లపై టేసీరు గ్రోలుటకు, నేనెట్టైన దినుటకు నా కనిష్టముగా నున్నది. యోగీంద్రునితో సంభాషణము లప్పటినుండియు మౌనముతో విని యోర్చుచున్నాను. ఏమైన నుత్తరమిచ్చుటకు నాకు సాహసమగుచుండలేదు. ఏల? ఈముప్పుగాలమున నానోట నేనేమైన ననుటయెందులకు? వెంటనే పశ్చాత్తాప మొందుటెందులకు?

నళిని—(తండ్రికుర్చీదగ్గఱ నిలిచి) బాబా! మీరు కోపింపకుడు! అన్నగారు టేసీరు గ్రోలుమని నన్ను బలవంతపఱచుచున్నారు. అందాయనతప్పేమున్నది? ఆపలుకులకు నాకే కోపము రాలేదు. మీరేమైన నాదరింపుడు! టేసీరుమాత్రము గ్రోలుటచే మీప్రకృతి నానాటికి జెడునుగదా!

నళిని యొకపళ్లెరమున మేవామిఠాయియుంచి ఘనానందబాబుముందిడెను. బారద్దానిని దినదొడఁగిరి. నళిని వెనుక కేగి తనకుర్చీపైఁ గూర్చుండెను. యోగీంద్రుఁడు నించిన టేసీరుగిన్నె నెత్తియామె త్రాగఁబోయెను. అంతలో నక్షయకుమారుఁడు "క్షమింపుడు! ఈగిన్నె నాకిండు! నాకిచ్చిన టేసీరు నేను ద్రాగితిని." అనియెను.

యోగీంద్ర—(కోపముతో నళినిచేతనున్న టేసీరుగిన్నె లాగికొని) నేను మహాపరాధ మొనర్చితిని. క్షమింపుము!

యోగీంద్రుఁ డక్షయునితో నింటినుండి వెడలిపోయెను. ఘనానందబాబు నళినిహస్తము నూఁతగఁగొని కంపితపదములతో మేడమీఁదికరిగెను. ఆరేయి యాతనికిఁ గడుపునొప్పి కనిపించెను. విశేషముగ బాధపడుచుండుటవలన డాక్టరును బిలువనంపిరి. డాక్టరు పరీక్షించి "వీరిపైత్త్యాశయము చెడియున్నది. విశేషముగ భయపడ

వలసినట్టి దేదియును లేదు. కావున, నీరోగము ప్రబలమగుటకు మున్నె పశ్చిమదేశములకరిగి యారోగ్యస్థలమువఁ గొంతకాలముం డిన నుత్తమమగును. మీరారోగ్యముపొందినపిమ్మట నిటకు రావచ్చును'' అనియెను. ఉదరశూల తగ్గినపిమ్మట డాక్టరు వెడలిపోయెను. అటుపిమ్మట ఘనానందబాబు నళినితో ''బిడ్డా! మనము కొంత కాలము కాశీనివాసము సేయుదము!'' అనియెను.

ఘనానందబాబీయభిప్రాయము వెలిపుచ్చుటకుమున్నె నళిని యాయాలోచనయే మనసున నిశ్చయించుకొనుచుండెను. కమలనయనబాబు వెడలిపోయినప్పటినుండియు నళిని క్రియాకాండమందు మునుపటియంతశ్రద్ధ వహించియుండలేదు. కమలనయనుని సాన్నిధ్యమామెకు బలమైయుండెను. ఆతని ముఖమున నెల్లప్పుడును దాండవమాడు స్థిరనిష్ఠయుఁ బ్రసన్నతయు నామెమనసున కాహ్లాదము నిచ్చుచుండెను. కాని, కమలనయనబాబు కాలికి వెడలిపోయినవాది యామె యాయుత్సాహము కోలుపడుచుండెను. కావుననే, తండ్రిగారు కాశీప్రయాణమునుగూర్చి ముచ్చటించినంతట నామె ''నాన్నా మీయభీష్టముచొప్పున గాశికేఁబోయి యచటఁ గొంత కాలము నివసింతము.'' అనియెను.

మఱునాఁడు ప్రయాణసన్నాహము లగుచుండ యోగేంద్రుఁడు ''ఏమిసన్నాహములివి!'' అని ప్రశ్నించెను.

ఘనానంద—మేము పశ్చిమమున కేగనిశ్చయించినారము.

యోగేంద్ర—ఏయూరికి ?

ఘనానంద—తిరుగఁ దిరుగనారోగ్య స్థలమేదో యటనుందుము. ఏయూరివీరును, గాలియు శరీరమునకుఁ బడునో, యాయూర నుండుమని డాక్టరాజ్ఞాపించియున్నారు.

కాశికిఁ బోవు నాలోచన మాతఁడు యోగీంద్రునితోఁ జెప్ప లేదు.

యోగీంద్ర—ఈసారి మీతో వచ్చుటకు నాకు వీలులేదు. నేను ప్రధానోపాధ్యాయోద్యోగమునకై మనవిపత్రమును బంపి యున్నాను. అందునకుఁ బ్రత్యుత్తరమును నిరీక్షించుచున్నాఁడను.

---

## పదమూఁడవ ప్రకరణము.

### గంగాప్రవాహము.

మఱునాఁడు రమేశుఁ డలహాబాదునుండి గాజీపురమునకు వచ్చెను. అపుడు వీధులలో జనులగుంపు విశేషముగ నుండలేదు. కాని, మంచు కురియుచున్నందునఁ ద్రోవ చాలదూరము కనబడు చుండలేదు. రమేశుఁడు దిట్టమగుచొక్కాయి యొడలిపై వేసికొని యింటివైపునకుఁ బండిలోఁ బోవుచుండెను. అతనిహృదయము తీవ్ర ముగ నెందులకుఁ గొట్టుకొనుచుండెనో యెవ్వరెఱుంగుదురు? గృహబ హిర్ద్వారముండ కేగినంత నాతఁడు బండినుండిదిగెను. బండిచక్రము లధ్వని వినినంతనే కమల బయటికివచ్చి చూచునని యాతఁ డనుకొని యుండెను. ఆతఁడు కమల కంఠమున నలంకరించుటకై యొకయ మూల్యచంద్రహార మలహాబాదునుండి కొనితెచ్చియుండెను. దాని నిచేత ధరించెను. ద్వారముకడ కేగి చూడ నచట మోహనుఁడు గాఢనిద్రాపరవశుఁడై యుంట రమేశునకుఁ గనఁబడెను. గృహక వాటములన్నియు మూయఁబడియుండెను, రమేశుఁ డచ్చటనే నిలిచి "మోహనా!" అని బిగ్గరగా నఱచెను. రెండుమూఁడుమారులు పిలి చిన పిమ్మట మోహనుఁ డులికిపడి మేల్కాంచెను; కాని, యింకను, గన్నులు నలుపుకొనుచు నీప్రక్కనుండి యాప్రక్కకు మరలెను.

రమేశ—మీయజమానురా లెందున్నది?

మోహనుఁ డీప్రశ్న వినెనో లేదో—లేక, వినియు దాని యర్థమును గ్రహించెనో లేదో యదియునుసందేహమే; కొంతసేపూరకుండి పిదప "ఆఁ అమ్మగా రింటనున్నారు?" అనియెను.

రమేశచంద్రుఁడు తలుపుగ్రుద్దెను. ఆతలుపు తెఱవఁబడెను. లోపలికరిగి రమేశుఁడు గృహమున్నివైపుల శోధించెను; ఆమె యెందును గానరాదయ్యెను. ఒక్కపజి బిగ్గఱగాఁ "కమలా" యని పిలిచెను. ప్రత్యుత్తరము రాలేదు. గృహము నావరించియున్న పూఁదోఁటలోనికరిగి వెదకెను. కాని, యందును నామెజాడ కానరాదయ్యెను. స్వయంపాకమందిరమునను సేవకులగృహమునను నెందు వెదకినను నగపడలేదు. సూర్యుఁడు క్షితిజముపైఁ బొడకట్టుచుండెను; విహగగణము లిటునటు పరుగువాఱుచు, నాహ్లాదకరముగఁ గలకలధ్వనులు సేయుచుండెను. సమీపముననున్న బావిచెంతకకునీటికై యిరువురు స్త్రీలు శిరసులపై భాండములనిడికొని వచ్చుచుండిరి. బాటకుఁ బ్రక్కనున్నయొకగృహములో నొకమధ్యమవయస్కస్త్రీ పాడుచు నేదియోపిండి పిసరుచుండెను రమేశుఁడు మరల బయటికివచ్చి చూచెను. మోహనుఁ డింకను నిద్రించుచునే యుండెను. రమేశుఁడు వానివీపుపైఁ దట్టి లేపెను, వానిముఖమునఁ గల్లువాసనకొట్టుచుండెను. చాలసేపటికి పిమ్మట మోహనుఁడు నిదురమేల్కొని భీతినేత్రుఁడై చూడసాగెను.

"నీయజమానురా లెటనున్నది?"

"ఇంటనున్నారు."

"ఇంట లేదు."

"నిన్న నిచ్చటనే యుండిరి."

"ఇక్కడకు వచ్చినపిమ్మట, నామె యింక నెక్కడికైనఁ బోయియుండెనా?"

"అవును." అని వాఁడొకానొక మూర్ఖునివలె రమేశచంద్రుని ముఖమువంకఁ దదేకదృష్టితోఁ జూడసాగెను.

ఇంతలో వెడల్పుగలపట్టుచుధోవతిని గట్టుకొని యట్టివస్త్రమేయొకటి వల్లెవాటుగ వేసికొని యుమేశుఁడట కేతెంచెను. వాని కన్ను లెఱ్ఱగ నుండెను.

రమేశ—మీయమ్మ యెటనున్నది?

ఉమేశ—నిన్న నిక్కడనే యుండెను.

రమేశ—నీవెక్కడ కేగియుంటివి?

ఉమేశ—శ్రీపతిబాబుగారింట నాటకముఁజూచుటకై యమ్మ నన్ను పంపినది.

ఇంతలో బండితోలువాఁడువచ్చి "బాబూ! నాబండిబాడుగ దయచేయుఁడు!" అనియెను.

రమేశుఁడు తటాలున నాబండిలోనెక్కి చక్రవర్తిగారి గృహంబున కేగెను. ఆగృహమున నందఱును విచారముగా నుండిరి. ఒక వేళఁ గమల యస్వస్థురాలై యుండఁబోలునని యతఁడు తలఁచెను. కాని, యాశంక నిష్కారణమైనది. కడచిన రాత్రినుండియు నుమ కడుంగడు నస్వస్థయై యుండెను. ఆబాలికముఖమంతయు నల్లవడెను. ఆబాల బాలునేతు లిటునటు కొట్టుచుండఁ జూచిన వారందఱును భయభ్రాంతులైరి. ఆకూన కౌషధాదులొసఁగుటలో నెల్లరును మగ్నులైయుండిరి. ఎల్లరిచిత్తవృత్తియు వ్యగ్రముగను నుదాసీనముగ నుండెను. రేయంతయు నెవ్వరికిని నిద్దుర లేదు. రమేశచంద్రుఁడు తనలో "ఉమకు జబ్బుచేసినదనువార్త విని కమల యిచటికి నిన్న వచ్చియుండఁబోలును!" అని యనుకొనియెను.

అతఁడు విపినబాబుతో "ఉమకు శుశ్రూషసేయుటలో కమల లీనమైయుండఁబోలును!" అనియెను.

కమల యిచ్చటనున్నదియు లేనిదియు విపినబాబు చక్కఁగ నెఱుఁగఁడు. కావున, నాతఁ డేదైన మాటలాడవలెనని యెంచి "అవును. కమలాబాయి కున్నపై మిక్కిలి ప్రేమకలదు. ఆమె మిక్కిలి విచారముతో నుండెను. కాని, విశేషముగ భీతికొల్పించు నంతటి దేమియు లేదని డాక్టరుగారనియున్నారు. ఆమె శీఘ్రముగ నారోగ్యవతియగుట కావంతయును సందేహము లేదు." అనియెను.

ఎట్లయిన నుండనిమ్ము విపినబాబు పలుకులకు రమేశచంద్రున కాహ్లాదమయ్యెను. ఆతనిముఖము ప్రఫుల్లమయ్యెను. కాని, మరలఁ గొంతసేపటిలోఁ దర్కవితర్కము లాతని హృదయమున వ్యాప్తములయ్యెను. ఆతఁడు తనలో "నాకుఁ గమలాసందర్శనము లభించుటకేదైన విఘ్న మవశ్యముగ కలుగునుగాఁబోలు!" నని యనుకొనియెను. ఇంతలో రమేశచంద్రుని యింటనుండి యుమేశుఁడటకు వచ్చెను. వాఁడింటిలోపలికిఁబోవుసరి కునుకు నిద్రాభంగమగునను భీతిచే నన్నపూర్ణ బయటికి వచ్చెను. ఉమేశుఁ డామెంగని "అమ్మ యెందున్నది?" అని ప్రశ్నించెను.

అన్నపూర్ణ—(ఆశ్చర్యచకితయై) నీవే నిన్న నామె నిటనుండి పిలిచికొనిపోయితివికదా! సాయంకాలమైనపిమ్మట దాసినంపి యామెను దోడ్తెచ్చుట కాలోచించితిమి, కాని, యామె యాకస్మికముగ వ్యాధిగ్రస్తయగుటచే మాకేమియును దోఁచలేదు.

ఉమేశ—(సంభ్రమముతో) వారాయింట లేరు.

అన్నపూర్ణ—(భీతితో) అనఁగా? నిన్న రాత్రి నీ వెచట నుంటివి?

ఉమేశ—నిన్నరాత్రి యమ్మ నన్నింటనుండనీయ లేదు. శ్రీపతిగారియింటికి నాటకమును జూచుటకై పంపినది.

అన్నపూర్ణ—నీ తెలివి యింతలోనున్నది. మోహనుఁ డెచ్చటనుండెను?

ఉమేశ—మోహనుఁ డేమియుఁ జెప్పుటలేదు. కల్లుద్రాగి మత్తుఁడై పడియున్నాఁడు.

అన్నపూర్ణ—పో—పోయి బాబునిచటికిఁ బిలువుము.

ఇంతలో విపినబాబచటకేతెంచెను. అన్నపూర్ణ యతనిఁగని "హా! హా! ఎంతవిపరీతము!" అని తత్తరపడియెను.

విపిన—(వివర్ణుఁడై) ఏమి? ఏమివిపరీతముజరిగినది?

అన్నపూర్ణ—కమల నిన్నఁ దనయింటికేగెను. నేఁడచట నామెజాడయే లేదఁట

విపిన—కడచినరాత్రి యామె యిచటికి వచ్చియుండలేదా?

అన్నపూర్ణ—లేదు. ఉమకు జబ్బుచేసినప్పు డామె నిచటికిఁ దోడితేవలెనని నేననుకొంటిని. కాని, పిలుచుట కెవ్వరూరకున్నారు?

విపిన—కమల యింటలేనందున నామె యిచటనున్నదని భావించి రమేశబాబిచటికి వచ్చియున్నాఁడు.

అన్నపూర్ణ—మీరు రమేశబాబును వెంటఁగొనిచని కమలను శోధింపుఁడు. ఇప్పు డుమ నిదురించుచున్నది. ఆమెకై విచారింప నక్కఱలేదు.

విపినరమేశులు మరల బండినెక్కి రమేశబాబుగృహమున కేగిరి. వారు కమలవిషయమై మోహను ననేకప్రశ్న లడిగిరి. తుదకింతమాత్రమే వారికి వానివలనఁ దెలిసెను—

"కడచిన సాయంకాలమునఁ గమలయొక్క తెయే గంగా స్నానము సేయుటకై పోయెను. మోహనుఁ డామెతోఁ బోవనెంచెను. కాని, వానికిఁ గమల యొకరూపిక బహుమతిగానిచ్చి వానిని వెనుకకు మరలఁజేసెను. వాఁడింటియొద్దఁ గూర్చుండియుండెను. అప్పుడే యొక శూద్రుఁడు కల్లుబింకెను దీసికొనిపోవుచుండుట వానిక గపడెను. మోహనుఁ డాశూద్రునొద్దఁ గొంచెముకల్లు వెలకుఁగొని

త్రాగెను. అటుపిమ్మట నేమైనదియు వానికిఁ దెలియదు'' కమల గంగ కేమార్గమున నేగెనో యామార్గమువంక నాతఁడు వ్రేలితోఁ జూపెను. వారందఱును కమలను వెదకుటకై యామార్గమునుబట్టి పోయిరి. ఉమేశుఁడు మాతృహీనయగు మృగశాబకమురీతి వ్యాకుల మైన చూపులతో నలువంకలఁ గాంచుచుఁ బోయెను. ఈమూవురును గంగాతీరమున కేగినిలిచిరి. చుట్టును నిసుకమయిదానమున్నది. ప్రాతఃకాలసూర్యరశ్మిచే నిసుక మనోహరముగ ప్రకాశించుచుం డెను. ఏవైపునను నేమనుష్యులజాడయుఁ బొడకట్టదయ్యెను. ఉమే శుఁడు బిగ్గఱగా "అమ్మా! యెందున్నావు? నాకొక్కమాఱుదర్శన మొసఁగుము! అమ్మా!" అని పిలువసాగెను.

• వానిపలుకులు ప్రతిధ్వనితములయ్యెను. అంతియే కాని పిలు పులకెవ్వరును బ్రత్యుత్తరమీయరైరి! అటుచూడఁజూడ నుమేశుని దృష్టి యనతిదూరమున మెఱయుచున్న యొకవస్తువుపైఁ బడెను. వాఁడద్దాని చెంత కేగి చూచెను. ఒకపట్టుచేరుమాలులోఁ గట్టఁబడి యున్న తాళవుఁజెవులు కమలవని యాతఁడు గుర్తించెను.

తాళవుఁజెవులగుర్తు పడియున్నచోటున కనతిదూరమున నే తడిసిన యిసుక నేలయుఁ జిన్నవియు సుకుమారములు నగునడుగుల గుర్తులు నుండెను. నీటనొకవస్తువు చమకితమగుచుండెను. దానిని నీటనుండితీసి చూచుసరికది యొకసువర్ణశృంఖలమని తెలిసెను. ఆసు వర్ణశృంఖల మొకప్పుడు రమేశునిచేఁ గమల కొసగఁబడియుండెను. ఇట్టియనేక చిహ్నాలచేఁ గమల గంగాజలప్రవేశ మొనరించెనని స్పష్ట ముగఁ దెలియుచుండెను. ఉమేశుఁడిఁక ధైర్యము పట్టఁజాలకపో యెను. వాఁడు "అమ్మా! అమ్మా!" అనియేడ్చుచు గంగాజల మునఁ బ్రవేశించి పిచ్చియెత్తినవానివలెఁ దనచేతులతో నానీట నలువంకలఁ బరికింపసాగెను.

రమేశుఁడు నాతచేతస్కుఁడై తీరమున నిలిచియుండెను. విపినబాబు రమేశునితో "అరే! ఏమిసేయుచున్నావు నీవు? రమ్ము, పైకిరమ్ము" అనియెను.

ఉమేశ—(ఏడ్చుచు) లేదన్నయ్యా! నేనీనీటినుండి బయటకి రాలేను. నేనీనీట నేమునిఁగి చచ్చువాఁడను. అమ్మా! అమ్మా! ఎచటికేగితివి? నన్నునునీవెంట నేందులకుఁదీసికొనిపోవైతివి? అమ్మా! నీవు లేకున్న నేనెట్లుబ్రతుకఁగలను? అమ్మా యని నేనింక నెవరినిఁ బిలుతును!

ఉమేశునిచిత్తచాంచల్యముఁగని విపినబాబు భయపడెను. కాని, యుమేశుడు నీటనీఁదఁగలఁడు. వాఁడు జలములమునిఁగి యాత్మహత్యఁగావించుకొనుట యశక్యము. తుదకు విసిఁగి వాఁడు నీటినుండి వెలువడి యిసుకలోఁబడి పొర్లుచు నేడువసాగెను.

విపినబాబు పాషాణప్రతిమయై యున్నరమేశునితో "రమేశ బాబూ! నడువుఁడు. ఇట నిలిచి చేయునదేమున్నది? పోలీసువారి కీయుదంతముఁ దెలియఁ జేయుదము. వారు వెదకుదురు. ఒకవేళ నెందైన జాడ తెలిసినను మంచిదే!" అనియెను.

చక్రవర్తిగారిగృహ మాదినమంతయు దీపికలేనిగృహము వలె నుండెను. దినమంతయు నాజనులందఱుఁ గమలావియోగమునకై శోకసాగరమున మునిఁగియేయుండిరి. బెస్తలచే నదిలోఁ జాల దూరమువఱకు వలలు వేయించి వెదకించిరి. పోలీసువారన్నివైపులను గమలను శోధింపఁదొడఁగిరి. విపినబాబు స్వయముగా స్టేషనునకుఁబోయి యందందు విచారణచేసెను. కాని, కమలగాని, యట్టి స్త్రీయెవ్వరైనఁగాని యేబండిలోను బ్రయాణముచేసినట్లు కనఁబడ లేదని తెలియవచ్చెను. ఆనాఁడు మూఁడుజాములకుఁ జక్రవర్తిగారింటికి వచ్చిరి. కమలాసంపూర్ణవృత్తాంతమువినియు, నామె యత్ను

శ్యముగుటకుఁబూర్వ మామె విపరీతవర్తనము నెంచియు, నాతఁడామె జలమునఁ బ్రవేశించి మునిఁగి యాత్మహత్యఁగావించు కొనెనని నిశ్చ యించెను.

పాపము! రమేశుడు శోకావేశమున భగ్నహృదయుఁడ య్యెను. అతఁ డలహాబాదున కేగిన దేకార్యమునకై? మరల నాతఁ డరుదెంచినవెంటనే రోమించూచుచున్నాఁడు? అతనిమనోరథ మం తయు మనసుననె విలీనమైపోయెను! అతనిజీవితమునందలి యొక యవలంబనము నష్టమయ్యె ననునట్లుండెను! అతఁడు శిరమునఁ జేయిడి కమలవిషయమైనపూర్వోదంతములఁదలపోయసాగెను "ఒక్క నాఁడీగంగాజలమునుండి బయల్పడి నాకు లభించెను! నెండియు నామె గంగాప్రవాహమున నర్ఘ్యోదకస్థపవిత్రపుష్పముభాతి యీగంగా ప్రవాహముననే యంతర్ధానమందెను!"

సూర్యుఁడ స్తమించుసమయమునకు రమేశుఁడు మరల గం గాతీరమునకు వచ్చెను. తాళ్వుఁజెవులగుత్తి దొరికినస్థలమున నిలు చుండి యాపాదచిహ్నాలఁ గాంచుచుండెను. పిమ్మట గంగాప్రవాహ మునఁ జేరెను. నడుములోఁతునీటికిఁ బోయి, చంద్రహారమును జేతఁబట్టుకొని దానినిఁ బ్రవాహమున విసరివై చెను.

రమేశుఁడు గాజీపురమునుండి యెప్పుడెచ్చటికేగినదియుఁ జక్ర వర్తిగారికిగాని, వారిగృహమున నెవ్వరికిఁగాని, యింకనెవ్వరికినిగాని తెలియలేదు!

---

## పదునాల్గవ ప్రకరణము.

---

### మిత్రసందర్శనము.

రమేశుఁడిక చేయవలసినకర్తవ్యము లేవియును లేవు. తన వలన నిఁకమీఁద నేమియుఁ గాఁజాలదనియు, నీవిధముగనె తానొక

స్థలమునుండి మఱొకస్థలమునకుఁ దిరుగుచుండవలెననియు రమేశునకుఁ బలుమారు తోఁచుచుండెను. నళినీ సంబంధమగు నాలోచనలాతని హృదయమున నుద్భవించుచుండకపోలేదు; కాని యావిచారమును మనసునుండి తొలఁగింప నాతఁడు ప్రయత్నించును; ఫలపుష్పపరిశోభితతరులతా శ్రేణిచే నిండియున్న యుపవనమున వజ్రాహతవృక్షమునఁ దనకు నివాసస్థలము లభించునని యాసించుట మౌర్ఖ్యముకదా యని యాతఁడనుకొనును.

రమేశచంద్రుఁ డిప్పు డొక్కస్థలమున స్థిరముగ నుండలేదు; ఆతఁడు దేశసంచారము సేయనెంచి గాజీపురము వీడెను. ఏయూరనైన నతఁడు చిరకాల ముండలేఁడు. ఆతఁడు నౌకాప్రయాణముచేసి కాశీఘట్టవిశేషములును, కుతుబ్ మినారు నెక్కి డిల్లీశోభను గాంచెను. ఆగ్రాలోనున్న తాజ్ మహాలు నీక్షించెను. అటనుండి కదలి యతఁడు రాజపుత్రస్థానమున కేగెను. అట నాబూపర్వతముపైనున్న ప్రాచీన మందిరముల నన్నిఁటిని దర్శించెను. ఇవ్విధముగా రమేశుఁ డనేక దేశములు చుట్టితిరిగెను; కాని, యతని హృదయమునకు శాంతి లభింపదయ్యెను. కడకాతనికి దేశాటనముపై విసుఁగుజనించెను; అప్పు డొక్క దీర్ఘనిశ్వాసమునువిడిచి రమేశుఁడు మరలఁ గలకత్తాకుఁ బ్రయాణమయ్యెను. కలకత్తానగరమునఁ జేరిన రమేశునకు గోలూటులావీథి కేగుటకు ధైర్యము కలుగలేదు. అటకేగిన నేమిచూడవలసి వచ్చునో యతని కెట్లు తెలియఁగలదు? ఏదోయనిష్టము చూడవలసి వచ్చునేమో! నళిని కమలనయనుని వరించియుండఁబోలు నను భీతిచే నాతఁ డావైపునకు మోముచూపలేకుండెను. అచ్చట నేమైన భయంకరపరివర్తన మైయుండవలయునను శంక యాతనిమనమునఁ దీవ్రముగ బాధించుచుండెను. ఒక్కనాడాతఁ డావీథివఱకుఁ బోయి యందుఁ జొరసాహసింపక మగిడివచ్చెను. మఱునాఁడతఁడు మహా

ధైర్యముతో నాగృహమువఱకు నేగెను; కాని, యామందిరద్వారములన్నియు మూయఁబడియుండుట యతనిదృష్టిఁబడెను. మందిరమును గనిపెట్టికొని యుండుటకై వారు రామధనునట డించిపోయియుందురని యతనికి నిశ్చయముగఁ దోఁచెను; కావున నతఁడు "రామధనుఁడా! రామధనుడా!" అని బిగ్గరగాఁ బఱచెను. రామధనుఁ డాప్రక్కయింటఁ గూర్చుండియుండెను. వాఁడచటనుండియే,

"ఎవరు? రమేశబాబూ! సుఖముగనున్నారా?" అనియెను.

"ఆఁ! ఈయింటివారందఱు నెక్కడనున్నారు?"

"నేను నిశ్చయముగఁ జెప్పలేను; కాని, వారు పశ్చిమదేశముల కేగియుండుటమాత్రము నిజము!"

"ఎవ్వరెవ్వరు ?"

"ఘనానందబాబుగారు నమ్మాయిగారును;"

"వారితో నింక నెవరును లేరా?"

"లేరు."

"కమలనయనబాబనునొక గృహస్థుఁడు వారితోఁ బోయియున్నాఁడని నేనొకరివలన వింటిని!"

"మీకెవ్వరైన నసత్యము చెప్పియుండవలయును. కమలనయనబాబీపొరుగింటనే చాలకాలముండెను. కాని, వారు ఘనానందబాబుగారికంటె ముందే కాశికి వెడలిపోయిరి."

రమేశుఁ డింకను బ్రశ్నించెను. ఆప్రశ్నలవలన నాకమలనయనబాబు కొంతకాలమునకుఁ బూర్వము రంగపురమున డాక్టరుగానుండి యిపుడు మాతృసేవాతత్పరుఁడై తల్లిని దీసికొని కాశీక్షేత్రమున నివసించుచున్నాఁడని తెలియవచ్చెను.

రమేశచంద్రుఁ డొక కొంతతడవూరకుండి" యోగీంద్రుఁడెచటనున్నాఁడు?" అనియెను.

"ఒకసంస్థానాధీశుఁడొక హైస్కూలును స్థాపించియున్నాడు; ఆహైస్కూలునకుఁ బ్రధానోపాధ్యాయత్వము సంపాదించి విష్ణుపురమున నున్నవాఁడు."

రమేశుఁడు వెడలిపోయెను. కొంతతడవున కక్షయకుమారుఁ డట కేతెంచెను ఘనానందబాబు గ్రామమును విడుచునప్పు డక్షయునితో గృహము నప్పుడప్పుడు చూచుచుండుమని చెప్పియుండెను.

అక్షయబాబుం గని రామధనుఁడు "రమేశబాబిప్పుడే యిచ్చటికి వచ్చి వెళ్ళియుండెను," అనియెను.

అక్షయ—ఇక్కడ కేలవచ్చెను?

రామధన—నాకేమియుఁ దెలియదు; బాబుగారెచ్చటను న్నారని నన్నుఁ బ్రశ్నించెను. ఆతఁడు చాల నశక్తుఁడై యున్నాడు. ఆతనిని గుర్తించుటకుఁగూడ కష్టముగనున్నది.

రమేశచంద్రుఁడు తనగృహమున కేగి తనలో నిట్లని తలపోయసాగెను, "ఆహా! ఏమి దైవవిచిత్రలీల! లభించుటయు నెంతటి దైవదుర్విపాక మనవచ్చును! ఇట్టివిషమసంయోగమును ఘటింపఁజేయుట విధాతృవింజోలిన నిరంకుశరచనాధురంధరునకు దుష్కరము కాదుకదా!

విష్ణుపురసంస్థానాధిపతి యోగీంద్రుఁడు నివసించుటకై తన భవనమునకు సమీపముననే యొకగృహము నొసఁగియుండెను. యోగీంద్రుఁ డుదయమున లేచి వార్తాపత్రికఁ జదువుచుఁ గూర్చుండియుండెను. ఆనాఁడు రవివార మగుటచేఁ బాఠశాలకుఁ బోవలసిన పనిలేదు. ఇంతలో నొకమనుజుఁ డేతెంచి యోగీంద్రున కొకజాబు నిచ్చెను. అందివ్విధముగ వ్రాయఁబడియుండెను.

"నేను విష్ణుపురమున నొకదుకాణమున మీసందర్శనము నపేక్షించి కూర్చుండియున్నాను. మీతో నేనొక్కంతసేపు మాటలాడవలసియున్నాఁడను."

"తమ
రమేశుఁడు"

యోగీంద్రుఁడు తటాలునఁ గుర్చీనుండి లేచెను. ఒకప్పు డాతఁడు రమేశుని దూషించి యుండినను, నేఁడు తనచిన్ననాటిచెలి కాని దర్శించుట కతఁ డత్యంతోత్సుకుఁ డయ్యెను. ఆతనిహృదయమున నున్నరమేశచంద్రునిపై ద్వేషము నశించెను. అంతియే కాదు; ఆతనిహృదయమున స్నేహతరంగపరంపర లుద్భవించెను.

యోగీంద్రుఁ డాయుత్తరముం దెచ్చినమనుజుని వెంట వెడలెను. ఒకదుకాణమున రమేశుఁ డాసీనుఁడై యుండెను. యోగీంద్రు డాతనిహస్తమును దనచేతుల ధరించి యిట్లనియెను, "నీవింతకాల మెచటనుంటివి? మరల సందర్శనమే లేదు. మమ్మందఱను సంశయసాగరమున ముంచిపోవుట నీకు మేలని తోఁచెనా? సరే! నేఁడు నీవే నన్ను దర్శింపవచ్చితివి! కాని, యీదుకాణమున నేల? ఇంటికిఁ బోవుదము రమ్ము!"

రమేశుఁ డేమియుఁ బలుకలేదు. మందహాసము చేసెను. మార్గమునఁ బోవుచు యోగీంద్రుఁడు తనకిచ్చవచ్చినట్లు పలుకుచుండెను —"ఇదిగో, రమేశబాబూ! నీవేమైన ననుము! కానున్నదేమో కాకమానదనుటలో సందేహము లేదు. దారిద్ర్యదేవతానివాసస్థానమైనయీపురమున నుండుటకా నన్నుఁ బరమేశ్వరుఁడు సృష్టించి యున్నాఁడు?"

రమేశ—ఏమి? ఊరు బాగుగ నే యున్నదే!

యోగీంద్ర—బాగుగానే యున్నది; కాని—

రమేశ—కానియనుపదమున కర్థము మీపురమువలె జనకో లాహలము లేదనుటయేకదా!

యోగీంద్ర—అదియే! ఇట్టినిర్జనప్రదేశమున నేనుండఁజాలను; ఈపురమున సంతోషముగా మాటలాడుదమన్న నట్టిమనుష్యుఁడొక్కఁడైన లేఁడుకదా!

రమేశ—సంతోషప్రసంగము లటుండనిమ్ము! చిత్తశాంతికై—

యోగీంద్ర—శాంతికిని నాకును, మంటికి మింటికి నున్నంత దూరము! ఈసంస్థానేశునకు నాకును సరిపడుచుండలేదు. నేననుదినము నాతని కింగ్లీషువార్తాపత్రికలు చదివి వినిపింపవలె ననియుఁ బ్రతిదినము నాతని నాశ్రయించి యతనికుశలవార్తల నడుగుచుండవలెననియు నతనియభిప్రాయము. నేను స్వతంత్రవిచారుఁడను. నన్నింతకుఁబూర్వమే యీయుద్యోగమునుండి తొలఁగించియుండును. గాని, యిచటిమేజస్ట్రీటుగారికిని నాకు నత్యంతమైత్రి కలదు. కావున, జమీందారుఁడు నన్నేమియుఁ జేయలేకున్నాఁడు. ఈమేజస్ట్రీటుగారినే నాఁ డీయూరినుండి మార్చెదరో, యానాఁటితో నాకు నీయుద్యోగమునకును ఋణముఁ దీరఁగలదు. నిజముపరికింపఁగా నిందు నాహితచింతకులు లేరు. ద్వేషదృష్టింగనువా రధికసంఖ్యాకులున్నారు.''

ఇవ్విధముగా ముచ్చటలు సాగుచుండెను. భోజనాదులు ముగిసెను; సాయంతనమయ్యెను; అప్పటికిని రమేశుఁ డేమిమాటాడవలసి యోగీంద్రునికడకు వచ్చెనో యామాటలు చెప్పుటకు యోగీంద్రుఁ డవకాశ మీయలేదు. తుదకు సందర్భవశమున ''యోగీంద్రబాబూ! నేను నీతో నేమిచెప్పవలెనని తలఁచి వచ్చితినో నీవెఱిఁ

గిరేయుందువు. ఒకానొకసమయమున మీరు నన్నడిగినప్రశ్నకు త్తరమొసగుటకు నేసమర్థుఁడనై యుంటిని. కాని, నేఁడద్దానిని సవిస్తరముగా నీతోఁ జెప్ప నేతెంచితి" నని యెను.

పిమ్మట రమేచంద్రుఁడు సంపూర్ణముగ నాత్మచరిత్రమును నివేదించెను.

యోగీంద్ర—ఈచరిత్రము నీవు నాతో నాఁడే చెప్పియున్న నాకు నిజమని తోఁచియుండదు.

రమేశ—నేనొక్కటి నిన్నుఁ బ్రార్థించెదను. ఒక్కమాఱు, నాకేయూరఁ బెండ్లియయ్యెనో యాయూరికి నీవు పోయి విచారించి రమ్ము.

• యోగీంద్ర—ఎక్కడకును నేను బోవనక్కఱలేదు. కానక్కఱయును లేదు. ఈకుర్చీపైఁ గూర్చుండియే నీమాటలయందు సంపూర్ణమగువిశ్వాస ముంచెదను. నేనొకనాఁడు నీమాటలయందు విశ్వాసముంచనైతిని. అందులకు నన్ను మన్నింపుము!

ఆచిన్ననాఁటినెచ్చెలు లిరువురును లేచి, యానందముతో నొండొరుల గాఢాలింగన మొనర్చుకొనిరి. రమేశునికంఠము గద్గదికమయ్యెను; అతఁడు మాటలాడుట కతికష్టపడెను. "నేనెట్టివిష మసందర్భమునఁ బడితినో యెవ రెఱుఁగుదురు? కమల యెందుల కాత్మహత్యఁ గావించుకొనెనో నాకిప్పటికిని దెలియలేదు. ఇఁకముందును దెలియుట యశక్యము. మృత్యుదేవత మాతో నెడబాటుఁ గల్పింపకుండినయెడల నిశ్చయముగ మేమిరువురమును బాపకూపమునఁ బడియుందుము. ఆసంగతి తలఁచుకొన్ననిప్పుడును నాహృదయము కంపమెత్తుచున్నది. ఒకప్పు డీసంకటము లన్నియు నాప్రత్యక్షకాలునిముఖముననుండియే కలిగినవి. మరల నాకాలునిమూలముననే యాసంకటములు నశించినవి."

యోగీంద్ర—కమల యాత్మహత్య గావించుకొనెనని నీవు నిశ్చయముగఁ జెప్పలేవు. ఆమె బ్రతికియే యుండవచ్చును. ఎట్లయినగానిమ్ము, మీరు త్వరలోనే ముక్తులయిరి. ప్రస్తుతము నామనసుఁ గమలనయనబాబు విషయమున మునిఁగియున్నది!

అనంతర మొకకొంతఁదడవునకు యోగీంద్రుఁడుఁ గమలనయనబాబు విషయమై యిత్తెఱంగునఁ జెప్పఁదొడంగెను. "ఇదిగో రమేశబాబూ! అట్టిమనుజుని నేను మంచివాఁడని యనను. కాని, లోకులు మౌర్ఖ్యమునకువశులై యట్టివారిని మెచ్చుచుందురుకదా యని యాశ్చర్య మగుచున్నది. ఆ బ్రహ్మజ్ఞాని వెంటఁ దవులుట నళినికి, యోగ్యముకాదు. ఆమె తేనీరుఁ గ్రోలుట మానివేసినప్పుడును, నవమానకరశబ్దముల నాఁడుచు పూర్వమువలెఁ గోపింపక శాంతభావముతో నవ్వునపుడును, నీలక్షణము లేవియు బాగుగనుండలేదని నేనప్పుడే యనుకొంటిని. కాని, నీసహాయసంపత్తిచే నామెనుద్ధరించుట కిప్పటికిని విలంబము కాలేదని నేను నిశ్చయముగ వచింపఁగలను. మన మా సన్యాసికి విరుద్ధప్రయప్న లొనరింతము. రమ్ము" అనియెను.

రమేశ—(నవ్వి) నేను శూరుఁడను గాకపోయినను నీతో వచ్చుట కాయితముగా నున్నాఁడను.

"సరే! శీతకాలపు సెలవులు రానిమ్ము!"

"అందుల కింక నాలస్యమున్నది. నేను ముందేగిన నేమి?"

కాదు; అట్లు జరుగఁగూడదు. మీయిరువురి వివాహమునకు నేనేగదా విఘ్నముఁగల్పించితిని! కావున, మరల నేనే మిమ్ముఁ గలుపవలయును. కాబట్టి నీవు ముందేగి నాకుఁగలుగవలసిన శ్రేయస్సున శతాంశమైననొందుటకు నేనిష్టపడను."

"మంచిది; అంతవఱకు నేను—"

'అది కాదు. ఎనిమిదిపదిదినములవఱకు నీవిచ్చట యుండవలయును. నామిత్రుఁడు లేనిదే నాకిక్కడ నేమియుఁ దోఁచదు. ఇటీవల సాయంసమయములలో నెట్టికఠోరభాషణముల నెన్నిదినములనుండి వినుచున్నాను! ఈకారణమున, నీకర్కశస్వరముసైతము నాకిపుడు వీణానినాదముకన్న నతిమధురముగ భాసించుచున్నది. ఆహా! ఏమినాయీశోచనీ యావస్థ!''

---

## పదునేనవ ప్రకరణము.

### యుక్తి:

రమేశచంద్రబాబు ఘనానందబాబు గృహమునకు వచ్చియుండెనని విని యక్షయకుమారుఁ డత్యంతచింతాసాగరమున మునిగెను, రమేశుఁడు గాజీపురమున వకీలుపని సేయుచున్నానని రామధనునితోఁ జెప్పినసంగతి యక్షయునకు రామధనునివలనఁ దెలిసెను. అతఁడు తనలో విచారింపఁదొడఁగెను, "ఇదేమివిపరీతము! రమేశచంద్రుఁడు గాజీపురమున న్యాయవాదిత్వ మవలంబించి యుండుట యింతకాలమువఱకు నెట్లు రహస్యముగ నుండెను. మఱి యిపుడు వకీలుపని చాలించి యీకొలూటలావీథికి వచ్చునంతటియవస్థ యేలకలిగెను? ఇపుడు కాకున్న మఱెప్పుడైన ఘనానందబాబు కాశీక్షేత్రమున నున్నసంగతి రమేశునకుఁ దెలియకపోదు. తెలిసిన వెంటనే యతఁ డవశ్యముగ వారిని దర్శింప నేగును.''

ఒకటిరెండుదినములలో గాజీపురమున కేగి యట రమేశుని విషయమై కొన్నిసంగతులను గ్రహించి, యటుపిమ్మటఁ గాశీకేగి ఘనానందబాబుగారి దర్శింపవలెనని యక్షయుఁడు నిశ్చయించెను.

ఒకదినమున నక్షయకుమారుఁ డెవ్వరితోడను జెప్పక కలకత్తానుండి పయనమయ్యెను. మార్గశీర్షశుద్ధపూర్ణిమనాఁడు రెండుజాముల కక్షయుఁడు గాజీపురముఁ జేరెను. అచట నూతనముగ న్యాయవాదిత్వ మవలంబించిన రమేశబాబను వంగదేశీయుఁ డెటనున్నాఁ" డని తొలుత నాపట్టణ మంతయు వెదకెను. కాని, యెవ్వరు నాతనికి సంతోషజనకమగు ప్రత్యుత్తర మీయరైరి. కడకొకవకీలతనితో "రమేశబాబు నాయొద్దకు వచ్చియుండెను. వారు కొంతకాలము చక్రవర్తిగారి గృహమున నివసించుచుండిరి. ఇప్పు డాతఁడెందుండునదియు నేనెఱుఁగను. ఆతనిభార్య కొన్నినాళ్ళకుఁబూర్వమే పారిపోయెను. ఒకవేళ నామె గంగాజలమునఁ బడి చచ్చియుండును.' అని చెప్పెను.

అటనుండి కదలి యక్షయకుమారుఁడు చక్రవర్తిగారి మందిరమున కేగెను. ఆతఁడు తనమనసున నిట్లని తలపోసెను;" ఇపుడు రమేశచంద్రుని రహస్యోదంతము లన్నియు బయల్పడఁగలవు! ఆతనిపత్ని మృత్యువువాతఁబడెను. ఇఁక నాతఁడు కాశికేగి తన కెన్నడును బెండ్లియే కాలేదని నళినిని మోసముసేయఁ బ్రయత్నించును. నళినియు నతనియెడ విశ్వాస ముంచఁగలదు. బాహ్యమున, ధర్మిష్ఠులుగను, నీతిమంతులుగను గనిపించువారందఱు నంతరంగమున నెంతయో దుష్టులై యుందురు."

చక్రవర్తిగారిగృహమున కేగి యక్షయుఁడు కమలారమేశుల విషయమై ప్రశ్నింప నాగృహమున నెల్లరు నాక్రందనముసేయఁ దొడఁగిరి. వారినేత్రాంబువు లొకచిన్నయేరై పాఱుచుండెను.

చక్రవర్తి—రమేశచంద్రునకు మీరు స్నేహితులై యుందురు. ఆకారణమున నాకమలను మీరు తోఁబుట్టువు తెఱంగునఁ

గాంచుచుండుట. నాకు నామెకు బహుస్వల్పదినముల పరిచయమే! కాని, యింతయల్పావకాశముననే యామె నాకుఁగుమారితవలెఁ బ్రవర్తింపసాగెను. ఏమి సేయఁగలము? రెండుదినములు ప్రేమునఁగలిచి యనురాగముఁ బుట్టించి యివ్విధముగా మాహృదయమునకు శాశ్వతమగు వేదనఁ గల్పించి యామె పారిపోవునని నేనెప్పుడు ననుకొనలేదు.

అత్తయ—(ఉదాసీనముగ) ఇంతటికష్టమేల కలిగెనో నాకుఁ దోఁచుటలేదు. ఒకవేళ రమేశబాబు కమలను దగురీతి నేలుచుండలేదని నాకుఁ దోఁచుచున్నది.

చక్రవర్తి—మీరేమనుకొందురో గాని, మీరమేశచంద్రు నిస్వభావము నెఱుంగుసామర్థ్యము నాయెడల లేదు. అతఁడు సజ్జనునివలెనే పైకిఁ గన్పించుచున్నాఁడు. కాని, యాతనిమనమున నేటి యాలోచన లుండుటయు, నాతఁడేమిచేయుచుండుటయు నేమి తెలిసికొనుచుండుటయు—నేనెఱుఁగ లేకపోయితిని. కమలవంటిసచ్ఛీలయగు పత్ని నేమని యాతఁ డనాదరణ మొనరించుచుండెనో, యింతవఱకును నాకుఁ దెలియలేదు. కమలంబోలితి దాసతీలక్ష్మి! అహాహా! నాపుత్రికకును గమలకును గాఢమైత్రి కలదు. ఒకనాఁడైన నాకమల తనచెలితోనైనఁ బతివిషయమున విరుద్ధముగుపలుకొన్నడు నాడియెఱుఁగదు. నాపుత్రికమాత్రము కమల దుఃఖస్వాంతయై యున్నదని తలఁచియుండెను; కాని, తుదవఱకు నొక్కమాటయుఁ గనుల వచింపనేలేదు. దుఃఖ మసహ్యమైనప్పుడు పాపమామె యేమిచేయఁగలదు? ఆమాట జ్ఞప్తికివచ్చిన దుఃఖమునిండి పొట్టను జించివేయుచున్నది! నేనభాగ్యుడను! జేనలహాబాదున కేగుచున్నచో నామె ప్రాణత్యాగము చేసికొనకయే యుండును.

మఱునాఁ డుదయమున నక్షయకుమారుఁడు చక్రవర్తి ద్వితీయుఁడై రమేశబాబుగృహమును జూచుటకై గంగాతటమున కేగెను. మరల నింటికివచ్చినపిదప నక్షయకుమారుఁడు చక్రవర్తితోఁ "చక్రవర్తిజీ! కమల గంగాజలమునఁ బడి మరణించెనని మీకుఁ దోఁచుచున్నది; కాని, నాకట్లు తోఁచుటలేదు." అనియెను.

"మీయభిప్రాయ మెట్లున్నది?"

"ఆమె గృహమును వీడి యెచటికైనఁ బోయియుండవలెనని నాకుఁదోఁచుచున్నది. ఆమెను జక్కఁగ శోధించుటయే మనకుఁ గర్తవ్యము."

"మీరనునట్టులుకూడ నయియుండవచ్చును."

"ఇటకుఁ గాశీనగర మతిదూరము కాదుకదా! అట నామిత్రులొకరున్నారు. కమల యొకవేళ వారికడ కేగియుండచ్చును."

రమేశబాబీసంగతి యెన్నడును నాతోఁ జెప్పలేదు. చెప్పియున్నచో నేనిట్లు కూర్చుండియుందునా?" అని చక్రవర్తియాశాపూర్వకస్వరమునఁ బలికెను.

"మంచిది. మనమిరువురముం గూడి కాశికేగుదము. మీరా దేశమునకు జక్కఁగ నెఱిఁగియుందురు. అటఁగమలజాడ తెలిసిన నుత్తమమే!"

చక్రవర్తి మహాసంతోషముతో నక్షయకుమారునియుక్తుల కంగీకరించెను. నళిని, సహజముగనే తనపై విశ్వాసముంచదని యక్షయుఁ డెఱిఁగియే యుండెను. కావున, సాక్ష్య మొసఁగుటకై చక్రవర్తిగారిని వెంటఁబెట్టుకొని, కాశీక్షేత్రమున కక్షయుఁడు పయనమయ్యెను.

---

## పదునారవ ప్రకరణము.

### కళ్యాణీబాయి.

నగరబాహ్యప్రదేశమున నొకబంగాళా బాడుగకుఁ గొని కాశిలో ఘనానందబాబు నివసించుచుండెను.

కాశికేగినవెంటనే, కమలనయనబాబుజనని కల్యాణీబాయి యింకను స్వస్థ కాలేదని వారికి దెలియవచ్చెను. దేహమున జ్వరముండఁగనే ప్రాతస్నానము చేయుచుండినందున నామెశరీర మధికవ్యాధిగ్రస్త మయ్యెను. నళిని యెల్లప్పుడును గల్యాణీబాయి స్నేహశుశ్రూష సేయుటలోఁ దత్పరయైయుండెను. ఆమెయవిశ్రాంత పరిశ్రమమూలమునఁ గల్యాణీబాయి మెల్లమెల్లఁగ బాగగుచువచ్చెను. నియతధర్మములయెడ నామెకుఁ బరిపూర్ణ లక్ష్యముండెను. ఆమె స్వయముగానే వండుకొనుచుండెను. ఇటీవలనామె వ్యాధిపీడితయగుటచేఁ గమలనయనబా బామెకుఁ బథ్యమునకు వలసిన వానిఁ బాక మొనరించుచుండెను. కల్యాణీబాయి "నన్నీశ్వరుఁ డింకను గొనిపోవఁడేమో తెలియదు. అందఱిని గష్టపెట్టుటకే నాకు దీర్ఘాయువొసంగి యుండవచ్చును. అటుగాకున్నమఱేమి ?" అని యెప్పుడు ననుచుండును.

కల్యాణీబాయి యెప్పుడును బరిశుభ్రముగా నుండుటయేగాక, యితరు లెవరైన నపరిశుద్ధవస్త్రములతో నుండిన నామె చూడనే లేదు. నళిని యీవృత్తాంతమును గమలనయనునివలన వినియుండెను. కావున, నామె స్నానముసేయుటకుఁ బూర్వమెన్నడును గల్యాణీబాయి గృహమున కేగదు. ఆమె శయ్య నతి పరిశుభ్రముగా నుంచును; అనుదినము నళిని పుష్పములను గోసి కల్యాణీబాయి పడక చెంతఁ బెట్టును.

కమలనయనబాబు మాతృసేవకై యొకదాసిని నియమింప నెన్నియోతడవలాలోచించెను; కాని, కల్యాణీబాయందుల కీయకొన లేదు. అట్లు దాసి నుంచుట వ్యర్థవ్యయమునకుఁ గారణ మనియు, రెండవది, తన యిచ్ఛాప్రకారముగా శుభ్రముగ గృహకృత్యముల నొనరించునట్టిదాసి లభింపదనియు నామె యనుచుండెను.

కల్యాణీబాయి స్వభావ మతికోమలము. ఆమెకుఁ బసిపిల్లల యెడ నతిప్రేమ. బాలురగపడినచో వారికి నామె మిఠాయి మొదలగు తినువస్తువుల నిచ్చుచుండును. అందుచే నిరుగుపొరుగిండ్ల బాలురందఱు నెల్లప్పుడు నామె గృహముకడ నాడుచుఁ దిరుగుచుందురు. ఆమె యేచక్కనివస్తువుం జూచినను గొనుటకాతురయై యుండును. ఈ సుందరవస్తువులన్నియు నాకోడలి కుపయుక్తములు గాఁగలవని యామె చెప్పుచుండును. ఆమె తనకోడ లెంతసౌందర్యవతియైయుండవలెనో యని మనసునఁ గల్పించుకొనియుండెను. ఆమె కనులు మూసెనా, తన సుందరస్నుష గృహమునకు వచ్చినట్లును, ఆమె సౌందర్యరశ్మిచే గృహమంతయు బ్రకాశమానమయినట్లును, తాను తన కోడలిని వస్త్రాలంకార విభూషితురాలిగాఁ జేయుచున్నట్లును భావించుకొనుచుండును. ఈభావనచే నొక్కొక్కప్పు డామెశరీర మానందపులకిత మగుచుండెను. ఆమె యొక తపస్విని తెఱంగునఁ గఠినమగు నాచారమును బాలించుచుండెను. పగటివేళఁ జాలభాగ మామె దేవపూజలయందును, స్తోత్రపఠనములయందును గడపును దినమున కొకపూటయే స్వల్పభోజనము సేయును. కాని, కమలనయనబాబు నాచార మంతగ నామెకు సగిపడుచుండలేదు. పురుషు లెల్లప్పుడును దేశసంచారము సేయుచుందురు. కావున, నిట్టికఠినవ్రతాచరణము జరుగదని యామె నొక్కి పలుకుచుండును.

రోశము క్షయమైనపిదపఁ, గమలనయనునుపదేశము ననుసరించి

నళిని యనేక కఠిన వ్రతము లాచరించుచున్న సంగతి. కల్యాణీబాయికిఁ దెలియవచ్చెను. అంతియేకాదు; ఘనానందబాబు సైతము కమలనయనునుపదేశముల మనఃపూర్వకముగ వినుచున్నారనియు నామెకుఁ దెలిసెను. కళ్యాణీబాయి యొకనాఁడు నవ్వుచు నళినితో నిట్లు సంభాషించెను—"బిడ్డా! నీవేమిచేయుచున్నావు? నీవీకృత్యములవలనఁ గమలనయనుని వెఱ్ఱివానిగాఁ జేయుచున్నావు! నీవీప్రాయమున నవ్వుచు నాడుచు, సంసార సుఖోపభోగములయందుఁగదా గడపవలసినది! ఈనియమధర్మములకేగి చిన్ననాఁటఁగోలె నాకభ్యాసమగుటచే నేనీకఠినవ్రతాచరణముఁ గైకొంటిని. అదియేగాక! ధర్మకార్యములఁ దృణీకరించి యీప్రాయమున నేనేమిచేయుదును? నీకట్లుకాదు. చిన్ననాఁటినుండియు నీవు వేఱురీతినిఁ బెరిగితివి. ఇప్పటికి నాతీరుననే వర్తింపుము. నీవలన నిట్టికఠినవ్రతాచరణము కాఁజాలదు. కమలనయనుఁడును గొంతకాలమునకుఁబూర్వము నిరంకుశరీతిని వర్తించుచుండెను. నన్ను సంతసపఱచుటకై వాఁడిట్టి ధర్మాచరణాడంబరము మొదలిడినాఁడు. కాని, కొన్నినాళ్ళలోనే వాఁడు నిశ్చయమగుసన్యాసియగునని నాకిపుడు తోఁచుచున్నది. నేనెన్నిపర్యాయములో వానికి బోధించితిని. నీవెప్పటివలెనే వర్తింపుము; నేనునీయెడ నలుకహింప ననియుంటిని. కాని, వాఁడేమియుబదులాడఁడు; నవ్వి యూరకుండును. వానిస్వభావమే యిట్టిది."

మూఁడవజామున నామె నళినికి జడవేయుచుండఁగా నీక్రింది ప్రసంగము జరిగెను. జడలల్లుటలోఁ గల్యాణీబాయి కత్యంతప్రావీణ్యము కలదు.

"నేనెన్నియోవిధముల జడలల్లఁగలను. నేనల్లిన ట్లితరు లల్లజాలరు. నాకొకయూరోపియనుస్త్రీతో స్నేహముండెను. ఆమెదగ్గఱ కుట్టుపనులు నేర్చుకొంటిని, అనేకవిధములైన జడలు వేయుటయు

నామెయే నాకు నేర్పెను. కాని, యామె విడిచిపోయిన వెంటనే నేను స్నానముచేసి పాతికొక వస్త్రమును ధరించుచుండెడిదానను. ఇటు లేటికిఁ జేయుచుంటినో నేఁ జెప్పఁజాలను. ఈయాచారధర్మ మతి కఠినము. అట్లుండియు దానిని పాలింపకుండ నేనుండలేను. ఇందునకే మిమ్మెవరిని నాభోజనపదార్థములను ముట్టనీయను. ఇట్లుచేయుటచే మిమ్మవమానపఱచుచుంటినని తలఁపవలదు. పూర్వమునుండియు నున్నయభ్యాస మిప్పుడు వదలునట్లు? వదలుటకు శక్యమా! నాకమలనయనుని వర్తనము పూర్వము వేఱురీతిగానున్నప్పు డోపికతో నోర్చుకొనుచుంటిని. అప్పుడు వాఁడు నన్నుఁ గూర్చి "ఈమె ధర్మకర్మాదికముల వెంటఁ దవిలినయొక మూర్ఖస్త్రీ" యని యనుచుండును. మీకేనిమంచిదనితోఁచునో దాని నాచరింపుఁడు! కాని, యింతకాలమునుండియుఁ బాలించుచున్న యీవ్రతములను నేను మానలేను." ఈతుదిపలుకు లాడునప్పు డామె చీరచెఱఁగుచేఁ దన నేత్రాంబువులను దుడుచుకొనియెను;

ఆమెకు నళినిపైనున్న యనురాగము దినదినప్రవర్ధమానమగుచుండెను. ఆమె తనపేటికనుండి యమూల్యవస్త్రములఁ దీసి నళినికి స్వహస్తములతోఁ గట్టుచుండును. ఒక్కొకదినమున నొక్కొక విధముగఁ గట్టుపని నళినికి నేర్పుచుండును.

నళిని తనపుస్తకములలో వంగభాషాపుస్తకములఁ గొన్నిఁటిని గాళ్యాణీబాయి కిచ్చియుండెను. ఒక్కొకపుస్తకము నందలివిషయముపైనను, పుస్తకముపైనను దనకు గలిగిన యభిప్రాయమును గళ్యాణీబాయి వ్యక్తపరచుచుండ విని నళిని మిగుల నాశ్చర్యపడుచుండును. ఆంగ్లేయవిద్యాభ్యాసము సేయకున్నను నింతటి సూక్ష్మజ్ఞాన ముండుననుమాట నళినికిఁ దెలిసియుండలేదు. కళ్యాణీబాయిపలుకులన్నియు విని యామె యొక యద్వితీయస్త్రీయని నళిని భావించుచుండును.

---

## పదునేడవ ప్రకరణము.

---

### మరల వివాహ ప్రయత్నము.

కళ్యాణీబాయికి మరల జ్వరమువచ్చెను; కాని, యీమాఱు జ్వరము చాలకాల ముండలేదు. కమలనయనుఁ డుదయముననే స్నానముచేసి "అమ్మా! నీవింకను కొన్నిదినములు రోగులవలెనే వర్తింపవలెను. మీశరీర మత్యంతము నశక్తమై యున్నది. ఇట్టిస్థితిలో నింతటికఠినవ్రతముల నాచరింపలేవు!" అనియెను.

"నేను రోగులవలెఁ బ్రవర్తింపవలయునా? నేనింకనీ యాటలు సాగనీయను. సాధ్యమగునంత త్వరలో నీవు పెండ్లియాడవలయునని నేనాజ్ఞాపించుచున్నాను."

కమలనయనుఁ డూరకుండెను.

కళ్యాణీబాయి—ఇదిగో, కమలనయనా! నేనింక దీర్ఘకాలము బ్రదుకుదునని నాకుఁ దోఁచుటలేదు. నీవు సౌఖ్యముగ సంసారమునడపుచుండుటఁజూచి నేనానందముతోఁ బ్రాణము విడుతును; నాయింటి కెప్పుడు చిన్నకోడలేతెంచునా, యెప్పుడామెకు నేర్పవలసినదంతయు నేర్పి జ్ఞానవంతురాలిని జేయుదునా, యని చాలకాలమునుండియు నేనాశించుచుంటిని. కాని, యిప్పటివ్యాధివలన నేనుక్షీణించితిని. దేహమున బలముతగ్గెను. ఇపుడు నావిషయమై నాకే నమ్మకములేదు! నేఁడున్నాను; రేపుందునో లేదో! ఇట్టియవస్థలో నల్పవయస్కురాలగు నొకబాలికను నీమెడకంటఁగట్టుట నాకిష్టములేదు. కావున, నీవువచ్చినదొక కన్నియను బెండ్లిచేయవలయునని నాకోరిక. ఇతరములగు నాకోరికలన్నియు నీడేరినవి. కాని, నీవధువు నుగనులారఁజూచు నాసమాత్రము నామనమున గాఢముగ నాఁటి

యహోరాత్రములు బాధించుచున్నది. ఎంతవఱకు నాయీకోరిక సఫలము కాఁజాలదో, యంతవఱకు నాప్రాణములు సుఖమరణము నందఁజాలవు.

కమలనయన—మనయిరువుర కనుకూలముగనుండు వధు నెట నుండివచ్చును?

కల్యాణీబాయి—అవన్నియు నేఁజూచుకొందును. ఆవిషయమై నీవాలోచింప నక్కఱలేదు.

ఆనాఁటిసాయంకాలము ఘనానందబా బెచటికోపోయియుండి కల్యాణీబాయి గృహమున కేతెంచెను అప్పుడు కల్యాణీబాయి ఘనానందునితో నిట్లనియెను.

"ఘనానందబాబూ! మీపిల్లసచ్చీల. ఆమెయెడల నాకుమిక్కిలిప్రేమకలదు. మాకమలనయనుని మీరెఱిఁగియే యున్నారుకద్గా! ఆతనిలో నేవైగుణ్యమును లేదు. వైద్యమునసైత మాతఁడు సద్యశమునుగణించియున్నవాఁడు. ఇట్టివరుఁడు మీకెందును లభింపఁడు."

ఘనానంద—(ఇల్లాసముతో) ఈవిషయమై యూసవహించుటకు సైతము నాకు సాహసము కలుగదు. కమలనయనునితో నాకుమారితకుఁ బెండ్లియైనచో నంతకన్న గావలసిన సౌభాగ్య మేమున్నది? కాని, యాతఁడిందులకు—

కల్యాణీబాయి—వాఁడిందున కంగీకరింపకుండఁడు వాఁడీనాఁటిబాలురవలె స్వేచ్ఛానుసార వర్తనుఁడుకాఁడు. నేనెటునేయుమన నటులేయును. అంతియేకాక, మీకన్నియను మెచ్చనివా రీజగమున నెవ్వరునుండరు, ఇట్టివీరివివాహము త్వరలోనే జరిపివేయవలెనని నామనోభిప్రాయము ఎందులకన, నాశరీరస్థితి బాగుగాలేదు. ఏగడియలో నేనీజగమును వీడిపోవలసివచ్చునో చెప్పజాలను.

ఆనాఁటిరేయి ఘనానందబాబు ప్రసన్నచిత్తముతో గృహ

మునకు మరలివచ్చెను. తత్క్షణమే యతఁడు నళినిబిలిచి, "బిడ్డా! నేను వృద్ధుఁడనైతిని. నాశరీరబల మానాఁటికానాఁడు క్షీణించుచున్నది. నీవివాహమునకుఁ బూర్వమే నాకు మృత్యుదేవతామంత్రణము వచ్చినచో నాయాత్మకు శాంతి లభింపఁజాలదు. కావున, నీ వేమియు ననుమానింపక, సంకోచముంపక నాప్రశ్న కుత్తరమిమ్ము. నీకుఁ దండ్రినైనను దల్లినైనను నేనేకదా! నీకష్టసుఖములభారమంతయు నామీఁదనేయున్నది!" అనియెను.

నళిని యుత్కంఠితయై తండ్రిముఖమువంకఁ గాంచుచుండెను. ఘనానందబాబు మరలఁ బలుకసాగెను——

"నీవివాహసంబంధమై విచిత్రప్రకరణము లుద్భవించినవి కదా! షానిమూలమున నాహృదయమున కెప్పుడును సంతోషము కలుగుటకు వీలులేదు. మరల నీసందర్భమున విఘ్నముతటస్థింపకుండుఁగాక!" యని నాయభీష్టము. నేఁడు కళ్యాణిబాయి తానుగనే వచ్చి కమలనయనబాబునకు నిన్నిచ్చి పెండ్లిచేయువిషయమున సంభాషించినది.

నళిని——(లజ్జతోఁదలవంచి) ఛీ! ఛీ! ఇట్టిదెన్నఁడును జరుగనేరదు.

కమలనయనబాబు వివాహమాడుట యసంభవమని యామెకుఁ దోఁచెను. "ఇట్టిమహాత్ము లెం డైన వివాహమాడుదురా?"

ఘనానంద——ఏటికిఁ బెండ్లియాడరు?

నళిని——అసంభవము! కమలనయనబా బెట్టివృత్తినవలంబించిన సత్పురుషుఁడో మీరాలోచించిచూడుఁడు!"

"అతఁ డవివాహితుఁడేకదా?"

నళిని యింక నచట నుండఁజాలకపోయెను. ఆమె తటాలున లేచి వెడలిపోయెను. ఘనానందబాబు విచారసాగరమున మునిఁగెను.

ఆమె యిట్లొనర్చునని యతఁ డనుకొనలేదు. కమలనయమునని పేరెత్తినంతటనే యామె ప్రసన్నురాలగునని యతఁడనుకొనియుండెను. అతఁ డుదాసీనుఁడై సామదానప్రయత్నములు సేయనెంచి, స్త్రీలయవిచారమనోవృత్తివిషయమై తనలోఁ జర్చించుచుఁ గూర్చుండెను.

నళిని చాలసేపటివఱకు బయటనే నిలుచుండి, యొక్కమాఱు తండ్రియున్నస్థలమును వెనుకకుమరలి చూచెను. తండ్రిచింతాధీన స్వరూపమును గాంచినంతనే యామెకు దుఃఖము కలిగెను. తక్షణ మామె యతనిచెంతకరిగి "నాన్నా! లెండు; పళ్లెరమున వడ్డించి చాలసేపైనది; భోజనపదార్థములు చల్లాఱిపోవుచున్నవి" అనియెను.

ఘనానందబాబు భోజనముసేయుట కింటిలోనికిఁ బోయెను. కాని, నేఁడాతఁ డెప్పటివలె భోజనముసేయలేదు. నళినీవివాహసంబంధమగుప్రస్తావనమున నాతనిమన సానందమయమైయుండెను గాని, నళినీభాషణములువినుటచే నాయాశ భంగమయ్యెను. అతఁడు హతాశుఁడయ్యెను. నళినివిషయమై యాలోచించుచుండ నతనికి రమేశుఁడు జ్ఞప్తికివచ్చెను. "ఇంకను నళిని యతనినిమఱవలేదా?" యనుప్రశ్న మాకస్మికముగా నతనిహృదయమున నుద్భవించెను.

పూర్వ మెప్పుడును భోజనమొనరించినవెంటనే ఘనానంద బాబు విశ్రమించుచుండును. కాని, నేఁడాతఁడు శయనమందిరమున కేగలేదు. గృహమున కీవలిపార్శ్వమున నొకకుర్చీపైఁ బరుండి మనసున నాలోచించుచు, నెదుటనున్నవృక్షపంక్తులఁ గాంచుచుండెను. చింతాపూర్ణమగు నాతనిముఖమునీక్షించి నళిని మెల్లమెల్లగ సమీపించి, చిఱునగవుతో "బాబా! ఇచట చలిగాలి వీచుచున్నది. లోనికరుగుఁడు?" అనియెను.

"నీవుపొమ్ము. కొంచెమునేపుండి నేనును వచ్చెదను."

## పదునారవ ప్రకరణము.

### కళ్యాణీబాయి.

నగరబాహ్యప్రదేశమున నొకబంగాళా బాడుగకుఁ గొని కాశిలో ఘనానందబాబు నివసించుచుండెను.

కాశి కేగినవెంటనే, కమలనయనబాబుజనని కల్యాణీబాయి యింతను స్వస్థ కాలేదని వారికిఁ దెలియవచ్చెను. దేహమున జ్వరముండఁగనే ప్రాతస్స్నానము చేయుచుండినందున నామె శరీర మధికవ్యాధిగ్రస్త మయ్యెను. నళిని యెల్లప్పుడును గల్యాణీబాయి స్నేహశుశ్రూష సేయుటలోఁ దత్పరయైయుండెను. ఆమెయవిశ్రాంత పరిశ్రమమూలమునఁ గల్యాణీబాయి మెల్లమెల్లఁగ బాగగుచువచ్చెను. నియతధర్మములమీఁద నామెకుఁ బరిపూర్ణ లక్ష్యముండెను. ఆమె స్వయముగానే వండుకొనుచుండెను. ఇటీవల నామె వ్యాధిపీడితయగుటచేఁ గమలనయనబాబామెకుఁ బథ్యమునకు వలసిన వానిఁ బాకమొనరించుచుండెను. కల్యాణీబాయి "నన్నీశ్వరుఁడింకను గొనిపోవఁడేమో తెలియదు. అందఱిని గష్టపెట్టుటకే నాకు దీర్ఘాయువొసంగి యుండవచ్చును. అటుగాకున్న మఱేమి?" అని యెప్పుడు ననుచుండును.

కల్యాణీబాయి యెప్పుడును బరిశుభ్రముగా నుండుటయేగాక, యితరు లెవరైన నపరిశుద్ధవస్త్రములతో నుండిన నామె చూడనే లేదు. నళిని యీవృత్తాంతమును గమలనయనునివలన వినియుండెను. కావున, నామె స్నానముసేయుటకుఁ బూర్వమెన్నడును గల్యాణీబాయి గృహమున కేగదు. ఆమె శయ్య నతి పరిశుభ్రముగా నుంచును; అనుదినము నళిని పుష్పములను గోసి కల్యాణీబాయి పడకచెంతఁ బెట్టును.

కమలనయనబాబు మాతృసేవకై యొకదాసిని నియమింప నెన్నియోతడవలాలోచించెను; కాని, కల్యాణీబాయందుల కీయకొన లేదు. అట్లు దాసి నుంచుట వ్యర్థవ్యయమునకుఁ గారణ మనియు, రెండవది, తన యిచ్ఛాప్రకారముగా శుభ్రముగ గృహకృత్యముల నొనరించునట్టిదాసి లభింపదనియు నామె యనుచుండెను.

కల్యాణీబాయి స్వభావ మతికోమలము. ఆమెకుఁ బసిపిల్లల యెడ నతిప్రేమ. బాలురగపడినచో వారికి నామె మిఠాయి మొదలగు తినువస్తువుల నిచ్చుచుండును. అందుచే నిరుగుపొరుగిండ్ల బాలురందఱు నెల్లప్పుడు నామె గృహముకడ నాడుచుఁ దిరుగుచుందురు. ఆమె యేచక్కనివస్తువుం జూచినను గొనుటకాతురయై యుండును. ఈ సుందరవస్తువులన్నియు నాకోడలి కుపయుక్తములు కాఁగలవని యామె చెప్పుచుండును. ఆమె తనకోడ లెంతసౌందర్యవతియైయుండవలెనో యని మనసునఁ గల్పించుకొనియుండెను. ఆమె కనులు మూసెనా, తన సుందరస్నుష గృహమునకు వచ్చినట్లును, ఆమె సౌందర్యరశ్మిచే గృహమంతయు బ్రకాశమానమయినట్లును, తాను తన కోడలిని వస్త్రాలంకార విభూషితురాలిగాఁ జేయుచున్నట్లును భావించుకొనుచుండును. ఈభావనచే నొక్కొక్కప్పు డామెశరీర మానందపులకిత మగుచుండెను. ఆమె యొక తపస్విని తెలుఁగునఁ గఠినమగు నాచారమును బాలించుచుండెను. పగటివేళఁ జాలభాగ మామె దేవపూజలయందును, స్తోత్రపఠనములయందును గడపును దినమున నొకపూటయే స్వల్పభోజనము సేయును. కాని, కమలనయనబాబు నాచార మంతగ నామెకు సగిపకుచుండలేదు. పురుషు లెల్లప్పుడును దేశసంచారము సేయుచుందురు. కావున, నిట్టికఠినవ్రతాచరణము జరుగదని యామె నొక్కి పలుకుచుండును.

రోకము క్తమైనపిదపఁ, గమలనయనునుపదేశము ననుసరించి

నళిని యనేక కఠిన వ్రతము లొనరించుచున్న సంగతి. కల్యాణీబాయికిఁ దెలియవచ్చెను. అంతియే కాదు; ఘనానందబాబు సైతము కమలనయనునుపదేశముల మనఃపూర్వకముగ వినుచున్నారనియు నామెకుఁ దెలిసెను. కళ్యాణీబాయి యొకనాఁడు నవ్వుచు నళినితో నిట్లు సంభాషించెను—"బిడ్డా! నీవేమిచేయుచున్నావు? నీవీకృత్యములవలనఁ గమలనయనుని వెఱ్ఱివానిగాఁ జేయుచున్నావు! నీవీప్రాయమున నవ్వుచు నాఁడుచు, సంసార సుఖోపభోగములయందుఁగదా గడపవలసినది! ఈనియమధర్మముల కేగి చిన్ననాఁటఁగోలె నాకభ్యాసమగుటచే నేనీకఠినవ్రతాచరణముఁ గైకొంటిని. అదియేగాక! ధర్మకార్యములఁ దృణీకరించి యీప్రాయమున నేనేమిచేయుదును? నీకట్లుకాదు. చిన్ననాఁటినుండియు నీవు వేఱురీతినిఁ బెరిగితివి. ఇప్పటికి నాతీరుననే వర్తింపుము. నీవలన నిట్టికఠినవ్రతాచరణము కాఁజాలదు. కమలనయనుఁడును గొంతకాలమునకుఁబూర్వము నిరంకుశరీతిని వర్తించుచుండెను. నన్ను సంతసపఱచుటకై వాఁడిట్టి ధర్మాచరణాడంబరము మొదలిడినాఁడు. కాని, కొన్నినాళ్ళలోనే వాఁడు నిశ్చయముగసన్యాసియగునని నాకిపుడు తోఁచుచున్నది. నేనెన్నిపర్యాయములో వానికి బోధించితిని. నీవెప్పటివలెనే వర్తింపుము; నేనునీయెడ నలుకవహింప ననియుంటిని. కాని, వాఁడేమియుబదులాడఁడు; నవ్వి యూరకుండును. వానిస్వభావమే యిట్టిది."

మూఁడవజామున నామె నళినికి జడవేయుచుండఁగా నీక్రిందిప్రసంగము జరిగెను. జడలల్లుటలోఁ గల్యాణీబాయి కత్యంతప్రావీణ్యము కలదు.

"నేనెన్నియోవిధముల జడలల్లఁగలను. నేనల్లిన ట్లితరు లల్లజాలరు. నాకొకయూరోపియనుస్త్రీతో స్నేహముండెను. ఆమెదగ్గఱ కుట్టుపనులు నేర్చుకొంటిని. అనేకవిధములైన జడలు వేయుటయు

నామెయే నాకు నేర్పెను. కాని, యామె విడలిపోయిన వెంటనే
నేను స్నానముచేసి మఱియొక వస్త్రమును ధరించుచుండెడిదానను.
ఇటు లేటికిఁ జేయుచుంటినో నేఁజెప్పఁజాలను. ఈయాచారధర్మ మతి
కఠినము. అట్లుండియు దానిని బాలింపకుండ నేనుండలేను. ఇందు
నకే మిమ్మెవరిని నాభోజనపదార్థములను ముట్టనీయను. ఇట్లుచేయు
టచే మిమ్మవమానపఱచుచున్నానని తలఁపవలదు. పూర్వమునుండి
యు నున్నయభ్యాస మిప్పుడు వదలునెట్లు! వదలుటకు శక్యమా?
నాకమలనయనుని వర్తనము పూర్వము వేఱురీతిగానున్నప్పు డోపిక
తో నోర్చుకొనుచుంటిని. అప్పుడు వాఁడు నన్నుఁగూర్చి ''ఈమె
ధర్మకర్మాదికముల వెంటఁ దవిలినయొక మూర్ఖస్త్రీ'' యని యను
చుండును. మీకేదిమంచిదనితోఁచునో దాని నాచరింపుఁడు! కాని,
యింతకాలమునుండియుఁ బాలించుచున్న యీవ్రతములను . నేను
మానలేను.'' ఈతుదిపలుకు లాడునప్పు డామె చీరచెఱఁగుచేఁ దన
నేత్రాంబువులను దుడుచుకొనియెను;

ఆమెకు నళినిపైనున్న యనురాగము దినదినప్రవర్ధమాన
మగుచుండెను. ఆమె తనపేటికనుండి యమూల్యవస్త్రములఁ దీసి నళి
నికి స్వహస్తములతోఁ గట్టుచుండును. ఒక్కొకదినమున నొక్కొక
విధమగుఁ గట్టుపని నళినికి నేర్పుచుండును.

నళిని తనపుస్తకములలో వంగభాషాపుస్తకములఁ గొన్నిఁటిని
గాళ్యాణీబాయి కిచ్చియుండెను. ఒక్కొకపుస్తకము నందలివిష
యముపైనను, బుస్తకముపైనను దనకు గలిగిన యభిప్రాయమును
గళ్యాణీబాయి వ్యక్తపరచుచుండ విని నళిని మిగుల నాశ్చర్య
పడుచుండును. ఆంగ్లేయవిద్యాభ్యాసముసేయకున్నను నింతటి సూక్ష్మ
జ్ఞాన ముండుననుమాట నళినికిఁ దెలిసియుండలేదు. కళ్యాణీ
బాయిపలుకులన్నియు విని యామె యొక్క యద్వితీయస్త్రీయని నళిని
భావించుచుండును.

---

## పదునేడవ ప్రకరణము.

### మరల వివాహ ప్రయత్నము.

కళ్యాణీబాయికి మరల జ్వరమువచ్చెను; కాని, యీమాటు జ్వరము చాలకాల ముండలేదు. కమలనయనుఁ డుదయముననే స్నానముచేసి "అమ్మా! నీవింకను గొన్నిదినములు రోగులవలెనే వర్తింపవలెను. మీశరీర మత్యంతము నశక్తమై యున్నది. ఇట్టిస్థితిలో నింతటికఠినవ్రతముల నాచరింపలేవు!" అనియెను.

"నేను రోగులవలెఁ బ్రవర్తింపవలయునా? నేనిఁకనీయాటలు సాగనీయను. సాధ్యమగునంత త్వరలో నీవు పెండ్లియాడవలయునని నేనాజ్ఞాపించుచున్నాను."

కమలనయనుఁ డూరకుండెను.

కళ్యాణీబాయి—ఇదిగో, కమలనయనా! నేనిఁక దీర్ఘకాలము బ్రదుకుదునని నాకుఁ దోఁచుటలేదు. నీవు సౌఖ్యముగ సంసారము నడపుచుండుటఁజూచి నేనానందముతోఁ బ్రాణము విడుతును; నాయింటి కెప్పుడు చిన్నకోడలే తెంచునా, యెప్పుడామెకు నేర్పవలసినదంతయు నేర్పి జ్ఞానవంతురాలిని జేయుదునా, యని చాలకాలమునుండియు నేనాశించుచుంటిని. కాని, యిప్పటివ్యాధివలన నేనుక్షీణించితిని. దేహమున బలముతగ్గెను. ఇపుడు నావిషయమై నాకే నమ్మకములేదు! నేఁడున్నాను; రేపుందునో లేదో! ఇట్టియవస్థలో నల్పవయస్కురాలగు నొకబాలికను నీమెడకంటఁగట్టుట నాకిష్టము లేదు. కావున, నీవువచ్చినదియొక కన్నియను బెండ్లిచేయవలయునని నాకోరిక. ఇతరములగు నాకోరికలన్నియు నీడేరినవి. కాని, నీవధువు నుగనులారఁజూచు నాసమాత్రము నామనసున గాఢముగ నాఁటి

యహోరాత్రములు బాధించుచున్నది. ఎంతవఱకు నాయీకోరిక సఫలము కాఁజాలదో, యంతవఱకు నాప్రాణములు సుఖమరణము నందఁజాలవు.

కమలనయన—మనయిరువుర కనుకూలముగనుండు వధు వెట నుండివచ్చును?

కల్యాణీబాయి—అవస్థయు నేఁజూచుకొందును. ఆవిషయమై నీవాలోచింప నక్కఱలేదు.

ఆనాఁటిసాయంకాలము ఘనానందబాబు చెచటికోపోయియుండి కల్యాణీబాయి గృహమున కేతెంచెను అప్పుడు కల్యాణీబాయి ఘనానదునితో నిట్లనియెను.

"ఘనానందబాబూ? మీపిల్లనచ్చీల. ఆమెయెడల నాకుమిక్కిలిప్రేమకలదు. మాకమలనయనుని మీరెఱిఁగియే యున్నారుకదా! ఆతనిలో నేవైగుణ్యమును లేదు. వైద్యమునసైత మాతఁడు నద్యశముసుగణించియున్న వాఁడు. ఇట్టివరుఁడు మీ కెందును లభింపఁడు."

ఘనానంద—(ఇల్లాసముతో) ఈవిషయమై యాసవహించుటకు సైతము నాకు సాహసము కలుగదు. కమలనయనునితో నాకుమారితకుఁ బెండ్లియైనచో నంతకన్న గావలసిన సౌభాగ్య మేమున్నది? కాని, యాతఁడిందులకు—

కల్యాణీబాయి—వాఁడిందున కంగీకరింపకుండఁడు వాఁడీ నాఁటిబాలురవలె స్వేచ్ఛానుసార వర్తనుఁడు కాఁడు. నేనెటుసేయుమన నతఁడటుసేయును. అంతియే కాక, మీకన్నియను మెచ్చనివారీజగమున నెవ్వరునుండరు, ఇట్టివీరివివాహము త్వరలోనే జరిపివేయవలెనని నామనోభిప్రాయము ఎందులకన, నాశరీరస్థితి బాగుగాలేదు. ఏగడియలో నేనీజగమును వీడిపోవలసివచ్చునో చెప్పజాలను.

ఆనాఁటిరేయి ఘనానందబాబు ప్రసన్నచిత్తముతో గృహ

మునకు మరలివచ్చెను. తత్క్షణమే యతఁడు నళినిబిలిచి, "బిడ్డా! నేను వృద్ధుఁడనైతిని. నాశరీరబల మానాఁటికానాఁడు క్షీణించు చున్నది. నీవివాహమునకుఁ బూర్వమే నాకు మృత్యుదేవతామంత్ర ణము వచ్చినచో నాయాత్మకు శాంతి లభింపఁజాలదు. కావున, నీవే మియు ననుమానింపక, సంకోచముంపక నాప్రశ్న కుత్తరమిమ్ము. నీకుఁ దండ్రినైనను దల్లినైనను నేనేకదా! నీకష్టసుఖములభార మంతయు నామీఁదనేయున్నది!" అనియెను.

నళిని యుత్కంఠితయై తండ్రిముఖమువంకఁ గాంచుచుండెను. ఘనానందబాబు మరలఁ బలుకసాగెను—

"నీవివాహసంబంధమై విచిత్రప్రకరణము లుద్భవించినవి కదా! దానిమూలమున నాహృదయమున కెప్పుడును సంతోషము కల్గుటకు వీలులేదు. మరల నీసందర్భమున విఘ్నముతటస్థింపకుం డుఁగాక!" యని నాయభీష్టము. నేఁడు కళ్యాణిబాయి తానుగనే వచ్చి కమలనయనబాబునకు నిన్నిచ్చి పెండ్లిచేయువిషయమున సంభాషించినది.

నళిని—(లజ్జతోఁదలవంచి) చీ! చీ! ఇట్టిదెన్నఁడును జరుగ నేరదు;

కమలనయనబాబు వివాహమాడుట యసంభవమని యామె కుఁదోఁచెను. "ఇట్టిమహాత్ముఁ డెండైన వివాహమాడుదురా?"

ఘనానంద—ఏటికిఁ బెండ్లియాడరు?

నళిని—అసంభవము! కమలనయనబా బ్రెట్టివృత్తినవలం బించిన సత్పురుషుఁడో మీరాలోచించిచూడుఁడు!"

"అతఁ డవివాహితుఁడేకదా?"

నళిని యిఁక నచట నుండఁజాలకపోయెను. ఆమె తటాలున లేచి వెడలిపోయెను. ఘనానందబాబు విచారసాగరమున మునిఁగెను.

ఆమె యిట్లొనర్చునని యతఁడనుకొనలేదు. కమలనయనుని పేరెత్తినంతటనే యామె ప్రసన్నురాలగునని యతఁడనుకొనియుండెను. ఆతఁడుదాసీనుఁడై సామదానప్రయత్నములు సేయ నెంచి, స్త్రీలయవిచారమనోవృత్తివిషయమై తనలోఁ జర్చించుచుఁ గూర్చుండెను.

నళిని చాలసేపటివఱకు బయటనే నిలుచుండి, యొక్కమాఱు తండ్రియున్నస్థలమును వెనుకకుమరలి చూచెను. తండ్రిచింతాధీన స్వరూపమును గాంచినంతనే యామెకు దుఃఖము కలిగెను. తక్షణ మామె యతనిచెంతకరిగి "నాన్నా! రండు; పళ్లెరమున వడ్డించి చాలసేపైనది; భోజనపదార్థములు చల్లాఱిపోవుచున్నవి" అనియెను.

ఘనానందబాబు భోజనముసేయుట కింటిలోనికిఁ బోయెను. కాని, నేఁడాతఁ డెప్పటివలె భోజనముసేయలేదు. నళినీవివాహసంబంధమగు ప్రస్తావనమున నాతనిమన సానందమయమైయుండెను గాని, నళినిభాషణములువినుటచే నాయాశ భంగమయ్యెను. ఆతఁడు హతాశుఁడయ్యెను. నళినివిషయమై యాలోచించుచుండ నతనికి రమేశుఁడు జ్ఞప్తికివచ్చెను. "ఇంకను నళిని యతనినిమఱవలేదా ?" యనుప్రశ్న మాకస్మికముగా నతనిహృదయమునను ద్భవించెను.

పూర్వ మెప్పుడును భోజనమొనరించినవెంటనే ఘనానంద బాబు విశ్రమించుచుండును. కాని, నేఁడాతఁడు శయనమందిరము నకేగలేదు. గృహమున కీవలిపార్శ్వమున నొకకుర్చీపైఁ బరుండి మనసునఁ నాలోచించుచు, నెదుటనున్నవృక్షపంక్తులఁ గాంచుచుండెను. చింతాపూర్ణమగు నాతనిముఖమునీక్షించి నళిని మెల్ల మెల్లగ సమీపించి, చిఱునగవుతో "బాబా! ఇచట చలిగాలి వీచుచున్నది, లోనికరుఁగుఁడు ?" అనియెను.

"నీవుపొమ్ము. కొంచెముసేపుండి నేనును వచ్చెదను."

“నళిని స్తబ్ధముగా అతనికడ నిలిచెను. అనంతర మొకకొంతతడవునకామె “బాబా! చలివలన మీకు శ్రమకలుగును. లోనికిరండు! అనిపిలిచెను.

ఘనానందబాబులేచి మౌనముతోఁ బోయి మంచమునఁ బరుండెను. ఒక్కప్పుడొకనికి హృదయము నర్పించి మరల నతని యెడ విశ్వాసఘాతుకయై యుండుట నళిని కనిష్టముగానుండెను. ఆమె రేయింబవ లాతనిచింతనలోనే కాలముఁ గడపనిశ్చయించెను; అట్లు చేయుటయే యామె తనకుఁ గర్తవ్యమని నిశ్చయించెను. కోమలమున, కర్తవ్యనిష్ఠాతత్పరమునైన యామెహృదయము నెవ్వరైననొప్పించినచో నామెకుఁ దీవ్రవేదన యగుచుండును. తనజీవితశేషము నెట్లుగడపనగునా యనువిచార మామెడెందమునఁ దాండవమాడుచుండును. కాని, యావిచారము లెట్లునశింపఁగలవు? తుదకామె కమలనయనబాబును గురువుగా నెంచుకొని యాతనియుపదేశానుసారముగఁ బ్రవర్తింప మొదలిడెను. కాని, యిట్టిస్థితిలోనైతము వివాహసంబంధము లగుమాటలు చెప్పి యామె ప్రేమబంధనము త్రెంచివేయుట కెవరైనఁ బ్రయత్నించిన నామెకు ఖేదమగును. ఆమె తనమనోబలమునంతను వినియోగించి యాప్రేమ నతిభద్రముగా నుంపఁబ్రయత్నించుచుండెను. ఆప్రేమయే యామెకు జీవనాధారమై యుండెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

---

### పూర్వచరిత్రము.

కళ్యాణీబాయి కమలనయనునితో “నీవివాహమువిషయమై నేనంతయును సిద్ధపఱచితిని.” అని చెప్పెను.

కమలనయన—(చిఱునగవుతో) ఇంతత్వరలో నెట్లుసిద్ధము చేసితివి.?

కళ్యాణీబాయి—అట్లుచేయుటకన్న గత్యంతరము లేదు. నేనిప్పు డింకఁ జాలకాలము బ్రతికియుందుననునాస నాకు లేదు. నేవ చించునది వినుము. నేను నళినిని మెచ్చితిని. ఇట్టిసుశీలయు, సుస్వ రూపయు నగుకన్నియ వెదకినను లభింపదు.

కమలనయన—మఱి యామెను నేనెట్లు పెండ్లియాడుదును? అశక్యము!

కళ్యాణీబాయి—ఏమి? అశక్యమెట్లు?

ఈప్రశ్న కుత్తర మొసఁగుట కమలనయనునకుఁ గఠినముగ నుండెను. కాని. 'నళిని' యనుపేరు నుచ్చరించి యతఁడూరకుం డెనో, యామెను బెండ్లియాడువిషయ ముచ్చరించినంత నాతనిహృ దయము క్షుభితమయ్యెను.

కమలనయనుఁడు పలుకకుండుటఁగని కళ్యాణీబాయి మరలఁ బలుకఁదొడఁగెను. 'ఈమాఱు నీయేయడ్డంకులను గమనించుదానఁ గాను. ఈయౌవనప్రాయమున నీవు నాకై సర్వమును త్యజించి, కాశీవాసముస్వీకరించుట నేను జూడలేను. ఇప్పుడు నేను నిశ్చయిం చినముహూర్తదివసమును వ్యర్థముసేయుదానఁ గాసని ముందుగానె నీకు నొక్కిచెప్పుచున్నాను."

కమలనయన—(కొంతసేపూరకుండి) సరేకాని; నీతో నేనొక సంగతి చెప్పుచున్నాను, శ్రద్ధతోవినుము. కాని, వినినంత భీతిల్లకుము నేనిప్పుడు నుడువఁబోవు చరిత్రము తొమ్మిది నెలలకుఁ బూ ర్వము జరిగినది. దానివిషయమై యిపుడు వెతఁగుందఁ గారణము లేదు. నీస్వభావ మత్యంతకోమలమైనదగుటచే, నేదైన నవిష్టము చెప్పినచో నీకుఁ గష్టముగఁ దోఁచునను తలంపున నేనింతదనుక

నీయుదంతమును జెప్పనైతిని. నేను మాఘమాసమున రంగపురము విడచితిని. తరువాత నాకేమితోఁచెనో యెఱుఁగనుగాని, రైలుప్రయాణముసేయుటకుమారుగ నేను జలమార్గమునఁ గలకత్తానగరమునకుఁ బోవనిశ్చయించితిని. ఒకనాఁడు నావ నొకవృక్షమునకుఁగట్టించి స్నానముచేయ నీటదిగితిని. అప్పుడు నాస్నేహితుఁడగు భూపేంద్రుఁడు చేతనొక తుపాకినిబట్టుకొని నాకడకు వచ్చుచుండుట నాకగపడెను. అతఁ డాప్రాంతమున మేజస్ట్రేటయియుండెను. ఆతనిగుడారమాసమీపమున నుండుటచే నాతఁడావైపునఁ దిరుగు చుండెను. చాలకాలమునకు దర్శనమైనందున నన్నతఁడు తనగుడారముకొద్దకు రమ్మని యెంతో బ్రతిమాలి పిలుచుకొనిపోయెను. ఎంతజెప్పిన నన్నతఁడు వినువలేదు. నన్నుఁ దన జంటనిడుకొనియే యతఁడూరూరును దనపనిమీఁదఁ దిరుగుచుండెను. ఒకనాఁడు ధర్మపుష్కర పుర సమీపమున కేగి విడిసితిమి. మూఁడవ జామున మేమూరఁ బ్రవేశించితిమి ఆయూరు మిక్కిలి చిన్నది. అందు వ్యవసాయముసేయు వారిసంఖ్య యధికము. అటఁ దిరుగుచుఁదిరుగుచు మేము పాఠశాల కేగితిమి ఆపాఠశాలలో బాలకులందఱును బలకయు బలపమును జేధరించి వ్రాయుచుండిరి. పంతులుగారొక చిన్నబల్లపైఁ గూరుచుండి ఘోరచూపులతో విద్యార్థులవైపున నీక్షించుచుండిరి. ఆపాఠశాలయున్నగృహము తారిణీచరణబాబనువానిది. భూపేంద్రుఁడాతనికిని నాకును బరిచయము కలిగించెను. అటనుండి మరల గుడారమునకు వచ్చినపిమ్మట భూపేంద్రుఁడు నాతో "నీయదృష్టము చాల మంచిది, నీవివాహమువిషయమై మాటలు జరుగుచున్నవి" అనియెను. నేనాశ్చర్యచకితుఁడనై యతనివంకగాంచితిని అప్పుడాతఁడు మరలఁ బలుకసాగెను — ఈతారిణీ చరణబాబు వర్తకముసేయుచుండును. ఇతనింబోలిన లోభియుండుట యరుదు. ఆతనికొర సోదరి

యుండెను. ఆమె భర్తృగతించునప్పు డామె గర్భిణియై యుండెను. ఆమె యితని గృహమునకు వచ్చినపిమ్మట సుఖప్రసూతయై యొకకుమారికను గాంచెను. కాని, యపుడు జరుగవలసిన పథ్యములు మొదలగునవి జాగ్రతగ జరుగకునికి నామె మరణించెను. ఆ బాలికకిపుడు పెండ్లియీడు వచ్చియున్నది. అట్లుండియుఁ దారిణీచరణుఁ డామెవివాహవిషయమై యేమియు నాలోచింపక యింట సర్వకార్యములుఁ జేయించుచుఁ బనికత్తెజీవితము లాభము చేసికొనుచున్నాడు అహోరాత్రము లామె స్వయంపాకాది సర్వకార్యములు చేయుచుండును. అంతియేగాక యిట్టి యనాథబాలికను బెండ్లియాడుటకెవఁడు సమ్మతించును! పితృమరణానంతరమామె జన్మించినందున లోకమున జనులామెవిషయమై యనేక తర్కవితర్కములు సేయుచున్నారు. వారియిచ్ఛయేమనగా; ధనికుఁడును లోభియునైన తారిణీచరణునకీబాలిక వివాహసందర్భమున నధికవ్యయము కలుగవలెననియే కాని, యతడు మిగులశఠుఁడు! నేఁటికినాలుగేండ్లనుండియు నాతఁడా బాలికకుఁ బదియవసంవత్సరమనియే చెప్పుచున్నాఁడు! ఎట్లయినఁ గానిమ్ము; బాలికయువతియైయున్నది. ఆమెపేరు కమల. ఆమె పేరునకుఁదగినట్లే కమలమువలెఁజూడ సుందరమైనది. ఇట్టిలావణ్యమబ్బుటఱుదు. ఊరనేతరుణబ్రాహ్మణుఁ డేతెంచినను దారిణీచరణుఁ డాతనికాళ్లఁబడి నామేనకోడలినిఁ బెండ్లియాడుమని వేఁడును. కాని, యూరివారందఱు నామెవిషయమై యనేకదోషములఁగల్పించి చెప్పుటచేఁ బెండ్లియాడుట కంతయును సంసిద్ధపఱచిన వరుఁడు సైతము మానముతోఁ బారిపోవుచున్నాఁడు. ఈనాఁటి తారిణీచరణుఁడు నిన్ను నమ్మియున్నాఁడు" నేనామాటలనువిని కమలను బెండ్లియాడెదనని వచించితిని. సనాతనధర్మావలంబనయగు కన్నియను బెండ్లియాడి యామెను నీసేవకై తెచ్చివిడిచి నిన్నాశ్చర్యమున ముంప

నెంచియుంటిని. ప్రథమమున నేననినమాటలయెడ భూపేంద్రునకు నమ్మకము కలుగలేదు. కాని, శీఘ్రముగనే వానికి నమ్మకము కలుగఁజేసితిని. ఆనాఁడు సాయంసమయముననే తారిణీచరణబాబు వేతెంచి, తనభాగినేయిని బెండ్లిచేసికొనుమనియుఁ దక్షణము యామెను జూడరమ్మనియు నన్నుబ్రతిమాలెను. కాని, పిల్లనుజూడనవసరమే లేదని నేనంటిని. ఆమఱునాఁడే ముహూర్తమునిశ్చయించి నాఁటిదినముననే నేను కమలను బెండ్లియాడుటకు నిశ్చయపఱచిరి. ఏలయనఁగాఁ—దారిణీచరణునిమనమున రహస్యముగాను నల్పవ్యయముతోను బెండ్లిచేసిన మంచిదని తోఁచెనఁట. అట్టులే నిశ్చయింపఁబడినముహూర్తమున మాకుఁ బెండ్లిజరిగెను."

కల్యాణీబాయి—(ఉలికిపడి) ఏమి? పెండ్లియయ్యెనా? నిజమే వచించుచున్నావా?

'ఔను; నిజమే నుడువుచున్నాఁడను. నవవధూసహితుఁడనై నావలోఁ బ్రయాణమైతిని. కాని, యాసాయంతనమున కాకస్మికముగ తుపాను వీవదొడఁగి మానావను రసాతలమున కంపివేసెను. ఫాల్గునమాసమున నిట్టితుపానెన్నఁడును జూడలేను. నాకుఁ దెలివికలిగినపిమ్మట నేను లేచిచూడ వధువు కానరాదయ్యెను; నౌకయుఁ బొడకట్టదయ్యెను. పోలీసువారి కీవృత్తాంతము నివేదించితిని. అందువను లాభముకలుగదయ్యెను.

కల్యాణీబాయి వెలవెలఁబోవు మొగముతో—

"కడచినదేమో కడచినది. కాని, మరలనెన్నఁడు నీవిషయమునాయెదుట నెత్తకుము. ఆవృత్తాంతము వినుటచే నాహృదయము విదీర్ణమగుచున్నది.' అనియెను—

"పెండ్లివిషయమై చర్చించితివి కావునఁ జెప్పవలసివచ్చెను."

"ఒక్కమా రిట్టిసంకటము లోదవెనని మరలఁబెండ్లియాడవా?"

"ఎందులకుఁ బెండ్లియాడను? ఆమె బ్రతికియున్న దేమో!"

'నీకు సాందేహము లేదుకదా! ఆమె జీవించియున్న యెడల నీ కామె తనజాడఁ దెలుపకయే యెట్లుండఁగలదు?"

"కాని, నాజాడ యామెకుఁ దెలియునెట్లు? నేనెవ్వడనో నే యూరివాఁడనో యామెకుఁ దెలియనే తెలియదు. ఆమె నాయానన మున్నైన నీక్షించియుండదు.'

'మఱి యేమి చేయవలెనందువు?"

'నానిశ్చయమిది ఒక్కసంవత్సరమువఱకు నామె కొఱకు నిరీక్షించి పిదపఁ బెండ్లిప్రయత్నములు సేయ నెంచితిని.'

'ఒక్కసంవత్సర మెందుకుచూచు నవసరమేమున్నది?'

'అయొకవత్సరము ముగియుట కింకెంత కాలమున్నది? ఇప్పుడు మార్గశీర్షమాసముకదా! పుష్యమాసమునఁ బెండ్లిసేయఁదుకదా! ఒక్క మాఘమాసమును మాత్రము గడపితిమా ఫాల్గునమాసమునఁ బెండ్లియాడుదును.'

'సరే! నీయభీష్టముచొప్పున నే కానిమ్ము; ఇపుడు నామానస మతికోమలమై యున్నది. నీవిపుడు చెప్పినదుఃఖచరిత్రము నింక మీఁద నాతోఁ జెప్పకుము."

---

పంచాద్దశ ప్రకరణము.

---

మహామాయ

కమల గంగాతటమునకుఁ బోయి చేరునప్పటికి సూర్యుఁడస్తాచలమున కేగునుద్యమమున నుండెను. కమల కరకమలంబులను మోడ్చి శాంతస్వరూపుఁడగు నాసూర్యభగవానునకు నమస్కరించెను.

పిమ్మట నాగంగాజలమును దనశిరసుపైఁ జల్లుకొని ప్రవాహ మున నడుగిడెను. మోకాలులోతునీటికరిగి యామెగంగాదేవికర్పిం చుకొఱకుఁ దెచ్చినపుష్పములఁ బ్రవాహమున విడిచెను. ఆభాగీర థికిఁ బునఃప్రణామమొనర్చి యామె మరల గట్టున కెక్కి వచ్చెను. అటుపిమ్మట నాతరుణి గురుజనులను స్మరించి శిరసు వంచెను. తల పై కెత్తునంతలో నామె కొకపూజ్యపురుషునిజ్ఞప్తి కలిగెను. ఆజవ్వని యొకమారయిన నాతని వీక్షించియుండలేదు; నావలోఁ జెంతఁ గూర్చుండియుండినను నామె కాతనిపాదసరోజములదర్శనమైనఁ గా లేదు; వివాహసమయమున నితరజను లాతనిగూర్చి యాడినపలుకు లలో నాలుగుమాటలైన నామె వినియుండలేదు. అట్లుండియు నాస త్పురుషునికంఠస్వరమును జ్ఞప్తికి దెచ్చుకొన నాలతాంగి యెంత యో ప్రయత్నించెను; ఆప్రయత్నములవలన లాభము లేకపోయెను.

ఆమెవివాహలగ్నము మధ్యరాత్రమున జరుపఁబడియుండెను. రాత్రిచాలసేపు మేల్కనియున్నందునఁ దరువాత నామె యెచటఁ బరుండినదియు నెపుడుపరుండినదియు నామెకుఁ దెలియనే తెలియదు. ఉదయమున మెలకువకలిగినప్పుడు చూడఁగా నామె చెలియొకతె తన్నుఁ గరములచేఁ దట్టుచు నవ్వుచుండుట యామెదృష్టింబడెను. శయ్యపై నితరులెవరునుండలేదు. తనప్రాణేశ్వరుని ధ్యానించు నితరసాధనము లేవియు నామెకడ నుండలేదు. ఏరక్తవర్ణవస్త్రము పరిధానమైయుండ నామెకు గ్రంథిబంధన మయియుండెనో, దానియోగ్యతయైనఁ బాప మామె కెట్లు తెలియును? అదియునామె జాగ్రతపఱచియుంచదయ్యెను. లేకున్న దానిదర్శనమునైనఁ నేఁడా మెకుఁ దనహృదయేశ్వరునిస్మరణ కలుగ వీలైయుండును.

రమేచంద్రుఁడు నళినికి వ్రాసినయుత్తరమును కమల తన పయ్యెదచెంగునఁ గట్టినైచియుండెను. ఆయుత్తరముఁదెఱచి యామె

చసాగ నారంభించెను. ఆమెపతినిగూర్చినసంగతు లందుఁ గొన్ని వ్రాయుండెను, ఆతని నామము కమలనయనబాబనియు, నాతఁడు కొంతకాలము రంగపురమున డాక్టరుగా నుండెననియు మాత్రమే యందు లిఖింపఁబడి యుండెను. "కమలనయనుఁడను పేరుఁ జదివి నంతమాత్రమున నామెయంతఃకరణమున నస్మృతవృష్టి యగుచు న్నట్లామెకుఁ దోఁచెను. కొంతసేపటివఱకుఁ బ్రేమాతిరేకముచే, నామె మైమఱచియుండెను; ఆమెలోచనములశ్రుపూరితములు కాఁజొచ్చెను. ఆయవిరతాశ్రువృష్టిచే నామెహృదయ మార్ద్రమయ్యెను. అందుఁ బ్రజ్వలించుచున్నదుఃఖానల మాకస్మికముగఁ జల్లారెను. ఆమె హృదయ మామెకు "భీతిల్లనవసరము లేదు. నేనాతనిఁగాంచు చునేయున్నాను. కుశలులై యున్నారు. ఆతఁడె నానాథుఁ డని నాకు నమ్మకము కలదు" అని చెప్పుచుండెను.

కమల—(ప్రకాశముగా) నేనుసతిని! కావున, నాజీవితమున నేనాఁటికైన నాతనిచరణరజము నాశిరమునఁ దాల్చుకొనుసమయము తటస్థముకాకపోదు! విధాత నామనోరథము నెన్నఁటికిని నిష్ఫల మొనరింపుడు! నేనుండునప్పుడీజగమున నాతఁ డెందులకుండకుండును. ఉన్నాఁడు! కావుననే, పరమేశ్వరుఁ డాతనిసేవ సల్పుటకొఱకై నన్ను బ్రతికించియున్నాఁడు'

కమల తనచేతిరుమాలునఁ గట్టియుంచిన తాళపుఁ జేతులనట విసరివైచెను. రమేశచంద్రుఁ డొసరించిన సువర్ణశృంఖలమును గంఠమునుండి తీసి యాప్రవాహమునఁ బాఱవైచెను. అటుపిమ్మట నామె పశ్చిమదిశనుబట్టి నడువసాగెను. ఎచటకేగవలెనో, యేమిచేయవలెనో, యేమియు నామె నిశ్చయుబఱపలేదు. కేవలమార్గాక్రమణ మొనర్చుటయు, క్షణమైన నొకచో విశ్రాంతిబడయుటయు లేదనిమాత్ర మామె యెఱిఁగియుండెను.

సంధ్యాకాలప్రభ నష్టమయ్యెను. నలుదిక్కుల నంధకార సామ్రాజ్యము ప్రసరించెను, ఇసుక వెల్లదనముదక్క మఱొండేదియు దృగ్గోచరమగుచుండలేదు. కాని, కమల నడచుచునే యుండెను. ఏలయన, నెవ్విధముగానైన నెవ్వరినిమార్గమడుగఁగూడ దనియు, నొకవేళ దుష్టులెవరైన నామెను బాధింపఁదొడఁగిన, వెంటనే యాప్రవాహమున దుముకవలెననియు నామెనిశ్చయించి యుండెను.

కృష్ణపక్షనిశియగుటచే నంధకార మధికాధిక మగుచువచ్చెను గృధ్రములయొక్కయుఁ గీటకములయొక్కయు శబ్దములు మాత్రమే వినఁబడుచుండెను. పోవంబోవ, నసతికాలమున నె యామె కొక యూరు కానవచ్చెను. కమల కంపితహృదయముతో నాయూరికి వచ్చిచూడ నెల్లెడల నిశ్శబ్దముగా నుండెను; ఆపురవాసు లెల్లరు నిద్రావివశులై యుండిరి. ఆమెయథాప్రకారము మెల్లమెల్లగానడచి యాయూరు దాటిపోయెను. గంగాతీరమునకు వచ్చిచేరెను; కాని, యామెకు ముందుదారి కనఁబడలేదు. అప్పుడు దిక్కుతెలియక యామె యచ్చటనే నిలువఁబడెను. నిలిచినిలిచి తుదకు విసిగెను. అటనుండి కదలిపోయి యొక చెట్టుక్రిందఁ బరుండెను. కొలఁది సేపటి లోనే నిద్రాదేవి యామెను వశపఱచుకొనెను. అరుణోదయమునకు మున్నే యామె మేల్కొనిచూడఁ జంద్రకళలక్షీణతేజము పృధ్వీతలముపైఁ బ్రసరించియుండెను; మధ్యవయస్కయగు స్త్రీయొకతె యామెసమక్షమున నిలిచియుండెను; ఆకాంత కమలంగని "నీవెవ్వ తెవు? ఇట్టిచలిలో నీవృక్షముక్రింద నేమియుఁ గప్పుకొనకయే పరుండి యున్నావేమి?" అని ప్రశ్నించెను.

స్త్రీ—నీవు వంగదేశీయురాలవని తోఁచుచున్నది!

కమల—అవును.

స్త్రీ—నీవిక్కడఁ బరుండియున్నావేమి?

కమల—నేను కాశీక్షేత్రమునకుఁ బోవఁ బ్రయాణమైతిని; నడచినడచి సొమ్మసిల్లితిని; చీఁకటియు దట్టముగ నల్లుకొనెను; కావున, నిచ్చటనే బరుండి నిద్రించితిని.

స్త్రీ—ఏమీ? కాశికి నడచియే పోవుదువా? సరే నీవు నాతో నానావవద్దకు నడువుము. నేను స్నానము సేయవలెను.

స్నానమొనరించిన పిదప నాస్త్రీ కమలతోఁ దనవృత్తాంతమంతయుఁ జెప్పనారంభించెను.

గాజీపురమున మహాసంరంభముతో వివాహముసేసిన శ్రీపతిబాబుగారి కీమె దగ్గరచుట్టము. ఈమె పేరు మహామాయాదేవి. ఈమె భర్త పేరు ముకుందదత్తబాబు. ఈభార్యాభర్తలిప్పుడు కాశీనగరమున నివసించుచుండిరి.

మహామాయ—నీపేరేమి!

'నాపేరు కమల.'

'నీనొసటఁ గుంకుమ మున్నది; నీవు ముత్తైదువవేనా?'

'వివాహ మయినమఱునాఁడే నాభర్త యెటకేగెనో జాడ తెలియలేదు వారెటనున్నారో నేనెఱుఁగను.'

"అయ్యో! రామ! ఎంతకష్ట మమ్మా! నీవు ప్రాయమున మిక్కిలిచిన్నదానవు. నీకించుమించుగఁ బదునేనేండ్లుండవచ్చును?"

'ఉండవచ్చును.'

'నీవు బ్రాహ్మణస్త్రీవేనా?'

'అవును.'

'నీయిల్లెక్కడ?'

'అత్తవారియూరేదో నేనెఱుఁగను. నాతండ్రిగారి యూరు జగదీశపురము.'

'నీతలిదండ్రులు—'

'చిన్నతనముననే పరలోకమున కేగిరి.

'మఱి, నీయిచ్ఛ యేమి?' నీవుదరపోషణమున కేమిచేయుదువు?'

'కాశీనగరమున నేసద్గృహస్థుఁడైన నన్ను దనగృహమున నుంచి యన్నవస్త్రము లిచ్చుట కొప్పుకొనినచో నేనాతనియింట నుందును. ఇంటిపను లన్నియు నెరవేర్చుచుందును. వంటచాల బాగుగఁ జేయగలను.'

జీతములేకయే వంటచేయుటకు బ్రాహ్మణస్త్రీ లభించినందునకు మహామాయ తనలోఁ దానానందసంభరితురా లయ్యెను. ఆమె 'వంటలవారు నాకక్కఱలేదు. సేవకులు దాసీలు, వంటబ్రాహ్మణులు కావలసినంద ఱున్నారు. కాని, నామనసునకెక్కినవంట బ్రాహ్మణుఁడు దొరకలేదు. వేళకు భోజనము సిద్ధపఱుపనివంటవాఁ డుండియు లేనట్టేకదా! నీవిప్పుడు లభించుటయు లాభమే. ఇంట నెందఱో తినుచుందురు; నీవొక్కతెవు వచ్చియున్న నందు నష్టమేమి? నాపిల్లలందఱును ధనికులగృహములలో నున్నారు. ఒక్కకుమారుఁ డున్నవాఁడు. వాఁడు గొప్ప సర్కారుద్యోగమున నున్నాఁడు. నాయేకకుమారుని నింట నుండనీయ రేటికని నేనెప్పుడును. వారితోఁ దగవులాడుచుందును; కాని, వారు నామాటయే వినరు! ఇంత పెద్ద యుద్యోగము మాని యింటఁ గూర్చుండి యేమిచేయవలెనని వార నుచుందురు.' అనియెను.

మహామాయదేవియుఁ గమలయు నావలోఁ గూర్చుండి కాశీపురమునకు బయలుదేరిరి. కాశీపురముఁ జేరి మహామాయ కమలను దనగృహమునకుఁ బిలచికొనిపోయెను. గృహమున వంటబ్రాహ్మణుఁడు లేఁడు; వంటయన నేమియో యెఱుఁగనట్టియు, వారములచే జీవనముసేయునట్టియు, నొకకుఱ్ఱవాఁడు తనచేతనైనట్లు

వంటచేయుచుండెను. ఆ బాలునిపై సైత మేదియో దోషము నారోపించి మహామాయ పంపివేసెను. కావున, సహజవిధిని వంటసేయుపని కమలపై మోపఁబడెను.

మహామాయ పలుమాఱు లామెను జాగ్రత్తగా నుండునటు లొనర్పఁదలఁచి యిట్లనుచుండెను—

'ఇదిగో! కాశీనగరమున మంచియూరు కాదు. ఇచట ననే కభేదములుగల దుర్మార్గులున్నారు. అందును ద్రాఁగుబోతులును, జోరులును, జారులును, దుదకు హత్యకారులును మెండుగ నున్నారు. నీవింకను బాలికవు. నీవీగడప దాఁటిపోవుదువుసుమా! గంగాస్నానమునకు, దేవదర్శనమునకుఁ బోవునప్పుడు నేను నిన్నుఁబిలిచికొని పోవుదును.''

కమల యామెగృహమువీడి వెడలిపోవునేమోయని తలఁచి, యట్లుపోవకుండుటకై మహామాయ యిట్టిపలుకులచే నామెను జాగ్రతగాఁ జూచుకొనుచుండెను. పగలంతయు గృహకృత్యముల నెల్ల నామెచేఁ జేయించుచు, రాత్రి కమలతోఁ దానేమైన స్వయముగ ముచ్చటలచేఁ బ్రొద్దుపుచ్చును. మహామాయముచ్చటలివియె. ''నా శృంగారాలంకారములు, బంగరుసొమ్ములు, వెండిపాత్ర సామగ్రులు మొదలగునవన్నియు, నీకాశీపురమునఁ జోరులభీతివలన, నిక్కడకుఁ దీసికొనిరాలేదు. వారికిత్తడికంచమున భోజనము సేయుట కలవాటు లేనేలేదు; కాఁబట్టి, వారప్పుడప్పుడు రెండు మూఁడు వస్తువులు దొంగలెత్తుకొనిపోయిన మానేఁగాని, నే నీ కష్టమున కోర్వలేనను చుందురు. కాని, నాయభిప్రాయము వారికి విరుద్ధము. ధనముమిక్కుటముగ నున్నదని దానినంతయుఁ బాడుసేసిన నెట్లు? సేవకులనుగూడ జాలమంది నేర్పరుపవలెనని యనుచుందురు; నేనొప్పను. అందఱు సేవకులెందులకు! ''ఇప్పుడున్న వారుమాత్రము కొందఱేనా!''

ఆవిధముగ నామె తనయొక్కయుఁ దనగృహముయొక్కయు శ్రేష్ఠత్వముంగూర్చిన గర్వోక్తులతో సాయంకాలము ప్రొద్దుపుచ్చు చుండెను.

---

## ఇ రు వ ద వ ప్ర క ర ణ ము.

---

### నాకు సెలవొసంగుఁడు.

మహామాయాదేవి గృహమునను యహోరాత్రములుండుట చేఁ గమలకుఁ గష్టముతోఁచెను. ఇచ్చటనుండి యెప్పుడు బయటఁ బడుదుమా యని యామెకుఁ దోఁచెను. కాని, బయటఁబడినైన నామె యెవరి నాశ్రయించును?

మహామాయకుఁ గమలపై బ్రేమ యుండకుండ లేదు; కాని, యాప్రేమ కేవలస్వార్థబుద్ధితోఁ గూడియుండెను. దినమంతయుఁ గార్యాసక్తయై యుండుటవలనఁ బ్రొద్దెట్లుగడచుటయు నామెకుఁ దెలియకుండెను; కాని, సాయంకాలమున నామెతో మహామాయ మాటలాడుచుఁ గూర్చున్నప్పు డామెహృదయమున వ్యాకులభావ ముత్పన్నమగును. ఒకనాఁడు మహామాయ కమలను బిలిచి "వారికి శరీరమున బాగులేదు; కావున, నీవు నేఁడన్నము వండనక్కఱలేదు. నేయి జాగ్రతగా వాడుము. ఆ బ్రాహ్మణుఁడు కొంచెము నెయ్యి వేసి యెంతబాగుగనో వండుచుండెడివాఁడు; నీవు నేయి యధికముగా వాడుచుండుటవలన వారికి భోజనము సరిగా జరుగుచుండలేదు. నీవు దరిద్రులయింటిపిల్లవు! నేయియు, నూనెయు, నెక్కువగ వాడిన ననేగాని స్వయంపాకము బాగుగాఁజేయుటకు వీలు లేదని నీయభిప్రాయము కాఁబోలును!" అనియెను.

కమల మాఱుమాట సెప్పకయే యెప్పుడును దనకార్యములలో మగ్నమైయుండును. అదేతీరున నేఁడు నామె యేమియుఁ బలుకలేదు. కాని, యామెకు నేఁడు మిక్కిలి విచారము కలిగెను. జగమంతయు నామెకు శూన్యముగనున్నట్లు తోఁచెను. ఇంతలో నామె మేడమీఁదనున్న మహామాయ కర్కశకంఠస్వరము వినెను;

"ఓరీ! తులసీదాసా! పోయి డాక్టరు కమలనయనబాబుగారిని ద్వరలోఁ దోడి తెమ్ము! బాబుగారి ప్రకృతి చాల బలహీనముగా నున్నదని వారితోఁ జెప్పుము."

"కమలనయన" యనునామము కమలహృదయమున వీణా నినాదమువలెఁ గమ్మగ ధ్వనించెను. ఆమె వంటసేయుట మాని గది తలుపుదగ్గఱకు వచ్చి నిలిచెను. ఆమె తులసీదాసు "నెక్కడికిఁ బోవుచున్నా" వని యడిగెను.

"కమలనయన డాక్టరుగారిని బిలువఁబోవుచున్నాను."

"వారెట్టిడాక్టరులు?"

"ఈయూరఁ బ్రఖ్యాతివడసినవారు"

"వారెచట నివసింతురు?"

"ఈ సమీపముననే. వారిగృహ మిక్కడకొక మైలుండును"

కమల యజమానురాలి శాపములను, దిట్టులను మౌనముతో నోర్చుచు, సేవకుల కప్పుడప్పు డేదైనఁ దినుట కిచ్చుచుండు. కావున సేవకులందఱు నామెయిష్టప్రకారము మెలఁగుచుందురు. మేడమీఁద నుండి మరల శబ్దము వినఁ—"తులసీదాసా! నీవు వంటయింటి దగ్గర నిలుచుండి యెవరితో మాటలాడుచుండునదియు నేనెఱుగననుకొన్నాడా? వంటయింట నొకింతసేపుమంతనములాడని దే నీయడుగులు బయటికిఁ గదలవు కాఁబోలును! నీ నడవడిక లేమియు నాకు బాగుండలేదు. నీమధ్యస్థమున నింటిలోని వస్తువులెన్నో బజారునకుఁ బోవ

చున్నవి. ఈపిల్ల బాటలో పడియుండినది; దీనినే నింటికిఁ దెచ్చిన యుపకారమునకిదే ఫలము!"

అట్లుండియుఁ కమలహృదయమున కీపలుకులు బాధపెట్టలేదు. ఆమె యెప్పటివలెనే యుల్లాసముతో గృహకృత్యముల నెఱవేర్చుచుండెను.

కమల వంటయింటి తలుపుదగ్గఱఁ జాలసేపు నిలిచియుండెను. తులసీదాసు లోనికి వచ్చుటగని యామె మెల్లఁగ "డాక్టరుగారు రాలేదా?" యని ప్రశ్నించెను.

"లేదు."

"ఏలరాలేదు?"

"వారితల్లిగా రస్వస్థులైయున్నారు."

"ఇంట మఱెవ్వరును లేరా?"

"లేరు; వారింకను వివాహమేకాలేదు."

"అది నీకెట్లు తెలియును.

"వారిసేవకుఁడు చెప్పగా నేవింటిని"

"వారిపత్ని యొకవేళ మరణించియుండును."

"అట్లుండవచ్చును; కాని, వారు రంగపురమున వైద్యముసేయుచుండునప్పుడుకూడ వారికి భార్యలేదని వారి సేవకు డనుచున్నాడు.

ఇంతలో మేడపైనుండి "తులసీదాసా!" యను పిలుపు వినవచ్చెను. కమల తటాలున స్వయంపాకగృహమున కేగెను. తులసీదాసు మేడమెట్లచెంత కేగెను.

"కమలనయనుఁడు రంగపురమున డాక్టరుపని సేయుచుండె" ననుమాట వినినంతనే కమల సంశయము లన్నియు దూరమయ్యెను.

తులసీదాసు మేడమెట్లనుండి మఱలి వచ్చినపిదపఁ గమల యతనింజూచి "డాక్టరుపేరువారు నాబంధువులొక రిచట నున్నారు. ఈడాక్టరుగారు బ్రాహ్మణులేనా?" అనియడిగెను.

"అవును; వారుబ్రాహ్మణులే. కాని, భట్టోపాధ్యాయులు."

యజమానురాలికోపమునకు వ్యర్థముగఁ బాత్రుఁడుకావలసి వచ్చునను భీతిచేఁ దులసీదాసు మఱేమియుఁ బలుకక వెడలిపోయెను.

కమల—(మహామాయకడ కేగి) గృహకృత్యముల నెల్ల ముగించి నేఁడు దశాశ్వమేధఘట్టమునకు స్నానముసేయఁబోయి వచ్చెదను.

మహామాయ—(విసుఁగుతో) నీకు వేళావేళలు తెలియవు. యజమానుని దేహము బాగుగనుండలేదు. ఎప్పుడేదికావలెనో, యెవరికెఱుక? నేఁడే స్నానమునకుఁ బోవలెనని నీకెట్లుతోఁచెను?

కమల—నాయాప్తవర్గములోనివారొక రీకాశీపురమున నున్నా రనినాకుఁ దెలియవచ్చెను. నేనొకసారి వారిసందర్శనమునకుఁ బోవలెను.

మహామాయ—అదంతయునిజమే! నీమనస్థితిదినదినము మాఱిపోవుచున్నది. నాకుఁ జాలయేండ్లు గడచినవి. నీకీయాటలన్నియుఁ దెలియును. నీచుట్టముదగ్గఱనుండి వార్తఁదెచ్చినవారెవరు? తులసీదాసే! వాని నీనాఁడె నాయింటినుండి వెడలఁగొట్టెదను. అమ్మాయీ! ఎంతవఱకు నీవు నాయింటనుందువో యంతవఱకును నీవేకాకినివై నదీస్నానమున కేగుటయుఁ జుట్టములవెదకుచు వీథివీథులఁ దిరుగుటయు నిత్యాదులు సాగనేరవు—అవును; మనుష్యుల కొక్కమాఱె చెప్పివేయుట మంచిది.

తత్క్షణమె తులసీదాసునకు సెలవొసఁగఁబడెను.

కమలకుఁ గమలనయనునిజాడఁ దెలియునంతవఱకును నామె

నెమ్మదిగా నుండెను. అంతవఱకు నామెమనసున ధైర్యము నసించు చుండెను. ఇప్పుడా ధైర్యము బిగఁబట్టుట యామెకుఁ గష్టమని తోఁచెను. ఆమె యొక్క మాటె యధీరయయ్యెను. ఈపురమున నే తనప్రాణేశ్వరుఁ డుండఁ దానితరులగృహమున నొక్కక్షణమైన నుండఁదగదని యామెకుఁ దోఁపసాగెను. ఆయింటనుండుట యామె కసహ్యముగఁ దోఁచెను. మన నస్థిరమయ్యెను. మాటలాడునపుడు తడఁబడుచుండెను.

మహామాయ—నీలక్షణములన్నియు బాగుగనుండలేదు. నీమ నసున నేమున్నదో నాకుఁ దెలియుటలేదు. నీతలపై భూతమేదైనఁ దాండవమాడుచుండలేదుకదా? నీవన్నపానీయములఁ ద్యజించితివి. మమ్మందఱ నుపవాసములచేఁ జంపనెంచితివా యేమి? ఇటీవల నీవాయ్యారముతో వంటచేయుచుంటివి! ఒక్కపదార్థమునునోటఁ బెట్టుకొనుటకు వీలులేదుకదా!

కమల—ఇక్కడిపనులుచేయుట యిఁక నావలనఁగాదు నాప్రా ణమిప్పుడిచట లేదు. నాకు సెలవొసంగుఁడు.

మహామాయ—(గర్జించి) నిజమే! ఈ కలికాలమున నెవ్వ రికి నుపకారముసేయ నేకూడ దనుట నిజమే! నీకై, యెంతయో కా లమునుండి యింటనుండిన బ్రాహ్మణుని సాగనంపితిని, నీవును బయ లుదేరితివి! నీయాట లేమి సాగనీయనుసుమా! నేనుపోలీసువారికి మనవినంపుదును! నాకుమారుఁడు సర్కారులో నుద్యోగమునసుండి యెందఱినో దుర్మార్గులఁ జెఱసాల కనిపినాఁడు. తులసీదాసున కెట్టి గతియయ్యెనో నీకుఁ దెలిసియుండదు. ఇప్పుడు వాఁడు కారాగృహ వాసుఁడై యట కఠినమైనపనులు చేయుచుండుటతో మగ్నుఁడై యుండవలయును.

కమల యేమియుఁ బ్రత్యుత్తర మొసఁగలేదు. మహామా

యిట్లుపాసాఁడి పాటిపోవుట కేయుపాయము నామెకుఁ దోఁచదయ్యెను. ఊరక చేసాచుటతోనె లభింపనున్న ఫలము లభింపఁ జేయఁగూడదనుతలంపున నాచేతులఁ గట్టివేయుట యెంతమాహాత్మ్యము? ఎంతటినిర్దయకృత్యము! దినమంతయుఁ గమల పనులలో లీనయై యుండును. రాత్రివేళలో నామె దేహమును బాగుగఁ గప్పుకొని గృహముబయటికి వచ్చును; బయటిద్వారముకడ నిలిచి బాటవంకఁ జూచుచు నొక్కగంట సేపాగును. ఆమెహృదయము పతిసేవసేయుట కాత్రపడుచుండెను. ఆత్మసమర్పణ మొనరించుట కామెమనసుత్కంఠిత మగుచుండెను. ఒక్కయపరిచితస్థానశోధనమునకై యామె తనహృదయము నానిశీథాంధకారసమయమునఁ బంపును. పిమ్మట భూమిపైఁ దలనిడి యాదిశకు బ్రణామము సేయును. తదనంతర మామె లేనగదికరిగి శయ్యపైఁ బరుండును.

కాని, యింతమాత్రపు స్వాతంత్ర్యము కమలకు చాలకాల మనుభవించుటకు లభింపలేదు. ఒకరాత్రి మహామాయ యేదోపనికై కమలను బిలిచెను. కమల రాలేదు; తత్క్షణమే మహామాయ చేతిదీపమును దీసికొని బయటికివచ్చెను. చావడిలోఁ బరుండియున్నయుకుందబాబుగారి కీసంగతి తెలిపెను. అతఁడావులించుచు 'అజ్ఞాతకులశీలస్యవాసే దేయోనకస్యచిత్—ఏమిటుఁ దీసికొనిపోలేదుకదా?' అనియెను.

'ఇంతలో నదెట్లు తెలియును?'

'పోలీసువారికిఁ దెలియఁ జేయుము.'

సేవకుఁడు పోలీసుస్టేషనున కేగెను. ఇంతలోఁ గమలయే తెంచెను. మహామాయ గృహములోని వస్తువు లన్నియుఁ బరీక్షించుచుండెను. కమలనుగాంచినంత . నామె 'నీవు వింతయాఁడుదానవే ఇంత రాత్రివేళ నీ వెక్కడి కేగితివి? అని గద్దించెను.

'తోఁటలోనుంటిని.'

మహామాయ నోటికివచ్చినట్లు తిట్టనారంభించెను. కాని, కమల యెప్పటివలెనే కొయ్యబొమ్మవలె నిలిచియుండెను. తుదకు మహామాయ వాక్పాటవము సంపూర్తియైనపిదపఁ గమల 'మీకు నామీఁద నింతసంతుష్టియున్నచో నేనిఁక నిక్కడనుండుట కిష్టములేఁగాను; కావున నాకు సెలవిండు!' అనియెను.

'అవశ్యముగ సెలవిచ్చెదను. నీయట్టికృతజ్ఞతాహీన నింట నుంచుకొనిన నాకేమిలాభము కలుగఁగలదు? నీవెట్టివారి నాశ్రయింపఁబోవుచున్నావో, యది తొలుత నేనెఱుంగవలెను.'

అనంతర మెప్పుడును గమల యిల్లువీడిపోలేదు. ఏవ్యక్తికొఱకై తన్నిట్టిసంకటములు సైపఁజేయుచున్నాఁడో, యావ్యక్తి కొఱకే పరమేశ్వరుఁడు నిశ్చయముగఁ దన్నుద్ధరింపకమానఁడని తలంచుచు నామె ధైర్యమువహించియుండెను. ఒకనాఁడు ముకుందబాబు బండి నెక్కి పరిశుభ్రవాయుసేవననిమిత్తము బయటి కేగియుండెను. గృహద్వారములు మూయబడి లోపల గొళ్ళెము వేయఁబడియుండెను. సాయంతనమైయుండెను. అప్పుడు బయటనుంచి యెవరో 'ముకుంద బాబుగారింటనున్నారా?' యనిపిలిచిరి.

మహామాయ— (ఉలికిపడి) కమలనయనబాబుగారు వచ్చియున్నారు. కమలా! నీవు తలుపుఁ దీసి వా రెక్కడకో బయటకుఁ బోయియున్నారని చెప్పుము.

కమల దీపమును దీసికొని మేడదిగి వచ్చెను. ఆమెయడుగులు తడఁబడసాగెను. హృదయము దడదడఁ గొట్టుకొనఁదొడఁగెను. ఇట్టిభీతహృదయముతోఁ దనప్రాణేశ్వరుని దర్శనము తనకుఁ జక్కఁగ లభించునో లేదో యని యామెకు భీతిపొడమెను. కమల తలుపుఁ దెఱచెను; తలపై ముసుఁగువేసికొని యామె తలుపువెనుక డాగెను.

కమలనయన—ఇంట బాబుగారున్నారా?

కమల—(తొట్రుపడుచు) లేరు. లోనికి దయచేసి కూర్చుం డుఁడు!

కమలనయనబాబు లోనికేగి కూర్చుండెను. ఇంతలో దాసి బయటనుండివచ్చి యాతనితో 'బాబుగారు బయటకుఁ బోయి యున్నారు. ఇప్పుడేవత్తురు!' అనియెను.

కమల యానందమునకు మేర లేకపోయెను. తనయానందో ల్లాసముల నణఁచిపెట్టఁబ్రయత్నించుటలో నామె మిగులఁ గష్టపడి యెను. ఆమె మెల్లమెల్లగ నడచి చీఁకటిలో నిలిచెను. అటనుండి యామెకుఁ గమలనయనునియాననము స్పష్టముగఁ గానవచ్చుచుం డెను. కాని, యటనైనను నామె చాలాకాలము నిలువలేకపోయెను. హృదయచాంచల్యమును శాంతింపఁజేయుటకై యాజవ్వని నేలఁ గూర్చుండవలసివచ్చెను. ఆమెహృదయము మిక్కుటముగఁ గంపి మందుచుండెను. అందునకు గాలియు నధికస్ఫూర్తి కలుగఁజేయు చుండెను. కమల గడగడ వణఁకసాగెను. కమలనయనుఁడు తన చెంతనున్నబల్లపైనున్నదీపమువంక మోమిడి తనలోఁ దానేదియో నాలోచించుకొనుచుండెను. అంధకారమునుండి కమలనయనుని మోముఁదమ్మినీక్షించుచున్న కమల కంపించుచుండెను. చూడఁజూడ నామెకన్నుల నీరుఁగారసాగెను. చెఱఁగున నాయశ్రువులఁ దుడి చికొని యామె తనయేకాగ్రదృష్టిబలమునఁ గమలనయనుని తన హృదయాంతరాళమున కాకర్షింపఁదొడఁగెను. ఆమెహృత్పటముపైఁ గమలనయనుని మనోహరాకారము చిత్రింపఁబడియుండెను. ఏవంకనీక్షించిననామెకుఁ గమలనయనుఁడే కనఁబడుచుండెను. కమల నయనుని స్వరూప మామెదృష్టి నింత దృఢముగ వసించుచుండెను. అనఁగా—కొంత కాలమువఱకుఁ గమల బాహ్యజ్ఞానశూన్యయై

యుండెను. అనంతర మొకింతతడవున కామె స్మృతిఁదెచ్చికొని యాశ్చర్యదృష్టితోఁ జూచునరికిఁ గమలనయనబాబు ముకుంద బాబుతో నేమియో ముచ్చటించుచుండు టామెకు గనఁబడెను. వారవ్విధమున మాటలాడుచు నొకవేళ నడవగోనికి వత్తురేమో యని శంకించి కమల యటనుండిలేచి పాకశాలకడకేగి కూర్చుండెను. అంగణమున నొక్కప్రక్కఁ బాకశాలయుండెను. ఈయంగణ మునుండియే బయటకేగుమార్గ ముండెను. కమల శరీర మానంద ముచే రోమాంచితమయ్యెను. ఆమె తనలో 'నన్నుఁబోలినయభా గిని కిట్టిస్వామి!—వీరిరూపము దైవమునుబోలి యెంతప్రసన్నము గనున్నది! వీరినిఁ గేవలముగ దర్శించినమాత్రముననే నేఁటిపర్యం తము నేననుభవించినదుఃఖము లన్నియు నిర్మూలమైపోయినవి'' అని యనుకొనియెను. ఇవ్విధముగఁ దలపోయుచు నామె పలుమాఱుఁ బ్రణామములొనరించుచు దేవుని స్తుతింప సాగెను. ఇంతలో నెవ్వరో మేడపైనుండి దిగుచున్నట్టు లామెకుఁ దెలియవచ్చెను. తత్క్షణమే లేచి కమల యటనుండిపోయి తలుపుసందున నంధకార మున డాఁగెను. పనికత్తియ దీపమునుగొని ముందు నడచుచుండెను. ఆమె వెనువెంటఁ గమలనయనుఁ డేతెంచుచుండెను. అతఁ డామె దృష్టిపథమున కగపడకుండఁ బోయినపిమ్మటఁ గమల తనలో 'నాథా! ఈమీచరణసేవకురా లితరులయిండ్ల నూడిగమునొన రించి బ్రతుకుచున్నది. మీరింతసమీపమునుండి పోయినను మీరీ దాసిని గుర్తింపలేరైతిరికదా!' యనుకొనెను.

ముకుందబాబు భోజనము సేయఁబోవునపుడు కమల చావడి లోనికేగెను. కమలనయనుఁ డాసీనుఁడైయుండిన పీఠసమీపమున నేలపైఁ దలనిడి యామె యచటిధూళిని దనతలపై నిడుకొనియెను. సేవలొనరించుట కెట్టియాధారమును లభింపకుండుటచే నామెహృదయము భక్తిరసార్ద్రమయ్యెను.

ముకుందబాబుగారు దేహస్వాస్థ్యమునకై బశ్చిమదేశమునకుఁ బోవలసినదని డాక్టరుగారనినట్లు మఱునాఁడు కమలకుఁ దెలియ వచ్చెను. వెంటనే ప్రయాణసన్నాహములు చేయఁదొడఁగిరి.

కమల—(మహామాయకడకేగి) నేనీకాశిని వదలి వచ్చుదానను గాను.

"ఏమి? మేమందఱముఁబోవుచుండ నీవొక్కతె యెట్లిక్కడ నుందువు? నీకుఁ గాశిపై నెక్కుడుభక్తి కుదిరెనా యేమి?"

"మీరేమైననను(డు! నేనిక్కడ నేయుందును."

"కానీ! ఎట్లుందువో చూచెదను!"

"నాపైఁ గృపయుంపుడు! నన్ను మీతోఁ గొనిపోవలదు!"

"నీవెంతవగలాఁడివే! మాకుఁ గావలెనన్నప్పుడు మనుష్యులెట్లులభింతురు? అవశ్యముగ నిన్ను బిలిచికొనిపోవుదును."

కమల వేఁడుకోలు వమ్మయ్యెను. కమల తనగదిలోనికరిగి తలుపులుమూసికొని, పరమేశ్వరనామస్మరణ మొనరించుచుఁ గన్నీరు విడుచుచుండెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

---

### చక్రవర్తి యక్షయుల యాగమనము

ఘనానందబాబు నళినినిఁ గమలనయనునకిచ్చి వివాహము సేయువిషయము నామెతో ముచ్చటించిననాఁటిరాత్రి ఘనానందబాబుదరశూలలచే మిక్కిలి బాధపడుచుండెను. ఆ రేయంతయు మహాకష్టములతోఁ గడపెను. మఱునాఁటియుదయమునకు బాధయొకింత

తగ్గినందున నాతఁడు తన భవనమున కెదుటనున్న పుష్పవనము చెంత నొకకుర్చీపైఁ గూర్చుండియుండెను. నళిని యచ్చోటికే తేనీరు మొద లగునవి తెచ్చుచుండెను. దుఃఖపూరితమును, వ్యథావిష్టమునైన ఘనానందుని స్వరూపమును గాంచినచో నళినికి మర్మాంతికావేదన కలుగును. తాను కమలనయనుని వివాహమాడుట కొప్పకపోవుట చేతనే తండ్రికి దుఃఖముకలిగి యాదుఃఖమువలననే యాతనిరోగము ప్రబలమగుటకుఁ గారణమైనదని తలఁచి నళిని భరింపరానిదుఃఖము నకు లోనయ్యెను. ఇందున కేయుపాయ మాలోచింపవలయునో, తన వృద్ధజనకు నెవ్విధసమాధానపఱుపనగునో, యెంతయాలోచించిన నామె కేమియుఁదోఁచదయ్యెను.

• ఈసమయముననే చక్రవర్తి ద్వితీయుఁడై యక్షయకుమారుఁ డట కేతెంచెను. నళిని వెడలిపోవుటఁ గని యక్షయుఁ డామెతో "మీరొకింతసే పాఁగవలయును. వీరుగాజీపురవాస్తవ్యులు, సద్గృహ స్థులు; వీరినామము చక్రవర్తిగారు. వీరి నీదేశములలోని జనులెల్లరు నెఱుఁగుదురు. మీతో నేమియో మాటలాడవలెనను కోరికతో నిటకు విచ్చేసియున్నారు" అనియెను.

ఆ సమీపమునను యొక రాతియఱుఁగుండ దానిపై నక్షయ కుమారుఁడును జక్రవర్తియుఁ గూర్చుండిరి.

చక్రవర్తి—(ఘనానందునితో) రమేశబాబుగారికిని మీకు నత్యంతపరిచయము కలదని నేను వినుచున్నాను; కావున, నతని పత్నివిషయమై మీకేదేని దెలిసియున్న నాతోఁజెప్పుదురనుతలంపున నిట కేతెంచితిని.

ఘనానందబాబొకింత తడవు స్తబ్ధుఁడై యుండెను. పిమ్మట నాతఁ డాశ్చర్యచకితస్వరమున "ఏమనుచున్నారు? అతని పత్నియా" యనియెను.

నళిని తనచూపులను పృథ్విపైఁ బ్రసరించెను. చక్రవర్తియా మెనీక్షించి యిట్లనుడువఁ దొడఁగెను—"మీరు నన్నసభ్యునిఁగాఁ దలఁచి నాతో మాటలాడకున్నట్టు లగపడుచున్నది. తొలుత నామాటలన్నియు శాంతభావముతో విని తదనంతరము నా విషయమై మీరేమనుకొన్న ననుకొనుఁడు రమేశబాబు పత్నీసహితుఁడై నౌకా ప్రయాణము సేయుచుండినప్పుడు నాకు వారి పరిచయ మొదవెను. పిమ్మట గాజీపురమున నాయింటనే రమేశబాబు విడిసెను. కమలకును నాకుమారికకును దృఢమైత్రి కలిగెను. అనంతరము కొంత కాలమున కామె కేమయ్యెనో యెఱుఁగముగాని యామె యెవ్వరితోఁడను జెప్పకయే యెటకో పారిపోయినది. అనేక దుఃఖముల నే నోర్చియున్నాను. దానివలన నాహృదయము పాషాణమువలెఁ గఠోరమైయున్నది; కాని, కమలామూర్తి నాకన్నులనుండి యొక్కక్షణమైన దొలఁగుచుండలేదు;"

అని పలుకుచుండఁగనే చక్రవర్తి కన్ను లశ్రుపూరితములయ్యెను. ఘనానందబాబు వ్యగ్రుఁడై "ఆమె యెటకేగియుండును?" అని యడిగెను.

చక్రవర్తి—(అక్షయునితో) మీరెల్లయుదంతమును వినియున్నారుకదా! మీరే చెప్పుఁడు. నేను చెప్పలేను. నాహృదయము దగ్ధమగుచున్నది.

అక్షయకుమారుఁడు కమలారమేశుల యావద్వృత్తాంతమును నివేదించెను.

ఘనానంద—(విస్మితుఁడై) ఈ వృత్తాంతము పూర్వమెన్నఁడును మేమువినియుండలేదు. రమేశచంద్రుఁడు కలకత్తా వీడిపోవునప్పటినుండియు నాతనియొద్దనుండి యొక్కయుత్తరమైన రాలేదు.

అక్షయ—(అధికావేశముతో) అంతేకాదు; రమేశచంద్రుఁనకుఁ గమలయను పేరుగలభార్య యున్నదనియు మేమెన్నఁడు నెఱుఁ

గము, సరేకాని; చక్రవర్తిజీ! నేనిప్పుడడుగు ప్రశ్నకుత్తరమిండు; కమల రమేశునకుఁ బత్నియేనా? లేక వారి కితరబంధుత్వ మేదైన నుండెనా?

చక్రవర్తి—ఇదేమి! పిచ్చివారివలె మాటాడుచున్నారు? ఆమె యతనికి భార్య కాకున్న మఱెవ్వరు? ఆమెఁబోలిన సుశీలయగు పత్ని పృథ్వీతలమున నెందును లభింపఁజాలదు.

అక్షయ—అవును; మీరాగనునది వాస్తవమే. స్త్రీయెంతసచ్ఛీలయైయుండునో యంతియనాదరణ మామెకుఁ బతివలనఁ గలుగుచుండుట లోకమునఁ గనుచున్నారము. పరమేశ్వరుఁడు సజ్జనులకే కష్టములు కలిగించుచుండును.

అని యతఁడొక నిట్టూర్పు విడిచెను.

ఘనానంద—(తలపైఁ జేయిఁద్రిప్పికొనుచు) ఈవృత్తాంతము నిక్కముగ దుఃఖదాయకమనుట కావంతయైన శంక లేదు. కావలసిన దయినది. ఇఁకదీనికై శోకించిన నేమిప్రయోజనము?

అక్షయ—కమల యాత్మహత్య చేసికొనక కాశికి వచ్చియుండు ననునూహచే, నిచట నామెను వెదుక వచ్చుననునాసతో వీరి నిటకుఁ దోడితెచ్చితిని. మీలో నెవ్వరు నామె నెఱుఁగరని యిప్పుడు తెలియవచ్చెను. కావున, నాలుగుదినము లీపురముననె యుండి యామెను. వెదకవలయుననుచున్నాము.

ఘనానంద—రమేశబాబిపు డెచటనున్నాఁడు?

చక్రవర్తి—వారును మాకుఁ జెప్పకయే యెచటికో వెడలి పోయిరి'

అక్షయ—అతఁడు కలకత్తాకు వచ్చియుండెనని నాకు దెలియవచ్చెను. ఒకవేళ నాతఁడచటనే వకీలుగా నుండుననుకొనెదను.

మనుష్యులహృదయము మహాకఠినము; ఎంతటితీవ్రదుఃఖము నైన నోర్చుసామర్థ్యమందున్నది. ఏలయన, నూతనమగు నాశామూలమున బూర్వదుఃఖములను మనుజుఁడు మఱచుచున్నాడు. అందునను రమేశబాబు తరుణుఁడు. ఉండనిండు! చక్రవర్తిజీ! పదుండు

ఘనానంద—అక్షయబాబూ! మీరిందే విడియుదురుకదా?

అక్షయ—నేనది నిశ్చయముగఁ జెప్పలేను. నాహృదయము స్థిరముగా లేదు. నేను కాశిలో నెంతవఱకుందునో యంతవఱకును గమలను వెదకుచునేయుందును. ఎవరు చెప్పఁగలరు? ఉన్నవంశమునఁ బుట్టినబాలిక! దుఃఖమతిరేకమగుటచే సహింపలేక యిలువీడి యిక్కడకువచ్చి యున్నయామె యెంతటి తీవ్రదుఃఖములననుభవించుచున్నదో? రమేశబాబు నిశ్చింతుఁడై యుండఁగలఁడు; కాని, నేనుండలేను. నాచేనైనంతవఱకు నామెను శోధించి యామెజాడఁ గనుఁగొనకుండువాఁడనుగాను.

అక్షయచక్రవర్తి లటనుండి వెడలిపోయిరి. ఘనానందబాబుద్విగ్నహృదయముతో నొక్కమాఱు నళినివంకఁ జూచెను. నళిని యాత్మసంయమనమునుగావించుకొని కూర్చుండియుండెను. తనతండ్రి హృదయమునఁ దన్నుఁగూర్చినవిచారమే పీడించుచున్నదని నళినికిఁ దెలియవచ్చెను.

కొంతతడవునకుఁ బిమ్మట నామె 'బాబా! మీరొక్కమాఱు మీదేహమును డాక్టరుచేఁ బరీక్షచేయించుకొనుఁడు. మీయారోగ్యము దినదినముఁ జెడుచున్నది. ఇందునకేదైనఁ జికిత్సచేయవలయును' అనియెను.

నళినియాడినపలుకులచే ఘనానందబాబుగారికించుక శాంతి కలిగెను. రమేశచంద్రునకు సంబంధించిన గుప్తవిషయము లెన్నియో బయలుపడినను నామెకుఁ గష్టమేమియుఁ గలుగకుండుటచే

నాతనివంత దూరమయ్యెను. అతఁడు సంతుష్టుఁడై 'మంచిది; ఇప్పుడుతగిన చికిత్స చేయవలయును. నీవు సమ్మతించినచో నేఁడె కమలనయనబాబును పిలిపింతును' అనియెను.

ఇపుడు తండ్రిసమక్షమునఁ గమలనయనునితోఁ సరళరీతిఁ బ్రవర్తించుటఁ దగనిదని యామె తెలిసికొనెను. అట్లుండియు నామె తనసంకోచవృత్తిని బయటికిగపరుపకయే 'అందులకాటంకమేమి? వారినే పిలిపింపుఁడు' అనియెను.

నళినిహృదయము ప్రసన్నమైయుండుటఁగని తండ్రి "రమేశచంద్రుని యీవర్తనములు నీకు—' అనియేమో చెప్పఁబోవునంతలో నళిని యిట్లనియెను. 'బాబా! ఎండతీవ్రముగఁ గాయుచున్నది. లెండు; కచేరిచావడికేగి కూర్చుందము.'

కొలఁదిసేపటిలోనె కమలనయనబాబు బక్కడకు వచ్చెను. అతఁడు ఘనానందబాబు దేహమును జక్కఁగఁ బరీక్షించి నళినిని జూచి "వీరిహృదయమున నేదైన విచారము నెలకొనియుండునా?" యని యడిగెను.

"ఉండనోపు!"

"అట్లున్నయెడల శీఘ్రముగ వీరివిచారమును దొలఁగింపుఁడు మానసికసుఖమునకును శరీరస్వాస్థ్యమునకును దృఢసంబంధమున్నది. వీరిచిత్తము స్వస్థమయిననేగాని వీరి శరీరమునకు సుఖ మబ్బఁజాలదు. మాతల్లిగారికి నిదేవ్యాధి. నిన్నరాత్రియంతయు నామె యాలోచనాందోళితహృదయయై గూర్చుండియే గడపెను. ఆమె కౌషధములచే నెట్లు స్వస్థత కాఁగలదు!

"మీదేహస్థితియు నేఁడెప్పటివలె నగపడుట లేదు."

"నాస్థితి బాగుగనేయున్నది. నిన్నటిరాత్రి యించుక జాగరణము చేసినందున నాముఖమొకింత వాడియుండఁబోలును! ఇంతియే"

"మీతల్లిగారి సేవలకై యనవరతము నామెకడ నొకస్త్రీ యుండుటావశ్యకము. మీరునొక్కరే! మీకు నెన్నియో పనులుండును!"

ఈపైమాటలు నళిని సరళహృదయముతోఁ బలికెను. కాని, యీపలుకు లామెనోట వెలువడినతత్క్షణమే యామెకు సిగ్గుకలిగెను. నాపలుకుల కీకమలనయనబాబు బెట్టియర్థముఁ గల్పించునోకదా! యని యామె చింతించెను. లజ్జాపూరిత మగునళిని వదనముఁగాంచుటచేఁ గమలనయనబాబున కాతనితల్లి జ్ఞప్తికివచ్చెను.

నళిని—(ఆత్మసంయమనముఁ గావించుకొని) మీ కామెకడ నొకదాసి నుంచరేమి ?

"నాకు నట్టియభిప్రాయమే యున్నది. కాని, యమ్మయిందులకు సమ్మతించుటలేదు, పట్టణములలోని పనికత్తెల కాచారవిచారములసంగతి యేమియుఁ దెలియదని యమ్మ యభిప్రాయము."

అనంతర మొకింతతడ వెవ్వరు నేమియుఁ బలుకరైరి. తుదకు నళిని "మీరుపదేశించినట్లు వర్తించుట మిగులఁ గష్టము! మధ్య నేదైన విఘ్నము కలుగుచుండును. నాహృదయమునకు నిశ్చలమగు శాంతి యెప్పుడు లభించునోకదాయని నేనాలోచించుచున్నదానను" అనియెను.

"ఇటువినుము; విఘ్నములెల్ల వారికిని దటస్థించునవియే. ఆవిఘ్నముల కంజక యదుండి నిశ్చలచిత్తముతో బయల్పడువారే ధన్యులగుదురు. మీరింతలోనె హతాశులుకాఁగూడదు. ఎన్నఁటికైన మీయభీష్టము సిద్ధింపకమానదు."

"రేపటి యుదయమున మరల మీరిక్కడకు రాఁగలరా? మీ సహవాసమున నాకు శాంతి లాభము కలుగుచున్నది."

కమలనయనుని ముఖముపైఁ జిత్రితమయియున్న శాంతభావముఁగని నళినిసంతుష్టయయ్యెను. అతఁడు వెడలిపోయెను. నళిని గృహ బహిరంగణమున నిలిచి తోఁటలోని వికసిత పుష్పలతాదుల వంక నీక్షించుచుండెను. ఆమెమనసున ననేక విధములగు నాలోచన లుద్భవించుచుండెను. ఆతరుణి కమలనయనుని జననివిషయమై యాలోచింపసాగెను. కల్యాణీబాయి కారేయంతయు నేఁటికి నిద్దుర పట్టలేదో, ఆమె నెట్టివిచారము బాధించుచుండెనో, సర్వము నళినికిఁ దెలియవచ్చెను. కమలనయనుని వివాహవిషయ మామెను బాధించుచుండవచ్చును; మఱిరెండవది; తనయనంతరర మాతని కెవఁడునిక్కా! ఒకవేళ నాతఁడు సన్యాసమును స్వీకరించునేమోయను విచారము నామె మనసున బాధించుచుండనోపును!

నేఁటియుదయమున రమేచంద్రునియుదంతమంతయు విని యామె తనహృదయమున నొకవిధమగుతీవ్రవేదన ననుభవించుచుండెను. ఆవేదనావేగమును గప్పిపుచ్చుటకై యామె తనమానసికబలమంతయు వినియోగింపవలసివచ్చెను. రమేశచంద్రునకు సంబంధించినవిషయమునుగూర్చినవిచారము మనసునకుఁ దెచ్చికొనుటయు నామెకు లజ్జాస్పదముగ నుండెను. కాని, యతనిపై దోషారోపణమొనరించుట కామె సాహసింపదు. ఆవిచారమే మనసునకుఁ దెచ్చికొనఁగూడదని యామెయిచ్ఛగించియుండెను. కాని, నడుమ కమల యాత్మహత్యగావించుకొనుట యామెకు జ్ఞప్తికివచ్చుటచే నామెసర్వాంగమును గగుర్పాటొందెను. ఈహతభాగిని యాత్మహత్యకును నాకు నెట్టిసంబంధమును లేదుకదా, యనునూహ యామెడెందమున నుద్భవించెను. ఆవెంటనే యామెహృదయము లజ్జాఖేదదయాదులచే వ్యాకులమయ్యెను. ఆమెకరద్వయముముకుళించి గద్గదస్వరముతోఁ బరమేశ్వరు నీవిధముగా నుతించెను. "హే!

ప్రభో! నేనేయపరాధముఁజేసియెఱుఁగను. ఇట్టియెడ నాకీదశయెందులకు? ఈసంసారమున శాంతిసౌఖ్యములు నాకు లభించుట యసంభవమేనా!"

కమల రమేశులవృత్తాంతమంతయు నాలకించుటచే నళినిహృదయ మెంతవఱకుమాఱియుండెనో తెలిసికొనవలెనని ఘనానందునకుఁ గోరికపుట్టెను; కాని, విస్పష్టముగా నామెనడుగుట కాతనికి ధైర్యము కలుగదయ్యెను. నళిని కచేరీచావడిలోఁ గూర్చుండి కుట్టుపనులుసేయుచుండ నెన్నిమాఱులో ఘనానందుఁ డచటికేగి యామె చింతాతురముఖము నీక్షించి యటనుండమనసొప్పక మగిడిపోయెను. ఆనాఁటిసాయంతమయమున డాక్టరిచ్చినమందును దండ్రికొసఁగుచు నళిని "నేఁటియుదయ మిక్కడకేతెంచినవృద్ధుఁడు సజ్జనునివలెఁ గాన్పించుచున్నాడు" అనియెను.

నళిని మఱేమియుఁబలుకలేదు. ఘనానందుఁడు నధికప్రస్తావన మునేయలేదు; అతఁడు "రమేశచంద్రునివిషయమై యాతఁడు చెప్పిన వృత్తాంతమునాకత్యంతాశ్చర్యమునుగలిగించుచున్నది అతనివిషయమై లోకులేమనుకొన్న ననుకొందురుగాక! నేనుమాత్రమింతవఱకు నెవ్వరి పలుకులయందును విశ్వాస ముంపనైతిని. నేఁడు మాత్రము—

నళిని—(గంభీరస్వరమున) బాబా! ఈవిషయమైనచర్చ లిఁక మానుడు!

"చర్చించుట నాయభిమతము కాదు. కాని, దైవవశమున నొకనితో మనసుఖదుఃఖములసంబంధము కలుగనున్నప్పు డాతనివర్తనములయెడ నుపేక్షాభావమువహించుట తగనిపని."

"కాదు మనసుఖసంబంధము లిట్టిరీతిని మీకిచ్చవచ్చినట్టులదుకుట యసంగతము—అశక్యము—అనావశ్యకము! నాకై వ్యర్థముగఁ జింతింపఁబనిలేదు."

"తల్లీ! నాజీవితనౌక యిప్పుడు సంసారసముద్రతీరము నకు వచ్చి చేరియున్నది. కావున, నీభావివివాహస్థానము స్థిరమగునంతవఱకు నాకు సమాధానము కాఁజాలదు. ఏన్నివిధముగ సంసారవిరక్తుగనే దపస్వినిగనే యీలోకమునవిడిచి నేను పరలోకమున కేగవలసి వచ్చునేమో యనివిచారించుచున్నాఁడను."

నలిని స్తబ్ధయై యుండెను. ఘనానందబాబు మరలఁబలుకఁ దొడఁగెను. "ఇటువినుడుము! నలినీ! సంసారమున నేదోయొకయాశ విఫల మయినంత మాత్రమున సర్వమును బరిత్యజించుట యుచితము కాదు. నీ వెట్లుసుఖించుదువో, నీజీవనము దేంచే సాఫల్యమగునో యనునీవంతయే యహోరాత్రములు నామనసున వసించుచున్నది. నీకెందునఁ గళ్యాణమగునో నాకుఁ దెలయును. నాపలుకులను నీవు నిరాకరింపకుము.'

నళినినేత్రము లశ్రుపూరితములయ్యెను. ఆమె 'మీరిట్టిపలుకుల నుచ్చరింపవలదు. నేనెన్నఁడు మీయాజ్ఞ జవదాఁటుదానఁగాను నాకాజ్ఞాపింపుఁడు; నేను మౌనముతో శిరసావహింతును'' అనియెను.

ఘనానందబాబు తలపైఁ జేయిఁద్రిప్పఁదొడఁగెను. అతఁడు మఱేమియుఁ బలుకలేదు. మఱునాఁటి యుదయమున ఘనానందబాబు నళినీసహితుఁడై యుద్యానమున నొక్కవృక్షచ్ఛాయఁ గూరుచుండి తేనీరుద్రాగుచుండెను. అప్పు డక్షయకుమారుఁ డటకేతెంచెను. ఘనానందుఁ డాతని మోమువంక నీక్షింపసాగెను. కాని ఇంకను నేజాడయుఁ బొడగట్టలే'' దనిమాత్రమువచించి యక్షయుడు తేనీరుద్రాగఁ దొడఁగెను.

మెల్లమెల్లగ సంభాషణము ప్రారంభమయ్యెను. అక్షయకుమారుఁడు—'రమేశబాబు సామానులన్నియుఁ జక్రవర్తిగారియింటనున్నవి. వాని నెక్కడకంపవచ్చునాయని యతఁ డాలోచించు

చుచున్నాఁడు. రమేశబాబెప్పుడైనను మీకడకు వచ్చువాఁడే. కావున నాతని సామానులన్నియు మీయొద్దకుఁ బంపినచో—

అని చెప్పునంతలో ఘనానందబాబడ్డముగవచ్చి కోపస్వరమున 'అక్షయకుమారా! నీకు వ్యవహారజ్ఞాన మావంతయు లేదు. రమేశ బాబు నాగృహమునకే యేటికివచ్చును? ఏమని నేనాతని సామాను లన్నిఁటిని నాయింటనుంచుకొందును?' అనియెను;

'మీకేమిశోఁచినఁ దోఁపసిండు; కాని, రమేశబాబు నేఁడు శోకదగ్ధహృదయుఁడై యుండవచ్చును; ఆతనిని సాంత్వన మొనర్చుట మిత్రులకుఁ గర్తవ్యమని నేను భావించెదను. ఇట్టిస్థితిలో నాతని మీరు పూర్తిగాఁ ద్యజింతురా యేమి?'

"మమ్ము మరింతదుఃఖపెట్టుటకై మాటిమాటికిని నీవిట్లు పలుకుచున్నావు. నేను నీకుఁ జేతులుజోడించి విన్నవించుచున్నాను; ఈవిషయమునుగూర్చి మరల నాముందుఁ బ్రస్తావింపకుము."

నళిని—(కోమలస్వరమున) బాబా! మీరు కోపింపకుఁడు. అందువలన మీస్వాస్థ్యము చెడఁగలదు, అక్షయకుమారునిఁ దనకిష్ట మువచ్చినట్లు పలుకనిండు; అందువలన మీకేమినష్టముకలుగఁ గలదు?'

'క్షమింపుఁడు!' నాపలుకులవలన మీకింతకోపమువచ్చునని నేననుకొననైతిని.'

అనిపలికి యక్షయుఁ డటనుండి వెడలిపోయెను;

---

## ఇరువదిరెండవ ప్రకరణము

---

### పిట్ట యెగిరిపోయెను!

కాశి వీడి సకుటుంబముగ మీరతునకుఁ బోవుటకు ముకుంద బాబు నిశ్చయించెను. ప్రవాసమున కన్నియు సంసిద్ధపఱచిరి. మఱు

నాఁడుదయమునఁ బ్రయాణము. ఈ యవధిలోఁ బ్రయాణమున కేదైన నొకవిఘ్నము కలుగఁగలదని కమల యనుకొని యుండెను; కాని, యాతలంపు వ్యర్థమయ్యెను. ఈతలపునకుఁ దోడుగఁ గమల నయనబాబు రోగిలిఁ జూచుటకై వచ్చునని యనుకొనియుండెను; అదియు నిష్ఫలమయ్యెను.

అన్నియు సంసిద్ధపఱచు సందర్భమున గమల యెటకేని పారి పోవునేమో యనుభీతిచే మహామాయ దగ్గఱనేయుండి యెల్లసామానులును గమలచేతనే మూటలుకట్టించుచుండెను.

రాత్రి యేదైన నొక భయంకరమగువ్యాధి తనకు సంభవించిన బాగుగనుండునుగదా, అందువలననైన మహామాయ తన్నిటడించి పోవునుగదా యని కమల మనఃపూర్వకముగ నువ్విళులూరుచుండెను; ఇంతియే కాదు; తనకు సంభవింపఁగల రోగమునకుఁ జికిత్ససేయుట కేడాక్టరును రప్పించుటయు నామె యప్పుడే నిశ్చయించివేసెను; ఆవ్యాధిమూలమునఁ దనకు మృత్యువాసన్నమైనను మేలే! కాని, యాసత్పురుషుని చరణరజముఁ దన మస్తకమున నిడుకొన నలభించినపిమ్మటఁ దనకు సుఖమరణ మాసన్నము కావలయునని యామె మహదభీష్టము.

ఆరేయి మహామాయ కమలను దన శయనగృహమునఁ బరుండఁబెట్టుకొనెను. స్టేషనునకుఁబోవునప్పు డామె తనబండిలోఁ గమల నెక్కించికొనెను. తుదకు రైలుబండి స్టేషనువిడిచి నడువఁదొడఁగినపుడు మహామాయ నిశ్చింతాత్మ యయ్యెను.

మదోన్మత్తమగు నొకకుంభీంద్ర మేవిధముగాఁ దనతొండమున నొకనవపల్లవలతను ధరించి పరుగిడునో, యవ్విధముగాఁ బొగబండియుఁ గమలను దనలో వైచికొని భగ్ భగ్ మను ధ్వనితో బయలుదేరెను. కమల కిటికీగుండ దృష్టితనేత్రములతో నటునిటు గాంచు

చుండెను. వంతెనపై బండి పోవునప్పుడే కమల తుదిసారి కాశీక్షేత్రమును దర్శించెను. ఇంతవిశాలపట్టణమునఁ గమలనయన బాబుగృహమేనైపుననుండునదియు నామెకుఁ దెలియదు. ఈకారణముననే ధూమశకట మహావేగమూలమున నదీఘట్టములు, మందిరములు మేడలు మొదలగునవన్నియుఁ గమలకుఁ గమలనయన మయముగ భాసిల్లుచుండెను.

మహామాయ—ఏమింతగాఁ గిటికీమార్గమున నెట్టివింతలఁ జూచుచున్నావు? నీవొక విహంగమవు కావు; నీకు పక్షములు లేవు వానిసాహాయ్యమున నెగిరిపోవుటకు?

కాశీక్షేత్రము కన్నులకగపడకుండఁ బోయెను; గాని, యేస్థల మామెహృదయమునఁ జిత్రితమయి యుండెనో యది యామె హృదయమున స్థిరముగ నెలకొనియుండెను. అది యామెదృష్టిలోనుండి తొలఁగుట యశక్యముగ నుండెను. ఇంతలో నాధూమశకటము మొగలసరాయిస్టేషనునొద్ద నిలిచెను. స్టేషనులో జనసముదాయము మిక్కుటముగ నుండెను; కమలదృష్టి యెంతమాత్రము నటునైపున నుండలేదు; ఆమె యొకానొక యంత్రచలిత ప్రతిమవలె నాబండి దిగి మహామాయవెంట మఱియొకబండిలో నెక్కెను. బండి బయలు దేఱుటకొఱకు తుదిసారిగంట మ్రోగించిరి. బండికదలుట కొంత ముందుగ నొకపరిచితకంఠస్వరము విని కమల యులికిపడెను. అల్ప దూరముననుండి యెవరో "అమ్మా!" యని పిలిచిరి. కమల యొకింత వంగి యాజనసమూహమువంకఁ గాంచెను; ఉమేశు డానైపున నుండుట యామెకుఁ గనఁబడెను.

కమల ముఖకమల మానందప్రఫుల్లమయ్యెను; "ఉమేశా" యని యామె సహర్షస్వరముతో బిలిచెను.

ఉమేశుఁ జేతెంచి బండితలుపుఁ దెఱచెను; కమల తటాలునఁ

గ్రిందికి దుమికెను. ఉమేశుఁ డామె పాదములపైఁ దలనిడెను. ఆమె దేహమంతయు నానందముతోఁ బులకితమయ్యెను. అంతలోనే యొకపోర్టరు వచ్చి యాబండితలుపు బిగించెను. మహామాయ బిగ్గఁ గా నఱవఁదొడఁగెనుఁ "ఓసీ కమలా! నీవేమచేయుచున్నావే? బండి కదలుచున్నది; త్వరగా బండి నెక్కుము రా; లోనికిరమ్ము! ఇఁక నవకాశము లేదు; ఎంతసేపటినుండి కేకలిడుచున్నాను; మాఱుపలుకనైనఁ బలుకవేమే?' అనియెను.

మహామాయపిలుపులు కమలకు వినఁబడలేదు. ఈలవేసి శకటము భగ్ భగ్ మను ధ్వనితో స్టేషనువీడెను. మహామాయ చేతులు నలుపుకొనుచు నట్టులే కూర్చుండియుండెను. ఆమెచేతిలోని పట్టు రొట్టెజారిపోయెను!

కమల—(ఉమేశునితో) నీవెక్కడనుండి వచ్చుచున్నావు?

ఉమేశ—గాజిపురమునుండి.

కమల—అచ్చటివారందఱకును గుశలమా?

ఉమేశ— ఆఁ

కమల— అన్నపూర్ణ యేమిచేయుచున్నది?

ఉమేశ—ఆమెమాట యెందులకత్తదవు! ఆమె రేయుంబవలు నీకై యేడ్చుచునే యున్నది.

కమలనేత్రద్వయ మశ్రుపూరితమయ్యెను. ఆమె మరలఁ బ్రశ్నించెను.

'ఉమ తనపిన్నిని మఱచిపోలేదుకదా?'

'నీవాబాలికకిచ్చినసువర్ణకంకణములు చేతికిఁ దొడిగిననే కాని యది పాలుఁ ద్రాగదు; పిన్ని యెక్కడకేగినదని యాపాప యడిగినచోఁ దల్లికేఁ గన్నులనిండ నీరు వచ్చుచున్నది.'

'నీవిక్కడ కేలవచ్చితివి?'

'గాజీపురమున నుండుటకు నామనసొప్పక నేనిక్కడకు వచ్చితిని.'

'ఇప్పు డెక్కడ కేగుచున్నావు?'

'మీరెక్కడకో నేను నక్కడకే!'

'నాయొద్ద నొకదమ్మిడియు లేదే!'

'కావలసినంత నాయొద్ద నున్నది.'

'నీ కెక్కడిది?'

'నాఁడు నీవు నా కిచ్చిన యైదు రూపాయలలోనివి మిగిలి యున్నవి.'

అని వచించి వాఁడు తనయొద్దనున్నపైక మామె చేత నిడెను.

కమల—మంచిదే! మనము కాశి పోవుదము, నీవు టిక్కెట్టు గొని తెత్తువుకాదా?

ఉమేశ—'ఆఁ అమ్మా!' యని పలికి వాఁడు పోయి కాశికి రెండుటిక్కెట్టులను గొనితెచ్చెను. ఉమేశుఁడు కమలను స్త్రీలబండిలో నెక్కించి 'నేనిప్రక్కబండిలో నెక్కెదను' అనియెను.

కాశీస్టేషను జేరినపిమ్మటఁ గమల "ఇప్పు డెక్కడ కేగుదము?" అని యుమేశు నడిగెను.

'అమ్మా! నీవనుమానింపకుము. నిన్నొకయుత్తమస్థలమునకు దీసికొనిపోదును.'

'నీకీయూర నేమితెలియునని యింత గర్వించుచున్నావు?'

'నాకన్నియుఁ దెలియును. మీ కప్పుడే తెలియఁగలదుకదా!' అనివచించి యుమేశుఁ డొకగుఱ్ఱపుబండి నద్దెకుఁ గుదిర్చి యామె నందెక్కించి వాఁడును బండిపైఁగూర్చుండెను. బండి యొకయింటికడ నిలిచెను అప్పుడు రమేశుఁడు "అమ్మా! మనము దిగవలసిన దిక్కడనే!" యనియెను.

కమల బండిలోనుండి దిగి యుమేశునివెను వెంట నాగృహమున కేగెను. ఉమేశుఁడు "కళ్యా—!" యని పిలిచెను.

ఎవరో లోపలినుండి—ఎవరు? ఉమేశా! నీవెక్కడనుండి వచ్చుచున్నావురా?" అనిరి.

చక్రవర్తిజీ బయటకి వచ్చిరి. ఉమేశుఁ డాతని నీక్షించి యూరక నవ్వ నారంభించెను. కమల యాశ్చర్యచకితయై చక్రవర్తిగారికిఁ బ్రణామముసేసెను. చక్రవర్తినోట మాట వెడలదయ్యెను ఏమి చేయవలయునో యేమిమాటలాడవలయునో యతనికిఁ దోచదయ్యెను. తుద కాతఁడు గద్గదికస్వరముతోఁ "కమలా! వచ్చితివానీవు? రా, పైకిరమ్ము అన్నపూర్ణా! ఇదిగో వచ్చినవా రెవరో చూడుము!" అనియెను.

అన్నపూర్ణ యాత్రముతో మేడమెట్లుదగ్గఱకు వచ్చి నిలిచెను. కమల యామెపదములపైఁ బ్రాలెను అన్నపూర్ణ యామెనెత్తి గాఢాలింగన మొనర్చుకొనెను. కొంతసేపటివఱకు నిరువురును ప్రేమవిహ్వలభావమున స్తబ్ధులైనిలిచిరి.

అన్నపూర్ణ—(అశ్రుపూర్ణనేత్రములతో)మమ్మెందఱ దుఃఖమునముంచి యాకస్మికముగ నీవేలవెడలిపోతివే? ఎవ్వరైన నిటు సేయుదురా?

చక్రవర్తి—అన్నపూర్ణా! అవన్నియుఁ దరువాత మాటలాడవచ్చునుకాని, తొలుత నామెకుఁ జేతులు కాళ్లుఁగడుగనిచ్చి యేమైన నాహారమిమ్ము.

ఆక్షణముననె "పిన్నీ! పిన్నీ!" యని కేకలు వేయుచుఁ జేతులు రెండును సాచి యుమ కమలకడ కేతెంచెను. తక్షణమే కమల యాపసిపాపను జంకనెత్తుకొని సూరాఱుముద్దులచే నాబాలముఖ

మంతయుఁ గప్పివేసెను. కమలధరించియున్నమలినవస్త్రమును, చెదరియున్నకేశపాశమును గని యన్నపూర్ణ జాలిపడెను. తత్క్షణమే యామె కమలను స్నానగృహమునకుఁ దోడ్కొనిపోయి స్నానమాడించి, తనవస్త్రములలో నొకయమూల్యవస్త్రము నామెకుఁ గట్టిచ్చెను. ఆమె "కమలా! నిన్నటిరేయి నీకుఁ జక్కఁగనిద్దురపట్టలేదు కాఁబోలును! నీవు నాశయ్యపైఁబరుండి విశ్రమింపుము. వంటసిద్ధమైనవెంటనే నేను వచ్చి నిన్ను మేల్కొల్పెదను" అనియెను.

"అఁహా! నేను నీతోఁ బాకశాలలోనికి వత్తును."

చక్రవర్తిగారు తమయనుమాయసితోఁ గాశీనగరమునకుఁ బ్రయాణమగునపు డన్నపూర్ణ "నేను మీతో వత్తు" నని పట్టుబట్టెను. ఇప్పుడావిపినబాబునకు సెలవులేదని చక్రవర్తిగా రన్నపూర్ణతో ననిరి; కాని, యాపలుకులయెడ నామె లక్ష్యముంచలేదు. చక్రవర్తి యింక నేమిచేయఁగలఁడు? అతఁ డన్నపూర్ణతోఁ గాశికి బయలుదేరెను. వారు కాశీస్టేషనులో దిగి చూడ నాబండిలోనుండి యుమేశుఁడును దిగుచుండెను. "నీవెక్కడకురా?" యని చక్రవర్తిగారు వానిని బ్రశ్నించిరి; అందులకు వాఁడు "మీరెక్కడకుఁ బ్రయాణమైతిరో నేను నక్కడకే" యని ప్రత్యుత్తరమొసఁగెను. కాని, యింటఁ బనిపాట లొనర్చుటకై వానినుంచియుండఁగా వాడట నుండక వెడలివచ్చుటచేఁ దనభార్య కోపించునేమో యనుభీతిచేఁ జక్రవర్తిగా రుమేశుని మరల గాజీపురమునకుఁ బంపివేసెను. కాని, యటనుండుటకు వానికి మనసొప్పలేదు. హరిభామిని బజారునుండి యేవోసామగ్రులు తెమ్మని పైకమిచ్చి వానిని బజారున కంపెను; ఆ పైకముఁ దీసికొని వాఁడు కాశీపురమునకు బయలుదేరెను. పైకముతో వాఁడు పారిపోయె నని హరిభామిని తలఁచెను. "మంచిదే యయ్యెను! ఇంతటితోనే పోయెను! లేకపోయిన నేదైన నమూల్యా

లంకారమును దొంగిలించుకొని పోయియుండును!" అని హరిభామిని తనలో ననుకొనెను.

---

## ఇరువదిమూడవ ప్రకరణము

---

### సాహోల్లక్ష్మిరమే.

కమల రాఁ తెంచినపిదప నక్షయకుమారుఁడు చక్రవర్తిగారిని దర్శింపనేతెంచియుండెను, కాని, చక్రవర్తి వానితో కమలయాగ మనవిషయ మేమియుఁ జెప్పలేదు. రమేశచంద్రున కక్షయుఁడు మిత్రుఁడు కాడని చక్రవర్తికిఁ దెలియవచ్చెను. రాత్రి యన్నపూర్ణ కమలనుదన చెంతఁ బరుండఁబెట్టుకొని యామెవీపుపైఁ బ్రేమతోఁ జేయి వేసెను. ఆమె యాకోమలహస్తస్పర్శము శబ్దరహితప్రశ్నవలె గమలయొక్క రహస్యవేదనా విషయమై తెలియఁగోరుచుండెనో యను నట్లుండెను!

కమల—అన్నపూర్ణా? మీరెల్లరు నావిషయమై యేమను కొనియుంటిరి? నాపై మిక్కిలి కోపించియుందురుకదా!

"ఏమి? మాకింతమాత్రము తెలియదా! సంసారమున నీకు జక్కనిత్రోవ తెరవఁబడియుండినయెడల నీవీరీతి నెన్నఁడైనఁ బలాయనమయియుండవనుసంగతి మేము తెలిసికొనఁజాలమా? ఈశ్వరుఁడు నీకిట్టికష్టములు కల్పించుచున్నాఁడని యందులకే మేము వగచుచున్నాము."

'నాయుదంత మాద్యంతమును వినియెదవా?'

'వినకేమి?'

'అప్పుడు సర్వమును నీతో నేల చెప్పనైతినో యెఱుఁగను. అపుడు నాచిత్త మస్థిరమయి యుండెను. యోచించుశక్తియు నాహృదయమున లేదు. నామస్తకముపై దుఃఖపర్వతము వ్రాలియుండెను; అందువలనను, లజ్జామూలమునను నాముఖ మెవరియెదుటను గనఁబఱుప నాకు సాహసము కలుగ లేదు. నాకుఁ దల్లి లేదు. తోఁబుట్టువులు లేరు; నాకన్నియు నీవే! కావున, నాహృదయము విప్పి యేమియు డాఁపక సకలము నీకు నివేదించెదను. లేకున్న నాచరిత్ర మితరు లెవరి సమక్షమునను జెప్పఁదగినది కాదు.'

ఇట్లు గమల శయ్యపైఁ బరుండఁజాలక పోయెను; లేచి కూర్చుండెను. అన్నపూర్ణయు లేచి కూర్చుండి మనఃపూర్వకముగ నాకర్ణింపఁదొడఁగెను. కమల తనకు వివాహమైన నాఁటి యిప్పటి వఱకు ఘటిల్లిన విషయములన్నియు సవిస్తరముగ నుడివెను. వివాహ సమయమునఁ దాను బతిముఖము నవలోకింప లేదని కమల నుడివినపు డన్నపూర్ణ "నీయట్టిమూర్ఖురాలిని నే నెందును గానను నాకు వివాహమయినప్పుడు నేను నీకన్నఁ జిన్నదాననై యుంటిని కాని, జనుల కనుమొఱఁగి రెండుమూఁడుమాఱులైనఁ బతిముఖము నోరకంటఁ గాంచియున్నట్లు నాకిప్పటికిని జక్కఁగ జ్ఞప్తియున్నది." అనియెను.

కమల—నేను పెద్దదాననై యున్నందున నాచెలికత్తియ లెల్లను నన్నుపహసించి పోటుమాట లనుచుండిరి. ఇట్టివి సంభవింప వీలుకలుగఁ జేసినట్లుగనే నావివాహము నిశ్చయింపఁబడెను. అప్పుడు వరుఁడు లభించెనని నాకు గర్వములేదని కనఁబఱచుటకై నేను దృష్టిని పైకి నిగిడింపకయే, పతిముఖముఁ గాంచక యుంటిని.

అనంతర మొక్కింతతడ వూరకుండి మరలఁ గమల పలుకఁ దొడఁగెను.

'వివాహానంతరము మేమిరువురము నెట్లు నావపైఁ బ్రయాణమైతిమో, యెట్లు నావ మునిఁగెనో, పిమ్మట మేమిరువురము నెట్లు బ్రతికితిమో, నీకు మొదటనే చెప్పియున్నాను. అపుడు నాకుఁ దెలియలేదుగాని, నేను మృత్యుముఖము నుండి వెలువడి యెవరిపజ్జఁ జేరితినో యతఁడు నాపతి కాఁడు! అతఁడే నాపతి యని నేనెంచి యుంటిని!'

అన్నపూర్ణ—(ఆశ్చర్యముతో) అయ్యో, దైవమా! ఏమి యీవిడంబనము! ఇప్పు డన్నియు నాకుఁ దెలియవచ్చెను. జగమున నిట్టివిచిత్రము ఘటించునా?'

'అన్నపూర్ణా! నేను మరణించియుండిన బాగుగనుండును జుమా! విధాత నన్నిట్టిదుఃఖసాగరమున నేఁటికిఁద్రోసెనో యెవరెఱుఁగుదురు?'

'ఈవృత్తాంతములేవియు రమేశబాబెఱుఁగడా?'

'వివాహానంతర మొకకొన్నిదినముల కొకనాఁడాతఁడు నన్ను 'సుశీలా!' యని పిలిచెను. అందున నేను 'నాపేరు సుశీల కానప్పుడు, నన్నేల 'సుశీలా' 'యని పిలిచెద' రని యడిగితిని. ఆనాఁడే యతఁడు నిజము తెలిసికొనియెను. కాని, నాకుమాత్రము లేశమును సంశయము కలుగలేదు. ఆహా! అప్పటియావిషయము జ్ఞప్తికివచ్చిన నేనిప్పటికిని లజ్జచే భస్మమగుచున్నాను.'

అన్నపూర్ణ కమలవృత్తాంతమంతయు నామెవలన నెఱింగెను. అటుపిమ్మట నామె' కమలా! ఇది నీసురదృష్టమే సుమా! అందునను నీయదృష్టము సౌభాగ్యమైనదగుటచేతనే రమేశచంద్రు నియట్టిసజ్జనునిపంచఁ జేరితివి. మఱి యితరులెవరిహస్తముననైనఁ జిక్కియుండినచో నీవుద్ధరింపఁబడుట యశక్యమయియుండును. రమేశచంద్రునిశోచనీయస్థితి మనసునకుఁ దోఁచినప్పుడ నాకెంతయో

వంత యగుచుండును. కానిమ్ము! ఇప్పుడు రాత్రిచాలఁ గడచినది. నీవు నిదురింపుము! ఇఁకముందేమిచేయఁదగునో, రేపాలోచింతము!' అనియెను.

రమేశబాబు నళినికివ్రాసినయుత్తరముఁ గమల జాగ్రతగా డాచియుంచెను. మఱునాఁ డన్నపూర్ణ యాయుత్తరము చక్రవర్తి చేతికిచ్చెను. ఆతఁ డాయుత్తరము నాద్యంతముంజదివి 'కర్మణో గహనాగతిః' ఇఁక నేమిసేయవలయు?' నని ప్రశ్నించెను.

అన్నపూర్ణ—ఉమ చాలకాలమునుండి జబ్బుగానున్నది. ఒకసారి కమలనయనబాబును బిలిపింపుఁడు! ఉమ కాతనిచేఁ జికిత్స సేయింతము.

కమలనయనుఁ డా బాలికను జూడవచ్చెను. అన్నపూర్ణకమలతో 'త్వరగ బయటికి రమ్ము! ఎవరువచ్చిరోచూతువుగాని!' అనియెను.

మహామాయగృహమునుండు నప్పుడు కమలనయునిఁజూడ నుత్కంఠితయై యున్నకమల నేఁడు సిగ్గుచే గదివెలుపలికి రాలేక పోయెను.

అన్నపూర్ణ—నిన్నీస్థితిలో దీర్ఘకాలము నేనుంచుదానఁగాను. ఉమ నిశ్చయముగ వ్యాధిగ్రస్తయై యుండలేదు. డాక్టరింతలో వెడలిపోవును. నిన్నిట్లు బ్రతిమాలుటలోనే యింత యాలస్యముచేసిన నీవాయన నెట్లుచూడఁగలవు!'' అని అన్నపూర్ణ బలవంతముగఁ గమల చేతిని బట్టుకొని ద్వారమువఱకు నామెను దీసికొనివచ్చెను. ఉమ వీపును, గుండియను బరీక్షించి యౌషధముఁ బంపెదనని చెప్పి డాక్టరు వెడలిపోయెను.

అన్నపూర్ణ—దైవము నిన్నింతటి కష్టముల పాలుచేసినను నీభాగ్యము సౌభాగ్యమేయగుటకు సంశయములేదు. ఇఁక రెండు

మూఁడు దినములైన నీస్వర్ధైర్యముతో నుండవలయును. మేము సర్వ మును జక్కఁబఱచెదము. అంతదనుక డాక్టరను దినము నునునుజూడ వచ్చుచుండును. ఇట్లొనముగనే ప్రతిదినము నీకాతని దర్శనము లభించును.

చక్రవర్తి యొకనాఁడు కమలనయనబాబు గృహమునకేగఁగా నాతఁడింట లేఁడని సేవకుఁడు చెప్పెను. అపుడు చక్రవర్తి 'వారు లేకున్న నేమి? వారితల్లిగారున్నారుకదా? వృద్ధబ్రాహ్మణుఁ డొకఁడు మీదర్శనమునకై వచ్చియున్నాఁడని యామెతో వచింపుము' అని యెను. సేవకుఁడాతనిఁ గల్యాణీబాయి సన్నిధికిఁ దోడ్కొనిపోయెను. చక్రవర్తి వినయపూర్వకముగా 'చిరంజీవులగొుక్కయు మీయొక్కయు సేవలు కాశీలోఁ బ్రసిద్ధములుగా నున్నవి. కావున, మీదర్శన మునుబడసి కృతార్థుఁడనగు తలంపున నేనిటకు వచ్చియున్నాను. నాచి న్నకుమారునిగాఁ జెప్పఁబడుచుండినవాని నేను మీపుత్రునికొఱకు వచ్చి నిపి వారింట లేరని తెలిసెను. అప్పుడు మీదర్శనమైనఁ జేసిపోవుద మనుకొంటిని' అనియెను.

కల్యాణీబాయి—కమలనయనుఁ డిప్పుడే వచ్చును, కొంచెము సేపిక్కడ నుండుఁడు. రెండుజాములయ్యెను; మీకొఱకై యొకింత ఫలాహారమును దెప్పించెను.

'ఏమైన ఫలాహారము సేయునిదే మీరు నన్నుఁబంపివేయరని నేనెఱుఁగుదును. నన్నుఁ జూచినంతనే లోకులందఱును నేను భోజన ప్రియుఁడనని కనిపెట్టుదురు.

చక్రవర్తి ఫలాహారమును గావించెను. కల్యాణీబాయి ప్రస న్నయై—''కృపయుంచి రేపు రెండుజాములకు మీరిక్కడకు భోజన మునకు విచ్చేయుఁడు. నేఁ డేమియు సిద్ధముగనుండనందున మిమ్ముఁ బిలువలేదు.''

'సిద్ధపఱచిన పిదప నన్నుఁ బిలువుఁడు. నాయిల్లిక్కడ కనతి దూరముననే యున్నది. మీయాజ్ఞయైనచో మీసేవకునకు నాగృహము చూపించెదను.''

ఇవ్విధముగ నైదాఱుదినములలోనే చక్రవర్తి కమలనయనునింటివారందఱితోను మైత్రిసంపాదించెను.

కల్యాణీబాయి—(కమలనయనునితో) నీవు చక్రవర్తియొద్ద డబ్బు పుచ్చుకొనకుము.

చక్రవర్తి—(నవ్వి) వారు మీయాజ్ఞకుఁబూర్వమే మాత్రాజ్ఞను బాలించుచున్నారు. ఉదారపురుషులును, ధార్మికులును బేదవారిని తత్క్షణమే యెఱుంగుదురు.

ఒకనాఁడు చక్రవర్తి కమలను దశాశ్వమేధఘట్టమునకు గంగాస్నానము సేయుటకై పిలుచుకొనిపోయెను. మగిడి గృహమునకు వచ్చునప్పు డాతఁడు వేఱుమార్గమున బయలుదేఱెను. ఆబాటనే యొక వృద్ధస్త్రీయు గంగాస్నానమాచరించి యొకబిందెడు గంగాజలమును దీసికొనివచ్చుచుండెను. చక్రవర్తి కమల నామె సమీపమునకుఁ గొనిచని 'బిడ్డా! వీరికి నమస్కరింపుము. వీరు డాక్టరుబాబుగారి తల్లిగారు!' అనియెను.

కమల కల్యాణీబాయిపాదములపైఁ దలనిడెను. ''నీవెవ్వతెవమ్మాయీ? తొలుత నీమోముఁజూడనిమ్ము!'' అని కల్యాణీబాయి కమలముఖముపై నున్నముసుఁగు నావలకుఁ దొలఁగించెను. ఆమె ముఖమునుగాంచినతత్క్షణమే కల్యాణీబాయి ''ఆహాహా! ఈమె మూర్తీభవించినలక్ష్మీదేవియే! వత్సా! నీపేరేమి? ''అనియెను.

కమలమాటాడుటకుఁబూర్వమే చక్రవర్తి ''ఈమెపేరు సతి! ఈమె నాకు దూరపుబాంధవ్యమున నన్నకుమారితయగును. తలిదండ్రులు లేరు. ఈమెను సంరక్షించుభారము నామీఁదనున్నది'' అనియెను.

కల్యాణీబాయి—చక్రవర్తిజీ! మొదట మనము గృహమున కేగుదమురండు. అక్కడనుండి మీరు మీగృహమున కేగవచ్చును.

చక్రవర్తియుఁ గమలయు వెంటరాఁగా కల్యాణీబాయి గృహమున కేతెంచెను. ఆమె కమలనయనునిఁబిలిచెను; కాని, యతఁడింట లేఁడు.

చక్రవర్తి—(కల్యాణీబాయితో) నాయన్నకుమారిత మందభాగ్యురాలు. వివాహమైనమఱునాఁడె యీమెపతి సన్యాసియై యెక్కడికో వెడలిపోయెను. పతియని యెవరినవచ్చునో యదియు నీమెకుఁ దెలియదు. తీర్థసేవలొనరింపవలెనని యీమెయభీష్టము. కాని, నేనో దరిద్రుఁడను ఉద్యోగమువలన జీవించువాడను, కాశీ నగరమున నివసించుటకు నాకు శక్తిచాలదు. కావున విన్నవించుచున్నాను; మీరు దయయుంచి యీబాలికను మీయొద్దనుంచుకొనినచో నేనెంతయు సంతసింతును. ఈమెవలన మీకు లవమాత్రము నాయాసము కలుఁగజాలదు. రెండుమూఁడుదినములలోనే మీకు నమ్మకముకలుఁగఁగలదు.

కల్యాణీబాయి—(సంతోషముతో) నాకును మహానందమే! వీధులలో నాడుచుండుపిల్లల నింటికిఁ బిలుచుకొనివచ్చి వారికి దినుపదార్థములిచ్చి యానందించుచుందును; కాని, యెంతచేసినను వారు మనవారుకారుకదా! వారెల్లప్పుడును నాయింట నుందురా? ఈతరుణియైన పిల్లకాలము నాదగ్గర నుండుఁగాక! ఈమెను నాబిడ్డవలె నాదరింతును. మీరెంతమాత్రమును సందేహము నుంచుకొనకుఁడు. నాబిడ్డఁ డెట్టిసజ్జనుండో లోకులవలన మీరెఱిఁగియేయున్నారు. వాఁడుఁగాక యిఁక నాయింట నితరులెవ్వరును లేరు.

చక్రవర్తి—కమలనయనునికీర్తిదిగంతవ్యాప్తమైయున్నది. వారికి వివాహమైనకొలఁదికాలముననె వారిపత్ని జలప్రవాహమున

మునిఁగిపోయెననియు నాతఁడాఁటినుండియు బ్రహ్మచర్యమవలం బించియున్నాఁడనియు మేము వినియున్నాము

"అదిపోనిండు! కడచినది కడచిపోయినది! కాని యది నాకుజ్ఞప్తికివచ్చినచో భీతిచే నాయొడలు కంపమందుచుండును."

"మీరు సమ్మతింతురేని నాయీబిడ్డను మీకడ నుంచెదను. అప్పుడప్పుడు వచ్చి నేనీమెను జూచి పోవుచుందును. ఈమె కొక యక్రజయున్నది; ఆమెయు మీదీవనలందుటకై యొకప్పుడు డిక్కడకు రాఁగలదు."

---

ఇరువదినాల్గవ ప్రకరణము.

---

పతిచరణపాదుకలు

చక్రవర్తి వెడలిపోయినయనంతరము కల్యాణీబాయి కమలను దనచెంతఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లుపలికెను. బిడ్డా! ఇటుచూడుము నీవయస్సత్యంతము నల్పమైనది. అరెరే! నిన్నువదలి నీపతి వెడలిపోయెను! మరల మీరాణివిజాడకైన నేఁడు గదు! జగమున నిట్టిక్రూరహృదయులుసైతము లుందురా? నీసౌభాగ్యము వృద్ధియగుఁగాక! నీపతి మరల నీకు లభించునుగాక! ఇట్టిసుందరముఖకమలము సృష్టించుట, విధాత దానిని వ్యర్థముగ నష్టముసేయుటకై కాదు!'

కళ్యాణీబాయి యొకింతసేపూరకుండెను. మరల నామె పలుకసాగెను.

'ఈగృహమున నీయీడు చెలికత్తెలెవరులేరు. నీవొక్కతెవు నాసహవాసమున నుండవలసియుండునుకదా!'

'ఔను.'

'నీవేవిధమునఁ బ్రొద్దుపుత్తువో యదియే యాలోచించుచున్న దానను.'

'నేనింటిపనులన్నియుఁ జేయుదును. మీసేవా శుశ్రూషయు నొనర్తును.'

'ఓసిపిచ్చిదానా! ఈలావణ్యమయంబగు కోమలశరీరమును గృహకృత్యములమూలమున వాడఁజేయుదువా? నిన్ను నాయింట దాసివలె నూడిగములు నీచేఁజేయించుటకా, నిన్ను నాయొండ నుంచికొనుట? నీయోగ్యతకుఁ దగినపనులే నీకుఁ జెప్పుచుందును. ఈపుడమియందంతటను నాకున్నవారందఱు నాయొక్కకుమారుఁడే; వాఁడును సన్యాసివలె నున్నాఁడు! రాత్రిందివములు వేదాంత గోష్ఠియే; 'నాకిదికావలయు, నదినన్ను దిననిమ్ము!' అని యేమి యు ననఁడు! వాఁడట్లనినచో నాకెంతసంతసముగానుండును! ఎం తోధనము నార్జించుచున్నాఁడు; కాని, దానినంతను దానధర్మము లకు వ్యయపఱచును. ఇదిగో, సతీ! నీవెల్లప్పుడును నాయొండనుండు దానవు! కావున, కుమారుని ప్రశంస పలుమాఱు నానోట విని నీకు విసుగు బుట్టఁబోలును! కాని, యిందుల కేనేమిచేయఁగలను?

కమల హర్షముతో రోమాంచితయై తలవంచుకొనియెను.

కళ్యాణీబాయి—నీకేపనిచెప్పవచ్చునో చెప్పుము? నీకుఁ గుట్టు పనులు వచ్చునా?

'కొంచెమే వచ్చును.'

'ఆపనులు నీకు జక్కఁగ నేర్పెదను; నీకుఁ జదువను వ్రా యను వచ్చునా?'

'వచ్చును.'

'మంచిది! నేనిప్పుడు చదువజాలను; నీవేదైన నాకుఁ జదివి వినిపింతువుకదా?'

'నేను వంటసేయఁగలను. గృహకృత్యములన్నియు నుత్తమ రీతి నెఱుంగుదును.'

'ప్రస్తుతము నాకమలనయనుడే స్వహస్తములతో స్వయం పాకము సేయుచున్నాఁడు, పూర్వము నేనేవండి యతనికిఁ బెట్టుచుండుదానను; నాకీవ్యాధి సంప్రాప్తమైనప్పటినుండియు వాఁడే పాకమొనరించుచున్నాఁడు నేనితరులువండినది భోజనముసేయను. ఇప్పుడు వానిని వంటసేయవలదని చెప్పుదును. ఇదిమొదలు నాయ స్వస్థసమయములలో నీవే భోజనపదార్థములు సిద్ధపఱుపుము! నీచే తియన్నముఁ దినుటకు నాకేయాటంకమును లేదు.'

కళ్యాణీబాయి పాకశాలయు, సామగ్రులగదియుఁ గమలకుఁ జూపెను; కమల యీసంధి సాధించి 'అమ్మా! నేఁడు నేనే స్వయం పాకము సేయుదు' ననియెను.

'సరే, ఇంటిలో సకలము చక్కపఱచుట మెల్లమెల్లగ నీపైఁ బడనున్నది.'

కల్యాణీబాయి సకలగృహకృత్యములను స్వయంపాక సామగ్రులను గోడలికి వశపఱచు తెఱంగునఁ గమలకు వశపఱచి స్వయం పాకముసేయుపని కమలపై మోపెను. కమలనయనుఁ డింటికేతెంచిన వెంటనే తల్లికడ కేగును. నేఁడటువోవుచుండఁ బాకశాలలో నేమియో శబ్దము వినవచ్చెను; నేఁడు తనతల్లియే స్వయముగ వంట చేయుచున్నదని భావించి యతఁడు వంటశాలకేగెను. అడుగుల చప్పుడువిని కమల వెనుకకుఁ దిరిగిచూచెను. అచటకుఁ గమలనయ నుఁడు వచ్చుచుండెను. ఒండొరులదృష్టి సమ్మేళనమయ్యెను. ఆమె తటాలునఁ జేతిలోని గరిటెను గ్రిందఁబడవైచి చెఱఁగును సవరించు కొనఁ బ్రయత్నించెను, కాని, యందామెకు యశము గలుగలేదు. ఏలయన, స్వయంపాకముసేయఁ గూర్చుండినపుడే యామె యాచె

అఁగును నడుమునకుఁ జుట్టుకొనియుండెను. ఆ చెఱఁగును సవరించుకొని యామె కూర్చున్నపిమ్మటఁ గమలనయనుఁడు విస్మితుఁడై యట నుండి కదలిపోయెను. కమల మరల నాగరికెను జేతఁగొనెను—ఆ హస్తము కంపించుచుండెను కల్యాణీబాయి దేవపూజ పూర్తి చేసి వంటశాలలోనికేగెను. స్వయంపాకమంతయు సిద్ధముగా నుండెను; ఇంధనమందు స్వచ్ఛతయు, జాగరూకతయుఁ జూడఁ గన్నులపండువుగ నుండెను. కల్యాణీబాయి మిక్కిలి సంతుష్టమయ్యెను. కమలనయనుఁడు భోజనముసేయఁ గూర్చుండెను; కల్యాణీబాయి వడ్డింపఁ దొడగెను. లజ్జాసంకుచితయగు నొక విగ్రహము తలుపుచాటున మౌనముతో నిలిచి యుండెను! తొంగిచూచుట కామెకు సాహసము కలుగలేదు. వంట బాగుగ నుండలేదేమోయను భీతిచేఁ గమల బెదరియుండెను.

కల్యాణీబాయి—నేఁడు భోజనపదార్థము లెట్లున్నవి?

కమలనయనుఁ డంతవిలాసపురుషుఁడు కాఁడు. తన యెదుటఁ బళ్ళెరమునఁ గనఁబడినదంతయుఁ బ్రసన్నచిత్తముతోఁ దినును కావున నే యెన్నఁడును గల్యాణీబాయి యిప్పటివలెఁ బ్రశ్నించుటలేదు. కాని, నేఁడు కమల వంటచేసియున్నందున నామె కుతూహల పూర్వకముగ నీప్రశ్న యడిగెను. స్వయంపాక గృహమునందలి నూతనరహస్యము కమలనయనుఁడెఱుంగఁడని కల్యాణీబాయి తలఁచియుండెను. కమలనయనునిదృష్టి పదార్థములపై పడ లేదు. కావున, నాతఁడు మహోత్సాహముతోఁ 'బదార్థములుమిక్కిలిరుచిగనున్నవి' అనియెను. ద్వారము వెనుకనుండి యాయుత్సాహదాయక భాషణములు వినుచున్నకమలస్థిరముగ నిలువజాలకపోయెను. ఆమె వేగముగ బ్రక్కగది లోనికేగెను; అట నామె తన కరయుగళముతోఁ దన చంచలహృదయమును బిగ్గపట్టుకొనియెను. భోజనాంతరము కమలనయనబాబ

తనగదిలోని కేగి కూర్చుండెను. మూడవజామునఁ కల్యాణీబాయి కమలకు స్వహస్తములతో జడ వేసి యామెనొసటఁ గుంకుమ మిడెను. ఇటుత్రిప్పి యొకమాఱు, నటుత్రిప్పి యొకమాఱు నామె కమల ముఖమునుజక్కగ వీక్షించెను. కమలలజ్జతో మోమువంచి కూర్చుండియుండెను. కల్యాణీబాయి తనలో 'ఆహాహా! ఇట్టికోడలు నాకు లభించియుండిన' అని యనుకొనియెను ఆనాఁటి రాత్రియే కల్యాణీబాయికి మరల జ్వరము వచ్చెను. కొన్ని దినములవఱకు నేయితర ప్రదేశములకైనఁ బోయియున్న యెడల దేహస్థితి బాగుగ నుండు నని కమలనయనబాబు సూచించెను; కాని, కల్యాణీబాయి యందున కీయకొనలేదు. కమలనయనుఁడు వెడలిపోయిన యనంతరము కమల కల్యాణీబాయికడ కేతెంచి యామెపాదముల నొత్తుచుండెను. అందునకుఁ గల్యాణీబాయి యిట్లనియెను—"బిడ్డా! ఎంతతడవనినీవిట్లు జాగరము సేయుచుందువు? పరుండుము, పొమ్ము నీవు నాకై లేశమును జింతింపకుము కమలనయనుఁడు నాప్రక్కగది లోనే యుండును వాఁడనవరతము నాసేవకై సిద్ధముగనుండును. వాఁడు రాత్రులయందెంతసేపు మేల్కొనియుండినను వానికి విశేషముగ బాధ కలుగుటలేదు, ఈకారణముననె యతఁడతిశాంతస్వభావముకలవాఁడు. వాఁడెన్నఁడందునకు వెనుకంజవేయఁడు. నేను మరల నాపుత్రునిగుణములఁ బొగడుచుండుటకు నీకు మనసున నవ్వు పుట్టుచుండును. నేనేమి చేయఁగలను? ఒక్కపుత్రుఁడేయుండి, యాతఁడు సకలసద్గుణసంపన్నుఁడైనచో నింతియే! ఇట్టిపుత్రుఁడు లభించుటయు భాగ్యమే! నాసేవాశుశ్రూషలుచేసి వాఁడు నాకెట్టిసౌఖ్యమొనగూర్చుచుండెనో నాహృదయమునకే యెఱుక. నేను వానికేమియుపకారము సేయఁగలను? ఇంకను కమలనయనునిప్రశంసయే! కానీ; నీవిఁకవిశ్రమింపుము. ఏదైన గొణుఁగుచుండుటకన్న వృద్ధులకు వేఱుపని యేమున్నది?"

మఱునాఁడు కమల గృహకృత్యభారమంతయుఁ గనపై మో పుకొనవలసివచ్చెను. గృహపూర్వభాగమునఁ గమలనయనునియు పాసనామందిర ముండెను. రెండుజాముల వేళ నాతఁడందే విశ్ర మించును. నేఁడు ప్రాతఃకాలమున నాతఁ డుపాసనామందిరమునకుఁ బోయి చూడ నదంతయుఁ బరిశుభ్రముగనుండెను. అగ్నిహోత్ర పుటిత్తడిపాత్ర పైఁబడిపాత్రవలెఁ బ్రకాశించుచుండెను. పుస్తకము లన్నియు బీరువాలో వరుసగఁ బెట్టఁబడియుండెను. ఈస్వచ్ఛతకును జాగరూకతకును నాతనిహృదయ మాహ్లాదసంభరితమయ్యెను. కమల యరుణోదయముననే గంగాజలమును దీసికొని కల్యాణీబాయి శయ్య చెంత కేతెంచెను. ఆమెస్నానముచేసియుంటఁ గల్యాణీబాయి చూచి, "ఏమీ! నీవొక్కతెవే గంగానదికిఁ బోయియుంటివా?" అని ప్రశ్నించెను.

"నాపినతండ్రిసేవకుఁడొకఁడు నన్నుఁజూచిపోవుటకై వచ్చి యుండ వానిని వెంటఁబెట్టుకొనిపోయితిని."

"నీపినతల్లియే వాని నంపియుండవలయును. మంచిది వానిని నీయొండ నుండనిమ్ము. గృహకృత్యముల నీకు వాఁడు సాహాయ్య మొనర్పఁగలఁడు. వాఁడెక్కడనున్నాఁడు? పిలువుము."

ఉమేశుఁడే తెంచి నమస్కరించెను. కల్యాణీబాయి "నీపే రేమి?" యనిప్రశ్నించెను.

"నాపేరుమేశుఁడు" అని వాఁడు నిష్కారణముగ నవ్వెను.

ఉమేశునిసహాయబలముచేఁ గమల గృహకార్యములన్నియు నతిశీఘ్రముగనె పూర్తిచేసెను. ఆమె యొక్కొక్కగదిలోనున్న వస్తువు లన్నియుఁ జక్కపఱచి యేదియెక్కడనుండవలయునో దానిన క్కడ జాగ్రతగనుంచెను. ఒకబీరువాలోఁ గమలనయనునిపాదుక లుండెను. కమల వానిని దటాలునఁదీసి తనమస్తకముపై నిడికొనెను.

అనేకపర్యాయము లాపాదుకలపైనున్నధూళివంతను బయ్యెదకొంగుతోఁ దుడిచి మరల యథాప్రకారముగా వాని నాస్థలముననే యుంచెను. మూఁడవజామునఁ గమల కల్యాణీబాయిపాదముకలడఁ గూర్చుండి శుశ్రూష సేయుచుండెను. ఇంతలో పూలబుట్ట చేతధరించి నళిని యచ్చటికివచ్చేసి కల్యాణీబాయికిఁ బ్రణామముసేసెను.

కల్యాణీబాయి—(స్నేహపూరితస్వరముతో) రమ్మా; కూర్చుండుము; ఘనానందబాబుగారిశరీర మెట్లున్నది?

"నేఁడు కొంచెము బాగుగనే యున్నది. నిన్న వారస్వస్థులై యుండినందుననే నేను రాలేకపోయితిని."

కల్యాణీబాయి నళినీ కమలలకుఁ బరిచయము గలుగజేసెను.

నళిని—(కల్యాణీబాయితో) మీ దేహస్థితి యెట్లున్నది!

కల్యాణీబాయి—నేనెట్లున్న నేమి? వృద్ధురాలనైతిని. నేఁడున్న రేపుండను. సరి! జ్ఞప్తికివచ్చినది. నేను నిన్నొక్కటి యడుగవలెననుకొన్నాను. మాచిన్నప్పు డెవ్వరైన వివాహవిషయము నూటాడఁదొడఁగిన మేము సిగ్గుచే భస్మమగుచుండెడివారము. కాని, యిపుడు మీరు విద్యావతులైనకారణమున మీకన్నియుఁ దోఁచవు. నళినీ! నీతండ్రిగారు నీతో నేమైనఁ జెప్పిరా లేదా!

నళిని—(లజ్జతో) ఔను. చెప్పియున్నారు.

కల్యాణీబాయి—బహుశః నీకది రుచించియుండదు. ఈకమలనయనుఁడు జటాధారివలె నున్నాఁడు వీనితో నెట్లు కాపురము చేయఁదగునని నీకుఁ దోఁచియుండును. కాని, యది కేవలముఁ బొఱపాటు వాఁడు పైకి విరక్తునివలెఁ గన్పించుచుండుటనిక్కమే; కాని, యతనిహృదయ మనురాగపూరితమయియున్నది. పైకవచమువిప్పి యతని యంతఃకరణమును హస్తగతముఁ గావించుకొను జవ్వని కనుపమసౌఖ్యము ప్రాప్తింపఁగలదు. నళినీ! ఇదే నేను మనఃపూర్వ

కముగ నీకుపదేశించుచున్నాను; నీవు కమలనయనుని కాంతవుకమ్ము నీకాతనియెడల శ్రద్ధకలదు; మఱి, నీవేటికివలదందువు?

నళిని—(క్రిందికిఁజూచుచు) నేను తగినదాననని మీరు తలఁచు నెడల నేనేటికివలదందును?

కళ్యాణీబాయి నళినిని ప్రేమతోఁ దనచెంతకుఁ జేరదీసి కొని యామెశిరమును ముద్దుపెట్టుకొనియెను.

కల్యాణీబాయి 'సతీ! యీపుష్పములు—' అనియనుచు దల బైకెత్తి చూచుసరికిఁ గమల యచటఁ గానరాదయ్యెను. పాద ధ్వనిసేయకయే కమల యప్పుడే గదినుండి వెడలిపోయెను. నళినియుఁ గొంతతడవునకు వెడలి పోయెను.

కల్యాణీబాయి కమలనయనునిఁ బిలిచి సమస్తవృత్తాంతమును నివేదించి నళినిని వివాహమాడుటకు సంసిద్ధుఁడవగుమని చెప్పెను.

'ఆవిషయమై చింతింపకుము. నేను నీయాజ్ఞ మీఱువాడను గానుగదా?' యనివచించి కమలనయనబాబు వెడలిపోయెను.

కల్యాణీబాయి కమలనుబిలిచి 'ఈపూవులనుగడిగి దేవిగృహముననుంచుము' అనియెను. కమల యావిధముగనే కొన్నిపుష్పములు దేవగృహముననుంచి మఱికొన్ని కమలనయనుని శయనగృహమున నొకముక్కాలిపీటపై నిడెను. పిమ్మట నామె బీరువాలో నున్నపాదుకలకుఁ గొన్నిపుష్పములర్పించి వానిపైఁ దలనుంచెను; ఆమెనేత్రముల నశ్రుధార ప్రవహింపసాగెను. ఈపాదుకలుతప్ప నామె కీజగమున వేఱుస్థానములేదు. ఆమెకివియే యాధారములుగ మిగిలియుండెను. పతిచరణసేవయొనర్చునధికార మామెకుండ లేదు.

ఇంతలో నాగృహమున కెవరోవచ్చుటఁగని యామెతటాలున నాబీరువాతలుపు మూసెను. కమలనయనబాబు లోపలికి వచ్చు చుండెను, బయటికి బోవుటకు వేఱుమార్గముండలేదు. కమల యువ్వి

ధముగనే చూచాలనిలిచెను. 'నేనీసాయంకాలాంధకారమున నేటికిఁ గలిసిపోనైతిని?' అని కమల తనలో ననుకొనియెను. ఆమెను జూచి కమలనయనుఁడు వెడలిపోయెను. కమలయు మఱొకవైపున కేగెను. కమల తన్నుఁ గనినంత బీరువాతాళపుమూసిన కారణమేమై యుండునో చూతమని కమలనయనుఁడు మరల లోనికేను. బీరువా తెఱచిచూచెను. తనపాదుకలపైఁ బుష్పములునైవఁబడియుండుటాతని కగబడెను. మరలఁ బూర్వమువలెనే యతఁడాతాళపులు బిగించెను. అతఁ డక్కడనుండి కిటికీ చెంతకేగి యాకసమునంకఁ గాంచుచు నిలిచెను. అటునూడఁజూడ నెల్లదిశలు నంధకారబంధురములయ్యెను.

---

## ఇరువది యైదవ ప్రకరణము.

---

### పునర్విఘ్నము.

కమలనయనుని వివాహమాడుటకుఁ దాను సమ్మతించిన పిమ్మట నళిని తనలో "ఇదియు మహాభాగ్యమనియే తలంపవలయును. నాపురాతన సంబంధమొక్కమాటె తెగిపోయినది. ఇఁక నేను స్వతంత్రను!" అని యనుకొనుచుఁ దనహృదయమునకు ధైర్యమును దెచ్చికొని వైరాగ్యానందము ననుభవించెను. గృహమున కేతెంచిన పిదప నామె తనలో "నాజనని నేఁడు జీవించియుండునెడల నేనీ యానందవృత్తాంత మామెకు నివేదించియుందును. నాన్నగారితో నాహృదయభావ మంతయు విస్పష్టముగ నెట్లుచెప్పఁగలను? అని యనుకొనియెను.

దేహము స్వస్థతగానుండకునికి నేఁడు ఘనానందబాబు చాల సేపు కూర్చుండియుండలేదు. శీఘ్రముగనే శయనమందిరమునకు వెడలిపోయెను. నళిని తన దినచర్య పుస్తకమున నీవిధముగ వ్రాయసాగెను—

"నేనొక ప్రేమజాలమునఁజిక్కి సంపూర్ణముగ సంసారము నుండి తొలఁగియుంటిని. అందుండి యుద్ధరించి యీశ్వరుఁడు నాకు మరల నూతనజీవితమొసఁగునని నేను కలనైనఁ దలఁచియుండలేదు. నేఁడాజగన్నాటక సూత్రధారునకుఁ బలుమఱుఁ బ్రణామము లొనర్చి కర్తవ్యక్షేత్రమున నడుగిడుటకు నేను సంసిద్ధనై యున్నదానను. దుర్లభమని నేను తలచియున్న సౌభాగ్యము నేఁడు నాకులభించినది. ఆసౌభాగ్యము నామరణాంతము సంరక్షణసేయు సామర్థ్యముఁ బరమేశ్వరుఁడు నాకొసఁగుఁగాక! "ప్రభూ! ఇదియే నాహృదయపూర్వక ప్రార్థన; నన్నెవ్వనిసుఖదుఃఖములకు సమభాగినిఁజేయ సంకల్పించితివో, వానిసేవ నేనెల్లకాలము నిశ్చలభావముతోఁ జేయునట్టు లొనరింపుము!"

ఆపుస్తకము నటునైచెను. ఆయంధకార బంధురమగునిశి నామె యుద్యానవనమందలి కాలిబాట నిటునటు పచారు సేయుచుండెను. తారకాప్రశోభితంబగు నంతాకాశ మామె హృదయమున నిశ్శబ్ద శాంతిమంత్రము నుచ్చరించెను. మఱునాఁడుమూఁడవజామున ఘనానందబాబు నళినీసహితుఁడై కమలనయనుని గృహమునకేగ బయలుదేరునంతలో బహిర్ద్వారమున నొకశకటమువచ్చి నిలిచెను. బండిపైఁ గూర్చుండియున్న కమలనయనుని సేవకుఁడొకఁడు దిగివచ్చి "డాక్టరుబాబుగారి తల్లిగారు వచ్చియున్నారు." అనిచెప్పెను. తటాలున ఘనానందబాబు ద్వారముచెంతకేగెను. కల్యాణీబాయి బండి దిగివచ్చెను. "నేఁడు నేను మహాసౌభాగ్యవంతుఁడననియే యెంచెద" నని యానందముతో ఘనానందబాబు పలికెను—

కల్యాణీబాయి—మీపుత్రికారత్నమును సందర్శించి యాశీర్వదించిపోవుదమని యేతెంచితిని !

ఘనానందబాబా మెను లోనికిఁబిలిచికొనిపోయి యత్యాదరభావముతో నొకపీఠముపైఁ గూర్చుండఁబెట్టి నళినిని బిలిచెను. నళిని కల్యాణీబాయికి నమస్కరించెను 'నీసౌభాగ్యము చిరకాలమునిలుచుఁగాక! దీర్ఘాయురారోగ్యములందుదువుగాక!' అని యాశీర్వదించి కల్యాణీబాయి నళినిహస్తముల సువర్ణకంకణములు తొడిగెను. నళిని మరలఁ గల్యాణీబాయికిఁ బ్రణమిల్లెను. ఆమె మహాప్రేమచే నళిని ఫాలప్రదేశమును ముద్దుపెట్టుకొనియెను. కల్యాణిబాయి దీవెనలుచేసెను, ప్రేమవర్తనముచేతను నళినికొక విశిష్టవిధానం మనుభవమునకు వచ్చెను. ఆమె హృదయ మపూర్వమాధుర్యముచే నిండిపోయెను.

కల్యాణీబాయి—బాబూ! రేపు మాయింట మీకిరువురకును విందు. మీరుతప్పక దయచేయ వేడుచున్నాను.

మఱునాఁడు ప్రాతఃకాలమున ఘనానందబాబు చావడిలోఁ గూర్చుండి యెప్పటివలెనే తేనీరుఁ గ్రోలుచుండెను. వ్యాధిమూలమున వాడియున్న యతనిమోమొక్కరాత్రినుండియే ప్రసన్నముగఁ గానవచ్చుచుండెను. సన్నిధి నాసీనయైయున్న పుత్రిక నాతఁడు పలుమాఱు స్నేహపూరితదృష్టితోఁ దిలకించుచుండెను. ఆతనిహృదయమునందలి యుత్సాహము ముఖముపై స్పష్టముగఁ గనఁబడుచుండెను. కల్యాణీబాయిగారి గృహమున కేగువేళయైనది; విలంబము కూడదను విచారమే యతనిహృదయమున నిండియుండెను. ఆతని మనోగతము నెఱింగి 'ఇంకను నవకాశమున్నది; ఇప్పుడే యెనిమిది గంటలయ్యెను.' అని నళిని యనుచుండెను.

ఘనానంద—అన్నియు సంసిద్ధపఱచుటకుఁ గొంతకాలము పట్టును. ఆలస్యముగఁ బోవుటకన్న నొకయఱగంట ముందుగఁ బోవుటయే మంచిదికదా!

ఇంతలో నొకబండి ద్వారముకడకు వచ్చినిలిచెను. తటాలున నళిని 'యోగీంద్రబాబావచ్చె' నని యనుచు ద్వారము చెంతకేగెను.

యోగీంద్ర—(సహాసవదనుఁడై) నళినీ! కుశలమేనా?

నళిని—ఆఁ! బండిలో నింక నెవ్వరైన నున్నారా?

యోగీంద్ర—అవును; నీకొఱకు బాబాకొఱకు నింకనొక బంధువును దెచ్చియున్నాను.

ఇంతలో రమేశుఁడు బండినుండిదిగెను. నళిని యతనివైపున కొకమారు చూచి తత్క్షణమే లోనికి వెడలిపోయెను.

యోగీంద్ర—(బిగ్గరఁగా) నళినీ! ఆఁగుము. నీతోఁ గొంచెము మాటలాడవలసి యున్నది.

ఈపలుకు లామెకు వినఁబడలేదు. ఒకానొకభూతమేదియో యామెయందావేశమై యుండఁబోలును! ఆమె వెనుకకుఁ దిరిగిచూడకయే వెడలిపోయెను. రమేశుఁ డట్టెబ్రమాన్పడినట్లునిలిచెను. లోనికేగుదునా! లేక వెనుకకు మరలివచ్చినత్రోవనే పోవుదునా యని యాలోచించుచుండెను. కాని 'రమేశబాబు! రమ్ము! బాబా బయటిచావడిలోఁ గూర్చుండియున్నాఁడు' అనిచెప్పి యోగీంద్రుఁ డాతని హస్తమును బట్టుకొని తండ్రికడకుఁ బిలిచికొనిపోయెను. దూరమునుండి రమేశునిఁ గాంచినంతనె ఘనానందబాబు బెదరెను. ఆతఁడు చేయితలపైనిడుకొని తనలో 'మరల నీవిఘ్నమా! ఇదియెట్లు?' అని యనుకొనియెను. రమేశచంద్రుఁడు ఘనానందబాబుగారికి నమస్కరించెను. ఘనానందుఁడాతనిని కుర్చీపైఁగూర్చుండుమనునట్లు

హాస్యసంజ్ఞసేసెను. పిదప ఘనానందబాబు 'యోగీంద్రా! నీవు తగు వేళకే వచ్చితివి. నీకుఁ దంతివార్త నంపనెంచియుంటిని.' అనియెను.

యోగీంద్ర—ఏటికి?

ఘనానంద—కమలనయనునకు నళినినిచ్చి వివాహముసేయుటకు నిశ్చయింపబడియున్నది. నిన్న నాతనితల్లి యేతెంచి నళిని కాశీర్వాదము లొసఁగిపోయినది.

యోగీంద్ర—ఏమి? వివాహము నిశ్చితమయ్యెనా? ఈవిషయమై నన్నేమియు మీరడుగలేదు.

ఘనానంద—నీవొక్కొకప్పు డొక్కొకవిధమునఁ బలుకుచుండుటయం దర్థమేమి? నాకును గమలనయనునకును విశేషపరిచయము గలుగకమున్నె నళినిని గమలనయనునకిచ్చి, వివాహముసేయు విషయము ముచ్చటింపఁబడి యుండెనుగదా!

యోగీంద్ర—అప్పటిమాటలు పోనిండు! ఆ సమయమున నాకు వేఱువిచారముండెను; ఇప్పటికిని మించిపోయినదేమి? మీరు నిశ్చయించిన వివాహము విషయమై నేను మీతో నెంతో చెప్పవలసియున్నది. అది వినినపిమ్మట మీకేది యోగ్యమనితోచిన దానిని జేయుఁడు.

ఘనానంద—సరే నాకు వీలుకలిగినప్పు డామాటలు విందును కాని, నేనిప్పు డావలికిఁ బోవలయును,

యోగీంద్ర—ఎక్కడకు?

ఘనానంద—కమలనయనునితల్లి నన్నును నళినిని విందునకుఁ బిలిచియున్నది. మీరిక్కడనే భోజనము—

యోగీంద్ర—నాకై మీరు చింతింపనక్కఱలేదు. నేనును రమేశబాబును నేదో భోజనాలయమున భుజింతుము. రెండుజాములకు మీరు తిరిగివత్తురుగదా! మేము నప్పటికి వత్తుము.

ఘనానందబాబు రమేశచంద్రునితో విశేషముగ సంభాషించుట కసమర్థుఁడై యుండెను. అంతియేకాదు; ఆతనిముఖము వీక్షించుటకును నాతనికిఁ గష్టముగనుండెను. ఇంతవఱకు రమేశబాబు స్తబ్ధముగాఁ గూర్చుండియుండెను. పోవునప్పుడతఁడు ఘనానందునకు బ్రణమిల్లి వెడలిపోయెను.

---

## ఇరువది యేడవ ప్రకరణము.

---

### సేవయే చేయుదును.

కల్యాణీబాయి కమలతో "బిడ్డా! నేఁడు పగలును, నా కొడుకు తండ్రియు నిటకు భోజనమునకు వచ్చెదరు. స్వయంపాక మెట్లుండవలెనో యెఱుఁగుదువా? తమ కుమారిక కిచ్చుట భోజనమున కేమాత్రమును గష్టముకలుగదని ఘనానందబాబుగారికి నమ్మకము కలుగవలెనుజుమా! కాని, నీముఖము నేఁ డేటికింత చిన్నఁబోయియున్నది? దేహస్థితి బాగుగనుండలేదా యేమి?"

కమల—(దరహాసముతో) నా దేహస్థితి కేమి?

కల్యాణీబాయి—నీమనసిచట లేదని నాకుఁ దోచుచున్నది. అట్లగుటయు స్వాభావికమే. నీకేటికింతలజ్జ? నిన్ను నేను నాపుత్రికవని తలచుచున్నాను. నీకెవరినైన నాప్తబంధువులను దర్శింపవలెనను కోరికయున్నచో నాతోఁ జెప్పుము. దానికిఁ దగినసదుపాయములు చేయుదును.

కమల—(నమ్రతతో) మిమ్ము సేవించుచుండుటదక్క నాకే మియు నక్కఱలేదు.

కల్యాణీబాయి— (ఆమాటలు వినకయే) వలయునన్న నీవు చక్రవర్తిగారియింట నాల్గుదినములుండి రమ్ము.

కమల—(ఉత్కంఠయై) మీసేవామగ్ననై యుండునంతవఱకు నాకెట్టిచింతయు నుండఁబోదు. సేవలో నెంతమాత్రముఁ గొఱ వడిన నన్ను శిక్షింపుఁడు; కాని, యొక్కక్షణమైన నన్ను మీయొద్ద నుండి దూరముగావింపకుఁడు.

కల్యాణీబాయి—బిడ్డా! పూర్వజన్మమున మనయిరువురమధ్య నేదో ఋణానుబంధ ముండియుండవలయును. అట్లుకాకున్న నీ వొ కటి రెండుదినములలోనే నీకు నాపై నింతప్రేమ యుదయించునా! పోనిమ్ము! చాలరాత్రియగుచున్నది; పోయి విశ్రమింపుము.

కమల తనగదిలోని కరిగి తలుపులు బిగించి శయ్యపైఁ బరుం డుటకు మాఱుగఁ బడమిపైఁ గూరుచుండి తనలో నిట్లు తలపోయ సాగెను—"దౌర్భాగ్యవశమున నెవ్వరిని నేను పోఁగొట్టుకొంటినో, వారు మరల నాకు లభించుటెట్లు? ఈయాశ లన్నిఁటినిఁ ద్యజించి నాహృదయమును భద్రపఱుపవలెను. అతనిసేవలోనర్చు నేసుయో గము నాకు లభించియున్నదో దానిని జాగ్రతగా సంరక్షించుకొన వలెను. సేవించుచుండుటలోనే నాకుఁ బరమసౌఖ్యమని నేను భావిం పవలెను. విషాదవివశనై మనసును క్షుద్రముగనొనరించినచో నున్న యీస్వల్పసౌఖ్యమును గోనాడవలసివచ్చునేమో!"

కమల యేకాగ్రమనస్కయై నిశ్చయ మొనర్పఁదొడఁగెను. "రేపటినుండియు నెట్టిదుఃఖమును నేను మనసునకు రానీయను. ము ఖముపై లవమాత్రము నౌదాసీన్యమును దృగ్గోచరము కానీయను. అప్రాప్యసౌఖ్యవిషమై కించిల్లాలసతయైన నాహృదయమున నుండ నీయను! ఒక్కసేవయే చేయుచుందును! దేహమునఁ బ్రాణములుం

డు నంతవఱకుఁ గేవలసేవయే చేయుదును! మఱేమియు వాంచించు దానఁ గాను!''

అనంతరము శుచిస్నాతయై యామె కమలనయనునుపాసనా మందిరమున కేగెను. ఆమె తనచీర చెఱఁగుచే నేలనూడ్చి స్వచ్ఛ ముసేసి పీటలు మొదలగువాని నచ్చటివచ్చట నే యుంచెను. ఇటీవలఁ గళ్యాణీబాయి కుమారుని వేఁకుకోలుమీఁద సూర్యోదయమునకు గంగాస్నానము సేయుట మానినందున నంతచలిలో నుమేశుఁడే కమ లతో గంగానదికిఁ బోవలసివచ్చెను. తానమాడి గృహమున కేతెం చినవెంటనే కమల కళ్యాణీబాయికి వందనమొనర్చెను. అప్పుడామె ''నీవింతప్రాతఃకాలముననే యేల స్నానముసేసితి'' వని యడిగెను.

• కమల—నేఁడింటఁ బనులు విశేషముగ నున్నవి. బజారు నుండి తేవలసినదేమైన నున్న నుమేశుని బంపి తెప్పించెదను.

కళ్యాణీబాయి—మంచిది! విద్యుల్లంకుఁడు రాకమున్నే భోజ నమంతయు సిద్ధముగానుండవలెను.

కమలనయనబాబచ్చటకు వచ్చునుండుటఁ గని కమల పయ్యె ద సవరించుకొని తటాలున వెడలిపోయెను. తల్లిగారు స్నానము నకు వెటలుచుండుటఁ గని కమలనయనుఁడామెతో ''నిన్న మీకొ కింత నెమ్మదిగానుండెను. నేఁడింతయుదయమున స్నానమునకు వెడ లితిరేమి?'' అనియెను.

కళ్యాణీబాయి—నీవైద్య మటులుంచుము. ప్రాతఃకాలగం గాస్నానము మానుటవలన నెవరును నమరులు కాఁజాలరు. నీవెక్క డకో బయలు దేరున్నట్లున్నది; పోయి శీఘ్రముగా రమ్ము.

''ఏల ?''

''నిన్న నీతోఁ జెప్పమఱచితిని. నేఁడు ఘనానందబాబు నిన్నాశీర్వదింపరానున్నాడు.''

'ఆశీర్వదించుటకా? వారు నామీఁద నింతప్రసన్నులై రేమి? అనుదినము మేమొండొరుల దర్శించుదుము కదా!'

'ఏమైనఁ గానిమ్ము. నీవు త్వరగ రమ్ము. ఘనానందబాబిచ్చటనే భోజనము సేయును' అని చెప్పి కల్యాణీబాయి గంగానదికి వెడలిపోయెను. కమలనయనుఁడు నీవిషయమే యాలోచించుచు గృహమునుండి బయటికి బయలుదేరెను.

---

## ఇరువదియేడవ ప్రకరణము.

---

### 'నాస్నేహము వీడకుము!'

నళిని రమేశచంద్రుఁ డీక్షించినంత నతివేగముగ వెడలిపోయెఁగదా! అటు వెడలి తనశయనమందిరమున కరిగి తలుపులు మూసికొని శయ్యపై మౌనముతోఁ బరుండెను. మనసునందలి ప్రథమావేశము శాంతించిన పిమ్మట నామె తనవిచిత్రవర్తనమునకై పశ్చాత్తాపమందసాగెను. ఆమె తనలో 'నిర్వికారహృదయముతో నేనేటికి రమేశబాబుదర్శనము సేయఁజాలనైతి? నేను దేని నాసించుచుంటలేదో యది యాకస్మికముగ నామనోదౌర్బల్యమే యందునకుఁ గారణము?' అని యనుకొనెను;

వెంటనే యామె లేచి గదితలుపుఁ దెఱచి బయటికి వచ్చెను. 'నేను లజ్జపై విజయము నార్జించెద' నని యామె నిశ్చయ మొనర్చియుండెను. ఆమె మహాధైర్యముతో, రమేశచంద్రుని దర్శించుటకును, నాతనితో నొకటిరెండుమాట లాడుటకును నిశ్చయించుకొని వెడలెను. కాని, యింతలో నామె కేమయ్యెనో యెవ్వరికెఱుక? ఆమె మరల గదిలోని కరిగెను. పెట్టియఁ దెఱచి యామె కల్యాణీ

బోయి యొసఁగిన సువర్ణకంకణములను దీసి హస్తమునఁ దొడిగికొ నెను. అప్పు డామె కవచావకుంఠితయై యుద్ధమొనర్ప బయలు దేఱెనో యనునట్లుండెను!

ఆమె చావడి దాటి తోఁటవైపున కఱుగుచుండుటఁ గని ఘనానందబాబు 'నళినీ! ఎక్కడకు బయలుదేఱితివి?' అనిప్రశ్నించెను.

'రమేశబాబును యోగీంద్రదాదాయును తోటలో నున్నారుకదా! వారిదగ్గరకుఁ బోవుచున్నాను.'

'వారెక్కడకో పోయియున్నారు; మరలవత్తురు.'

ఇప్పుడు విఘ్నము తటస్థించినందున కామె యానందించెను. ఘనానందుఁ డామెను బయటికిఁ బోవుటకు సిద్ధముగ నుండుమని చెప్పెను. ఆమె 'అవును; బయలుదేఱుఁడు. నేను సిద్ధముగనే యున్నాను. ఇపుడే స్నానముచేసి వచ్చెద బండిని సిద్ధరుపఁపుమనుఁడు' అనియెను.

ఇవ్విధముగ నళిని కమలనయనునిగృహమునకు బోవుటకుఁ దనయభీష్టమునకు వ్యతిరిక్తమగు నుత్సాహమును బ్రదర్శించెను. ఘనానందుఁ డామెభావము నెఱింగెను. అతనికిమరలవంతకలిగెను.

నళిని స్నానముచేసినపిదప ఘనానందబాబామెతో బండి నెక్కి కమలనయనబాబు గృహమునకేగెను. అప్పటికిని గమలనయనబాబింటికి రాకున్నందున ఘనానందబాబునకు స్వాగతమొసఁగు పనియుఁ గల్యాణీబాయిపైఁ బడెను. కల్యాణీబాయి యాయిరువురకు నాసనము లిచ్చి వారు కూరుచుండినపిమ్మట వారినిఁ గుశలప్రశ్నలడుగఁదొడఁగెను. అప్పుడప్పు డామె నళినిముఖమువంకఁ గాంచుచుండెను. కాని, యామె రూపమున నావంతయు నుత్సాహము గోచరమగుచుండలేదు. అంతియేగాక, యామె వదనము చింతామ

యమై యున్నట్టు లగపడుచుండెను. కల్యాణీబాయి కిది రుచింపద య్యెను. ఆమెతనమనసున, "కమలనయనుని వివాహమాడుట కు త్రహింపని బాలిక యుండబోదు. కాని, యీయాంగ్లవిద్యాభ్యాస మదోన్మత్తయగునీమె కాకమలనయనుఁ డయోగ్యుఁడని తోఁచు చున్నది! కాని, యీాత ప్పీమెది కాదు. నేనే త్వరపడితిని. ఇట్టికార్య ములన్నియు దీర్ఘముగ నాలోచించినపిదపఁ జేయవలెను. నేనుకమల నయనునికై యిట్టికన్యకు శోధించి యుండఁగూడదు!" అని యను కొనెను.

నళినివిషణ్ణవదనముం గాంచి కల్యాణీబాయికి ఘనానందబా బుతో సంభాషించుట కుత్సాహము కలుగలేదు. ఆమెపెండ్లికై యింత త్వరపడనేల? వధూవరులిద్దరును విజ్ఞులే; వారు తమయి చ్ఛానుసారముగ నొనర్తురు. మేము వారిని బలవంతపఱచుట యు చితముకాదు. నళినిమనసున నేమున్నదో నేనెఱుఁగను; కాని కమ లనయనునివిషయ మేమందురేమో. వాడింకను మనసు స్థిరపఱచు కొనలేదు" అనియెను.

ఈపైమాటలు ముఖ్యముగ నళినినుద్దేశించి చెప్పఁబడినవి. నళినికీవివాహముపై నాశలేనప్పు డామెపైఁ దనకు మాఱుఁ డను రాగముతో నామెను వివాహమాడనంగీకరించెనని యితరు లను కొనుట యీామె కిష్టములేదు. కల్యాణీబాయి గృహమునకుబయలు దేరునప్పుడు నళిని కపటోత్సాహమును బ్రకటించియుండెను. కాని యది పూర్ణవిషాదముగ మాఱెను. ఆమెముఖము చింతావ్యాప్త మయ్యెను. ఆమెకీయనుమానమే బాధించుచుండెను. —ఏమాత నాయుమ్మ్యపథమునఁ దానడుగిడనుండెనో, యది యనేక కష్టములచే నిండియుండెనో యేమో!"

కమలనయనుఁ డింటికి వచ్చుట కాలస్యమైనందునఁ గల్యా ణీబాయి తనలోఁదానానందించుచుండెను. ఆమె నళినివంకఁదిలకిం

చి "చూచితివా? కమలనయనునిపనులెట్టివో! మీరు వత్తురని మె
ఱింగియు వాఁడు త్వరగా రాడయ్యెను. కొంచమాలస్యమైనను గా
నిమ్ము!" అనియెను.

వెంటనే కల్యాణీబాయి భోజనపదార్థములు సిద్ధముగ నున్న
వో లేవో చూతమని పాకశాల కేతెంచెను. ఆమె నళినిని గమల
తో వంటసేయుపనియందుంచి తాను ఘనానందబాబుతో నిశ్చింత
గా మాటలాడుచుండవచ్చునని, తలఁచెను. కమల భోజనపదార్థ
ములన్నియు సిద్ధపఱచి యొకమూలఁ గూరుచుండి యేమియో యా
లోచించుచుండెను. కల్యాణీబాయినిగాంచినంతనే యామె యులి
కిపడి లేచెను. "నీవువంటపనులలో మిక్కిలి పరిశ్రమఁగొనుచున్నా"
వనికల్యాణీబాయి యనెను.

వారందఱు భోజనమున కెప్పుడు లేచెదరు?',

"ఇప్పుడే లేచెదరు. కాని, నీవేటి కిట్లు కూర్చుండియున్నా
వు? ఇక్కడినీపనులన్నియుఁ బూర్తియైనచోఁ జావడిలోనికిఁ బోదము
రమ్ము. ఘనానందబాబుగారియెదుటసిగ్గుపడుట కేమియుఁ గారణ
ము లేదు. నళిని వచ్చియున్నది; ఆమెతో సంభాషించుచుఁ గూర్చుం
దుము."

నళినియెడ నసంతుష్టయై వచ్చిన కల్యాణీబాయికిఁ గమలపై
బ్రేమ ద్విగుణిత మయ్యెను.

కమల—(మెల్లగ) నేను నళినితో నేమి మాటడఁగలను!
ఆమెవిదుషీమణి. నేను మూర్ఖురాలను.

కల్యాణీబాయి—పిచ్చిదానివలెఁ బలుకుచున్నావు? బుద్ధివిష
యమున నీవెవ్వరికన్నను దక్కువదానవు కావు. కేవలము వ్రా
యుట చదువుటవలన నొక స్త్రీతనకుఁదోచినంతగొప్పతనముఁ దాఁ
దెచ్చి పెట్టుకొనుగాక! నీకన్న నాదరణీయ యగుకన్నియదొరకుట

ఉదని నామతము. పుస్తకములఁ జదివి యెవ్వారైనను విద్వాంసు లౌదురు; కాని, నీవలెఁ జతురయుఁ గర్తవ్యదక్షయు గృహలక్ష్మియు నగుట స్త్రీలందఱకును సాధ్యమా? రమ్మిటు రమ్ము, నేను నిన్నీ వేష మున నుంచుదానఁ గాను. నేఁడు నేను నాచేతులార నిన్ను శృంగా రించెదను.

నళినికి గర్వభంగ మొనర్పవలెనని కల్యాణీబాయి మనసారఁ దలఁచియుండెను. రూపసంపదయందును దనసతిచే నళినినిఁ బరాభ వముసేయింప నెంచియుండెను. కావునఁ గల్యాణీబాయి కమల కమూల్యవస్త్రముఁ గట్టనొసఁగి, యామె దేహ మమూల్యాలంకార ములచే శృంగారించెను. పిదపఁ గల్యాణీబాయి లక్ష్యపూర్వకముగఁ గమలముఖకమలమును దిలకించి 'ఇట్టిరూపవతి రాజాధిరాజుయొంతః పురమునసైతముండదు!' అనియెను.

కమల—అయిరుపురు నక్కడనే కూర్చుండియున్నారు. వారు మనసున నేమనుకొందురు?

కల్యాణీబాయి—ఏమైన ననుకొననీ! నేఁడు నేనుఁ జక్కగ నలంకరించిననేగాని నిన్నుఁ జావడికిఁ బోనిచ్చుదానఁగాను.

కమలను వస్త్రాలంకారవిభూషితురాలిం జేసి కల్యాణీబాయి యామెతోఁ గచేరిసావడికిఁ బోయెను. అప్పుడే కమలనయనుఁ డేతెంచి ఘనానందబాబుతో మాటలాడుచుండెను. ఆతనిఁ గాంచిన వెంటనే కమల వెనుకకు మరలెను; కాని; యామెను బోవనీయక కల్యాణీబాయి నిలిపి 'ఏమిూ? సిగ్గపడుటకేమున్నది?. వీరందఱును మనవారే!' అనియెను.

కమల యప్రతిమలావణ్యమును గాంచి కల్యాణీబాయికి గర్వాతిశయ మయ్యెను. ఆమెం గని యెల్లరు నాశ్చర్యచకితులు కావలెనని యామె యిచ్ఛయించుచుండెను. ఆమెమనసున నళినియా

త్కార్ష్యము నశింపఁజేయవలెనని యుండెను. అంతియేకాదు; కమల నయనుఁడు సైతము నళిని సామాన్యురాలని తలచునట్లు చేయవలెననియు నామెమనోభీష్టము.

కమలనుజూచి యందఱును చకితులైరి. నళిని కమలను మొదటచూచినపుడు కమల సాధారణవస్త్రమును గట్టియుండెను. అప్పుడామె లజ్జాసంకుచితయై యొకమూలఁ గూర్చుండియుండెను. కాని, నేఁడు వస్త్రాలంకార విభూషితయై యున్న కమలనవవికసిత సౌందర్యలావణ్యముంగని నళిని యాశ్చర్యచకితలోచనములతో నేకాగ్ర దృష్టియై కమలవంక నట్టె చూడఁదొడఁగెను. పిమ్మట నామె లేచి కమలను దనసమీపమునఁ గూర్చుండఁబెట్టుకొనియెను. కల్యాణీబాయికోరిక లీడేఱెను. నళినిపై విజయమందుటచే నామె ప్రసన్నచిత్తురాలయ్యెను. ఇట్టిసౌందర్యము దైవయోగముననే కన్నులఁబడు ననియెల్లవారు మానమునఁ దమలోనంగీకరించిరి. కల్యాణీబాయి తాను కృతార్థురాలనని భావించుకొని 'సతీ! నీవు నళినిని బిలిచికొని పోయి యాగదిలోఁగూర్చుండి మాటాడుచుండుము. ఇంతలో భోజన వ్యవస్థలన్నియు నేనొనరించెదను'' అనియెను

కమలహృదయమున ననేకతరంగము లుద్భవింపఁదొడఁగెను—''నళిని నన్నేబుద్ధినాదరించుచున్నదో యెవరెఱుఁగుదురు! ఈనళినియే యొక్కనాఁడీగృహస్వామినియగునుగదా!''

కమల నళినిని మాత్సర్యబుద్ధితోఁ దిలకించుచుండెనని చెప్పుటకు వలనుగాదు. ఈగృహమునకు స్వామినియగునధికారము తనదే యయియున్నప్పటికి నామె యాతలంపున్నప్తికిఁ దెచ్చుకొనరాదని నిశ్చయించుకొనియుండెను. ఆమె యీర్ష్యకుఁ దనయంతఃకరణమున స్థలమొసఁగునట్టిదికాదు. తనయధికారముచు దాను బోనాఁడియున్నదనియు, నిఁక నాగృహమున దనకు లేశమైన స్వాతంత్ర్యము లేద

నియుఁ గమలతలంచెను. నిరపేక్షాభావముతోఁ గల్యాణీబాయికిని గమలనయనబాబునకును సేవలొనరించుచుండుటకే యామె యిచ్ఛగించుచుండెను.

నలిని—(గమలతోఁ) నీవృత్తాంతమంతయును నేను వినియున్నాను. నీకష్టములకు నాకు మిగుల విచారమగుచున్నది. నన్ను నీసోదరివలె భావింపుము. నీకొకసోదరికలదా?

నళినియాడినయాస్నేహపూర్ణవచనములచే ధైర్యము తెచ్చుకొని కమల "నాకుఁ దోఁబుట్టువులెవ్వరులేరు; పెదతండ్రికుమారిత యున్నది" అనియెను.

నళిని—నాకెట్టిసోదరియును లేదు. నాచిన్నప్పుడే నాతల్లి గతించెను. తల్లిలేనందున నేనెన్నియోసంకటముల ననుభవించియున్నాను. నాకొక్కసోదరియుండునెడ నెంతబాగుగనుండును! మనసులోని దెవ్వరితోఁ జెప్పుకొనుటకు నెవ్వరునులేరు. ఈకారణమువలన జిన్ననాఁటనుండియు నాహృద్గతాభిప్రాయముల నాహృదయములోనే యణఁచిపెట్టుట నాకభ్యాసమైనది. ఇందువలన నన్ను లోకులు గర్వముకలదనుచున్నారు; నీవటులనవుకదా?

కమల—నేనునీమనసునకెక్కఁగలనో లేదో యనిశంకించుచున్నదానను. ఏలయన, నేను మిగులనజ్ఞానురాలను; మూర్ఖురాలను.

నళిని—(నవ్వి) నీకును నాకును బూర్ణముగఁ బరిచయమైన పిమ్మట నేనె యజ్ఞురాలనని నీకుఁ దెలియఁగలదు. మూఁడునాలుగు గ్రంథములు చదివినంతట నేమైనది? కావున, నేనిక్కడకువచ్చుట తటస్థించినచో నానేస్తము వీడకుము. ఎప్పుడైన నొకప్పుడు గృహకార్యభారమంతయు నాపైఁబడఁగలదని నాకు భీతియగుచున్నది. నాకు గృహకార్యనిర్వహణము చేతఁగాదు.

కమల—(సరళహృదయతో) ఇంటిపనులన్నియు నాపైనుంపుము. నేనందుఁ జాకచక్యముకలదానను. మనమిరువురము నొక్కహృదయముతో మెలఁగుదుము! నీవు నీపతిని సుఖపెట్టుము; నేనుమీకందఱకు సేవలొనర్చుచుందును.

నళిని—సరేకాని, నాయొక్కప్రశ్న కుత్తరమిమ్ము! నీవిప్పటికిని జక్కఁగఁ జూడనైనలేని; మఱినీవువారి నెట్లుస్మరింతువు?

కమల—పతిస్మరణసేయవలెనని నాకుఁ దెలియనే తెలియదు. నాదైవతంబ్రికుమారితయగు నన్నుపూర్ణదగ్గఱ నే నేర్చుకొంటిని. నేను నాపతినింతవఱకుఁ గాంచకుండుట నిశ్చయమే; కాని, వారియందలిభక్తిమాత్రము నాహృదయమున నెట్లుద్భవమయ్యెనో నేనెఱుఁగను. వారిప్పుడహోరాత్రములును నాహృదయమందిరమున నే సంచరించుచున్నారు; ఏకడఁగాంచిన నాకడ నాతనిమనోహరమూర్తి నాకు గన్నులపండువ నొనర్చుచున్నది. వారు నన్నుఁ ద్యజించిరనుకారణమున వారిసంస్మరణమును నేనెట్లుత్యజింపఁగలను! నామేనఁ బ్రాణములుండునంతదనుక నేను వారిచరణకమలములను నామనసున ధ్యానించుచుందుదానను.

కమల పలికిన యీభక్తిపూర్ణభాషణములకు నళినిహృదయము నీరయ్యెను. ఆమె కొంతతడవూరకుండి 'నేను నీమనోభావము నెఱింగితిని. ఇట్టిపూజలొనర్చుట యోగ్యమే. ప్రత్యక్షరీతి నొనర్చుసేవలు స్వార్థరహితముగ నుండఁజాలవు; అందెంతమాత్రమైనఁ బూజాఫలాపేక్ష యుండనేవలయు! నీవార్జించినయట్టి మనోవృత్తి యితరులకు దుర్లభము!

నళినిభాషణము లామెకుఁ బూర్తిగఁ దెలిసెనో లేదో, యెవరెఱుంగుదురు? ఆమె నళినిమోముపై దృష్టినిలిపెను. అవంతిర మొకింతతడవునకామెను 'నీపలుకులు నాకు సమ్మతమే. నేనంతఁ

కరణమున దుఃఖమును జొరనీయను; అనవరతము నానందనిమగ్నవై యుందును. నాకు లభించినయంతటితోనె సంతుష్టురాలనయి యున్నాను., అని పలికెను.

నళిని—నామనోవృత్తియు నీమనోవృత్తివలె శాంతిమయము యియుండునెడల నేనెంతయో ధన్యురాలనయియుందును!

కమల—(విస్మితయై) ఏటికి? నీకేట్టికష్టములున్నవి? నీవెల్ల విషయములయందును సుఖముగ నున్నావుకదా!

నళిని—ఇప్పటివఱకు నేను దుఃఖితనై యుంటిని. నీదర్శనము లభించినప్పటినుండియు నాకు నూతనధైర్య మలవడయున్నది. లేకున్న నేనింతవఱకు మాటలాడుటకు నాకు శక్తియెక్కడిది?'

ఇంతలో నొక్కదాసి యటకువచ్చినందున వారిసంభాషణమున కాటంకముకలిగెను.

---

## ఇరువది యొనిమిదవ ప్రకరణము.

---

### దైవవైచిత్ర్యము.

కల్యాణీబాయి గృహమునుండి మగిడివచ్చినపిదప నళిని తనశయనగృహమున కరిగెను. బల్లపై నొకజాబుండెను. ఆయుత్తరముపై వ్రాయఁబడియున్నయక్షరముల గని యాయుత్తరము రమేశచంద్రుఁడు వ్రాసెనని నళిని యూహించెను. ఆమెగుండియలు దడదడఁ గొట్టుకొనసాగెను. గదితలుపులుబిగించి మంచముపైఁ బరుండి యామె కంపితహస్తముతో నాయుత్తరమును బట్టుకొని చదువఁ బ్రారంభించెను.

ఆకమ్మలో రమేశచంద్రుఁడు కమలావృత్తాంతమంతయుఁ సవిస్తరముగ లిఖించి తుదనిట్లు వ్రాసెను—'ఈశ్వరుఁడు మన యొండొరులపైఁ బ్రేమబంధమును దృఢపఱచియుండెను. కాని, దానిని నీవే త్రెంచివైచితివి. నీవు నీహృదయము నితరున కర్పణముచేసితివని నిన్ను నేను దూషించుచుండలేదు. నీవును నన్ను దూషింపవలదనిమాత్రమే నిన్ను నేను ప్రార్థించుచున్నవాఁడను. నేనొకనాఁడైనను గమలతోఁ బత్నీభావమునఁ బ్రవర్తింపకుండినను మెల్లమెల్లగ నామె నాహృదయమును దనకడకు లాగికొనినదనిమాత్రము నిశ్చయముగ వచింపఁగలను ఈవిషయము నీకడఁ బ్రాంజలినై యొప్పుకొనుచున్నాఁడను. నేఁడు నాహృదయస్థితి యెట్టులున్నదో నేను వచింపఁజాలను; కాని, నీవు నన్నుఁ ద్యజింపకయుండునెడల నీయాశ్రయమున నేను నాచిత్తమును శాంతపఱచియుందును. ఈయాసతోడనే నేనునీకడకుఁ బరుగెత్తుకొనివచ్చితిని. కాని, నీవునన్ను గాంచినంతనే తిరస్కారముతో తటాలున నావలికేగుటఁగనియు, నీవితరుని వివాహమాడనిచ్చగించుచున్నావనివినియు నాహృదయము విషణ్ణమయ్యెను. కానిమ్ము! నేను శాంతచిత్తముతో నీయనుజ్ఞ వేఁడుచున్నాడను నేను నీయొద్ద శాశ్వతముగ సెలవుఁగొనుచున్నాఁడను, ప్రత్యక్షమున నీసెలవందునపుడు నాకావంతయు దైన్యమనుభవమునకు రాకుండుఁగాకయనిమాత్రమే నేను పరమేశ్వరుని బ్రార్థించుచున్నవాఁడను. నీకు సుఖము గలుగుఁగాక! నీకుఁ గళ్యాణమగుఁగాక! నన్నెన్నఁడును దిరస్కారభావముతోఁ జూడకుము; ఏలయన, నటుసేయుటకు నీకెట్టికారణములును లేవు.'

ఘనానందబాబు పడకకుర్చీపైఁ బుస్తకమును జదువుచుఁగూర్చుండియుండెను. ఆకస్మికముగా నళిని యెదుటనిలిచియుంట గని ఘనానందబా బులికిపడెను. 'నళిని! నీమో ముదాసీనభావము

వహించియున్నయది! దేహము బాగుగనున్నదికదా?' అని ప్రశ్నించెను.

'ఆఁ! రమేశబాబునొద్దనుండి నాకీయుత్తరము వచ్చియున్నది. చదివిచూడుఁడు!'

అనివచించి యాయుత్తరము ఘనానందబాబునకిచ్చి నళిని వెడలిపోయెను. ఘనానందబాబాకమ్మను విచారపూర్వకముగఁ జదువుకొనియెను. అనంతరము కొంతతడవాలోచించి తనలో "ఇదియు నొకవిధముగ మంచిదే. యోగ్యతవిషయమునఁబరికింప రమేశునికన్నఁ గమలనయనుఁడు నూఱురెట్లుత్తముఁడు! రమేశచంద్రుఁడు తనంతటతానే వెనుకకుఁదగ్గుటయుఁ జాలమంచిదే!' అని యనుకొనియెను.

ఘనానందబాబుడెందమున నిట్టియాలోచనము జరుగుచుండఁ గమలనయనబాబాతనియెదుట సాక్షాత్కరించెను. అతనిఁ గని ఘనానందబాబాశ్చర్యపడియెను. నేఁటియుదయముననే ఘనానందునకుఁ గమలనయనబాబు దర్శనము లభించియుండెను. వెంటనే మరలివచ్చుటకుఁ గారణమేమి? వృద్ధుఁడు నవ్వి తనలో నిట్లనుకొనియెను. 'ఇఁక వేఱుకారణమేమున్నది! నళినినిదర్శించి యామె సాన్నిధ్యమునఁ గొంతతడవుండుటకై యితఁడు వచ్చియుండనోపును!'

ఏవిధముగానైన నళినినితనితో నిట నొంటిగా డించి మెల్లఁగ నచటనుండి వెడలిపోవుటకు ఘనానందబాబాలోచించెను. ఇంతలోఁ గమలనయనబాబు 'ఘనానందబాబుగారూ? మీకుమారితను నాకిచ్చి వివాహముసేయుటకు నిశ్చయింపఁబడెనని నాకుఁ దెలియవచ్చినది. ఈవిషయము మించిపోకమునుపే నేను కొంతమాటలాడవలసియుండి యిటకు వచ్చియున్నాఁడను' అనియెను.

'ఆటంక మేమున్నది? సవిస్తరముగఁ జెప్పవచ్చును

'నాకొక్కసారి వివాహమయియున్నదని మీకుఁ దెలిసినే యుండవచ్చును?'

'ఔను; కాని—'

'నాపత్ని మృత్యుముఖమునఁ బడెననిమీరందఱు ననుకొని యుందురు. కాని, యాతలంపు నిశ్చయమైనదని నేననఁజాలను. ఆమె బ్రదికియుండుటయు సంభవమే. నాకేమో యామె జీవించియు న్నదనియే నమ్మకము.'

'ఈశ్వరుఁ డట్లే యొనర్చుఁగాక! మీపలుకులు సత్యము లగుఁగాక!' అని ఘనానందబాబు నళినిని బిలిచెను.

నళిని కచేరిచావడికివచ్చిన పిమ్మట ఘనానందబాబామెతో 'రమేశచంద్రు నిజాబులోనిసంగతులు వీరికిఁ జదివివినిపింపవలయునని నాయభిప్రాయము—''

ఆతనిసంభాషణము పూర్తికాకమునుపే నళిని ''ఆయుత్తర మాద్యంతమును జదివివినిపించినను నాయభ్యంతరములేదు '' అని చెప్పి వెడలిపోయెను.

ఉత్తరమునుజదివి కమలనయనబాబాశ్చర్యనిమగ్నమానసుఁ డయ్యెను.

ఘనా—''ఇట్టివైచిత్ర్యములు దైవసంఘటనమువలన నీవు డమి నరుదుగ సంభవించుచుండును! ఉత్తరములోనిసంగతులు తెలి సికొనుటచే మీకు ఖేదముకలిగియుండును. కాని, ఈవిషయములు గుప్తముగ నుంచుట యన్యాయమని నాకుఁ దోఁచెను '' అని యెను.

కమలనయనబాబు కొండొకసేపు స్తబ్ధముగానుండెను. పిమ్మ ట నావృద్ధగృహస్థునకు నమస్కరించియతఁడు వెడలిపోయెను యట్లు పోవునప్పుడాతనికుడివైపుననున్న నడవలో నళిని నిలిచియుండు టాతఁ

డుచూచెను. ఆమెనుజూచినప్పుడాతనిమనసున నొకవిధమగువిచారముద్భవించెను. ఆమె తనతో నేమైనఁబలుకనుద్దేశించి తనరాకకై నిరీక్షించుచు నచట నిలిచియుండెనేమోయని తలఁచి కమలనయనుఁడామెమాటాడుటకవకాశము కలుగఁజేయునూహతో నామె నిలిచియున్నస్థలమునకు సమీపమునుండి పోయి తోఁటలోనికేగు మార్గమున నిలిచెను. కాని, నళిని తానునిలిచియున్నస్థలమున నుండలేదు. లోనికి వెడలిపోయియుండెను. హృదయముతో హృదయము సమ్మేళనమగుట సులభముకాదని తనలోననుకొనుచుఁ గమలనయనుఁడు వెడలిపోయెను.

అనంతరమల్పకాలమునకే యోగీంద్రుఁడేతెంచెను. ఘనానందబాబాతనిఁజూచి "ఒక్కఁడవేవచ్చితివేమి?" అనిప్రశ్నించెను.

"ఇఁక నెవ్వరినిదీసికొనిరావలయును?"

"రమేశచంద్రుని."

"ఆతనిపేరింకను నుచ్చరించెదరేమి? ఆతనికిఁ దొలుతఁగలిగినయాదరసత్కారములు చాలవా? "సతాంమానేస్లానంమరణమథవాదూరగమనమ్." అనునట్లుగా నాతనికీపాటికి గంగానదిని జలసమాధికలుగకున్నయెడలఁగదా! ఆతఁడెచ్చటికేగియుండునో నేను చెప్పఁజాలను. బల్లపై నొకయుత్తరము పడియుండెను; ఆయుత్తరముపై "వెడలితిని; మీ, రమేశుఁడు" అనిమాత్రము లిఖింపఁబడియుండెను. ఇట్టికవిత్వము నావలనఁగాదు నేను నిక్కడనుండి వెడలనేవలయును; కాని, నేను స్పష్టముగా నుడువుచున్నాను. నాయుద్యోగము బాగుగనేయున్నది"

"నళినివివాహవిషయమై యేదైన నిశ్చయ—"

"మరల నావిషయమునుగూర్చి చర్చింపకుఁడు. నేను నిశ్చయింపవలయునా! మీరద్దానిని మానవలయునా!—ఈమాటలు

నాకురుచింపవు. మీ కెట్టులిష్టమో యట్టులొనర్పుఁడు. అంద నవసరముగ సంబంధము గల్పించుకొనుట కేనెవ్వఁడను? రేపటిదినమే నేనిక్కడనుండి వెడలిపోవువాఁడను."

ఘనానందబాబేమియు మాటాడలేకపోయెను. అతనివిచారము మఱింతవృద్ధియయ్యెను. ఆతనికీభూమండలమంతయు వికటముగనున్నట్లు కనఁబడఁజొచ్చెను.

---

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.

---

"నాయెదుటనీకీసిగ్గేటికి!"

చక్రవర్తి యన్నపూర్ణాసహితుడై కమలనయనబాబుగృహమునకరిగెను. అన్నపూర్ణ కమలతో ముచ్చటలాడుచు గదిలోఁ గూర్చుండియుండెను.

చక్రవర్తి—నా సెలవుదినములుగడచిపోయినవి. రేపు నేను గాజీపురమున కేగుచున్నాను. సతివలన మీ కేదేనాయాసముకలుగుచున్నను—ఆమెనిటనుంచుకొనుట మీకిష్టము లేకున్నను—

కల్యాణీబాయి—అందేదియును గాదు. మీరేకారణముచేనైన నామె నిక్కడనుండనీయక మీతోఁ బిలుచుకొనిపోవనెంచిన యెడలమాత్రము—

చక్రవర్తి—సరిసరి! అట్టిదేమియును లేదు. నేనామెను మీ కర్పించివేసితిని. మరలనాతోఁ బిలిచికొనిపోవుట కిచ్చగింపను. నేను ననుసదంతియే; మీ కామెమూలమున నెట్టియాయాసమైన కలుగుచున్నదని తోచినయెడల—

కల్యాణీబాయి—మీరేమిట్లనుచున్నారు! సతిఁబోలిన లక్ష్మి గృహమున నున్నంతవఱకు నాయాసమనుమాటయెత్తుట సంభవింప దని మీరెఱిఁగియుండియు—

చక్రవర్తి—చాలు! సతివిషయమై మీనిశ్చయమైన యభిప్రాయమేమో తెలియవలెనని యిట్లంటిని. ఏలయన, నాసతిహృదయ మత్యంత కోమలము. ఈపీట మనయింటికెక్కడనుండివచ్చెనో యని కమలనయనునకుఁ దోఁచుచుండు నెడలను, ఆమూలమున నాతఁ డొకింత యసంతుష్టిని బ్రదర్శించు నెడలను, మాసతి కసహ్య వేదన ముకలుగును.

కల్యాణీబాయి—రామ రామ! కమలనయనుఁ డీబాలికపై కోపించునా! కోపమన నేమియో యాతఁ డెఱుఁగఁడు.

చక్రవర్తి—కాని, నేనల్పసంతుష్టుఁడనుగాను. కమలనయనుఁ డామెపైఁ గోపింపఁడని వినియు నామనసు సమాధానమందదు. అతఁ డామెతో స్నేహభావమున వర్తింపవలయును. ఆమెను స్వకీయ యని తలంపవలయును. అట్లుకాకున్న నామె వ్యథనొందుటకుఁ గారణమగును. ఆమె యింటిగోడ కాదుకదా! ఆమెయు నొక మానిసియే ఆమెతో నుదాసీనభావమున మెలఁగుటయు—

కల్యాణీబాయి—చక్రవర్తిజీ! మీరామెను గూర్చి యించుకైనఁ జింతింపనక్కరలేదు. మాకమలనయనుఁడు నత్యంతకోమల హృదయుఁడు. సతిదుస్థితియంతయు నతనికిఁదెలియును. ఆమె కేరీతిని సమాధానమగునో, యామెకెందున సౌఖ్యముకలుగునో, యని యతఁడును నాలోచించుచునే యున్నవాఁడు. వాఁడు తనమనోగతమును మాత్ర మెవ్వరికిని దెలియనీయఁడని—

చక్రవర్తి—ఇప్పుడు నామది నెమ్మది వహించినది. నేను నావిషయమై కమలనయనునకుఁ గొంచెము సూచింతును. "సతి

పరకీయయని భావించుచు నామెతో సంకోచవృత్తిని సంచరింపరాదు శుద్ధహృదయముతోడను; సరళమానసముతోఁడను మాటాడు చుండవలయును. ఆమెస్వకీయయనితలఁచి యామెయొనరించు సకల సేవలఁ బరిగ్రహణము సేయవలయును.'' అని నేనొక్క మాటాత నితో జెప్పవలయును.

చక్రవర్తిగారికిఁ గమలనయనునిపైనున్న యావిశ్వాసముఁ గని కల్యాణీబాయి యాశ్చర్యముగ్ధయయ్యెను. ఆమె "మీకిష్టము గనుండదేమోయనుభీతిచే నేనే సతినాతనియెదుట స్వేచ్ఛగ సంచ రింపనిచ్చుటలేదు. కాని, నాపుత్రునిస్వభావము నేనెఱుంగుదును. మీరాతనివిషయమై యేమాత్రమును జింతింపఁబనిలేదు; ఆతడె న్నఁడును ధర్మబాహ్యకృత్యము లొనర్పఁబోఁడు కాఁడు'' అనియెను.

చక్రవర్తి—ఇఁకసర్వముస్పష్టముగ వచించుటకేమాటంకి మున్నది? కమలనయనునకు వివాహము కానుండి యందునకు విఘ్న ముకలిగెనని నేను వినుచున్నాఁడను! వధువుసుశిక్షిత చతురయై నను వ్యవహారచతురకాదని తలఁచెదను. ఆసమాజముయొక్కయు మనసమాజముయొక్కయు నాచారవ్యవహారములు భిన్నములు. కా వున, నాకేమిఁతోచుచున్నదనగా మనసతికామెమూలమున నేదై వశ్రమ—

కల్యాణీబాయి—ఇదినాకుఁదెలియుచుండలేదా? ఔను; అ ట్టిదేకాని, యావివాహముజరుగదు.

"ఏటికి?"

కల్యాణీబాయి— కమలనయనునకు వివాహమాడుటకిష్టము లేదు. నాకు సాధ్యమైనంతవఱకు నేను వానిబలవంతపఱచితిని; ఇం తకంటె నిఁక నేనేమిచేయఁగలను? ఈశ్వరేచ్ఛయెట్లున్నదో యట్లు జరుగును. ఆతనిమనసున నేను 'నాకోడలిముఖమును జూడఁగూడ దన్నతలంపున్న యెడల నామాట యేమిసాగివచ్చును!

చక్రవర్తి—మీరిట్లు మాటాడరాదు. మేమువచ్చియున్న దెందులకు? పెండ్లిమాటలుకుదిర్చి పిండివంటలుతినకుండ మేమిటనుండి వెడలిపోవుద మనుకొనకుఁడు.

కల్యాణీబాయి—మీనోటశర్కరాఘృతముపడుఁగాక! మా కమలనయనుఁ డీవిధముగనే బ్రహ్మచారియై యుండునేమో యని నాకు భీతికలుగుచున్నది. కావున, నే జీవించి యుండగనే, నాకన్నుల యెదుటనే, మీరాతనిగృహస్థాచారప్రవృత్తునిగఁ జేసితిరేని నాకెంతయో సంతుష్టిగనుండును.

చక్రవర్తి—అన్నియు గాఁగలవు మీరు నెమ్మది వహింపుఁడు. అన్నియు మీయిచ్ఛానురూపముగనే జరుగును. ఈప్రియమున మీకు సేశుశ్రూషలుసేయఁగలయువతియే లభింపఁగలదు; మీ మనోరథ మీడేరఁగలదు; ఈడేరఁగలదననేల? ఈడేరియే యున్నం దనుకొనుఁడు మీరనుజ్ఞనొసఁగితిరేని. కర్తవ్యపాలనమునుగూర్చి సతికి నాలుగుమాట లుపదేశించి వచ్చెదను. అన్నపూర్ణయు మిము దర్శింప నుత్సుకయైయున్నది.

కల్యాణీబాయి—మీరాయిరువురతో నాకింతతడవు మాటలాడుచుండుఁడు. నేనిప్పుడేవచ్చెదను.

చక్రవర్తి గదిలోనికేగిచూచెను; కమలనేత్రములనుండి యశ్రువులు ధారగాఁబ్రవహించుచుండెను. అన్నపూర్ణ తండ్రితో "కమలనయనబాబుతో నెల్లయుదంతములు విశదీకరింప నిదియే తగుసమయమని నేనిందున నీమె పిచ్చిదానివలె నేడ్చుచున్నది." అనియెను.

కమల—నీపాదముల వ్రాలెదను; నీవంత పనిసేయకుము.

అన్నపూర్ణ—నీకేమిపిచ్చియా? నీవిట స్తబ్ధముగానుండుటయు, నటఁ గమలనయనబాబు వళినిని వివాహ మాడుటయు మేలా?

హాహమైన నాటనుండియు లజ్జ నిన్నావరించి యున్నయది; ఇప్పుడును నీకావశ్యకమే!

కమల—నాయుదంతమంతయు నొకరియెదుట సవిస్తరముగ నుడువునట్టిదా! నీవాయుదంతమును జెప్పుచో లజ్జచే నేఁజచ్చిపోవుదును!

ఇందువలనఁ బ్రత్యుత్తర మొసఁగుట కన్నపూర్ణకు వలనుగాకపోయెను. కాని, యామెకుఁ గమలనయనుఁడు నళినిని వివాహమాడుట యిష్టములేదు.

చక్రవర్తి—కాని, యది నిశ్చయముగా జరుగుననుట కేమాధారమున్నది? ఆవివాహ మాగిపోయినది. కమలా! ఇఁక నీకెట్టిభయమును లేదు.

కమల యాశ్చర్యచకితలోచనములతోఁ జక్రవర్తివైపునకుఁ జూడఁదొడఁగెను.

అన్నపూర్ణ—(హర్షరోమాంచితయై) ఈశ్వరుఁడే కృపచేసెను! కాని, బాబా! నేనొక్కటి యడుగుచున్నాను; కమల యీవిధముగ దాసివలె నీగృహమున నెంతకాలముండఁగలదు? ఆమె యధికారము నామెకు లభింపఁజేయుట కేయుపాయమును లేదా?

చక్రవర్తి—నీకీ భయమెందులకు? సమయము వచ్చినప్పుడు కదా సమస్తమును సమకూరుట!

కమల—నేను మీయందఱ పాదములపైఁ బడెదను, లభించినంతయే నాకిపుడుచాలును. మీరెవ్వరి నేమియు ననకుఁడు. నన్నుమదిగ నన్ను వారిసేవ సేయనిచ్చినఁ జాలును. నేను మీయెడలఁ గృతజ్ఞురాలనయి యుండెదను. (ఆమాటలను వచ్చుడు కమల నేత్రములశ్రుపూరితములయ్యెను.)

చక్రవర్తి—బిడ్డా! ఏడ్చెదవేల? నీశాంతత్వమున నీకొకింత

యు వ్యత్యయము జరుగదు. ఈశ్వరేచ్ఛవలన నన్నియు ననుకూలముగ నున్నవి; ఇఁకముందు నీయిష్టప్రాప్తి తనంతనే కలుగఁగలదని తోఁచుచున్నది. ఇఁక నేనందు సంబరిధముఁ గల్పించుకొననేమిటికి?

ఇంతలో నుమేశుఁడు నవ్వుచు మెల్లగ నటకేతెంచెను.

చక్ర—నవ్వుచున్నావేమిరా ?

ఉమేశ—రమేశబాబుగారు వచ్చియున్నారు. డాక్టరుబాబుగారి సందర్శనమునకై వేచియున్నారు.

కమలవదనము వెలవెలఁబొతెను. చక్రవర్తి కమలతో "భయపడకుము. ఇంతలో నన్నియుఁ జక్కపడఁజెదను. అనియెను.

చక్రవర్తి రమేశచంద్రుని సమీపించి 'రమేశబాబూ! ఇటువచ్చితిరి త్రోవఁదప్పితిరాయేమి?' అని యడిగెను.

రమేశ—(ఆశ్చర్యముతో) మీరిక్కడ కెట్లువచ్చితిరి!

చక్ర—ఇట్లేవచ్చితిని. సరేకాని. మిమ్మొక్కమాట యడిగెదను. మీరు కమలనయనునికడ కేలవచ్చితిరి?

రమేశ—కమలయుదంత మాద్యంతమును గమలనయనబాబుతో జెప్పఁదమని వచ్చితిని. కమల జలమునఁబడి చావలేదు; ఆమె బ్రదికియేయున్నదని నాకిప్పుడప్పుడు తోఁచుచున్నది.

చక్ర—కమల జీవించియే యున్నదనియుఁ, గమలనయనుకు నామెకు సందర్శనము సంఘటించెననియుఁ దలంపుఁడు. అట్లయినచోఁ గమలసర్వోదంతమును మీరాతని కెఱింగించినయెడల నాతనికెంతవఱ కానందము గలుగఁగలదో యాలోచింపుఁడు.

రమేశ—అదెట్లయినఁ గానిండు; కాని, కమల నిరపరాధినియనియు, పరమపవిత్రయనిమాత్ర మాతఁడు తెలిసికొనవలయును గదా !

చక్రవర్తి—మీకేమితోఁచినసరే. నాకేమో యిది విచిత్ర

కార్యమనియే తోఁచుచున్నది! సరి ఇంతమాత్రమైనఁ జేయుఁడు! నేనీసమీపముననయుందును. మీరక్కడకు రేపటియుదయమొక్కసారి దయసేయుఁడు. అంతవఱకుఁ గమలనయనబాబుసందర్శనము మానుఁడు.

రమేశ—మంచిది; అట్లేకానిండు.

అనివచించి రమేశచంద్రుఁడు వెడలిపోయెను.

చక్రవర్తి మరల లోనికివచ్చి కమలతో "రేపటియుదయమున రమేశబాబు మనగృహమునకు వచ్చును. అక్కడకు నీవు వచ్చి సకలవృత్తాంతమును గుప్తముగానుంచుమని నీవాతనితోఁ జెప్పుము. సిగ్గువడి చేయునదేమున్నది? నీవు ప్రయత్నించి నీయధికారమును సంపాదించుకొనవలయును.

కమల క్రిందికిఁ జూచుచుఁ గూర్చుండెను. ఎవ్వరిదో యడుగులచప్పుడు విని యామె తలపైకెత్తిచూచెను. ద్వారముకడఁ గమలనయనబాబునిలిచియుండెను. ఒండొరులదృష్టిసమ్మేళనమయ్యెను. ఇంతకుమున్నెన్నఁడైనను గమలనయనుఁడు కమలను జూడఁదటస్థించినప్పు డామెదృష్టి యటతిరిగెనేని యాతఁడు తనదృష్టిని మరియొకప్రక్కకుఁ ద్రిప్పుకొనుచుండెడివాఁడు. అంతియేకాదు; అక్కడనుండి యతఁడు వెడలిపోయెడివాఁడు; కాని, నేఁడాతఁడు దీర్ఘకాలము వఱకు నట్టె యేకాగ్రదృష్టితో నీక్షించుచుండెను. కాని, యామె యామధురదృష్టి మరలఁజూచుసౌభాగ్య మాతనికి లభింపలేదు; అన్నపూర్ణ యటఁ గూర్చుండియుంటఁ గని కమలనయనుఁడు వెడలిపోవనుద్యుక్తుఁడయ్యెను; అంతలోఁ జక్రవర్తిగారతనితో "ఈమె నాపుత్రిక; ఈమెబిడ్డయే రోగగ్రస్తమైయున్నప్పుడు మీరు చూడవచ్చుచుంటిరి" అని చెప్పెను.

చక్రవర్తి కమలనయను నందే కూర్చుండఁబెట్టికొనియెను. ఆతఁడు వెనుకకుమరలిచూచెనుగాని, కమలయందుండలేదు. భోజనముముగిసెను; కళ్యాణీబాయియుఁ గమలనయనుఁడును జావడిలో మాటాడుచుఁ గూర్చుండియుండిరి; చక్రవర్తి కమల నక్కడకుఁ బిలిచికొనివచ్చెను; ఆమెవెనువెంటనే యన్నపూర్ణయు వచ్చెను.

చక్ర—కమలనయనబాబూ! మీరు మాసతిని బరకీయవలెఁ గాంచకుఁడు! ఆమె చిరదుఃఖినియైయున్నది; ఆమెను మీయింట డించిపోవుచున్నాము. మీరు మీసేవలొనర్చునధికారము సంపూర్ణముగ నామెకిచ్చివేయుఁడు! ఆమె తెలిసియైనఁ దెలియకయైన లవమాత్రమునపరాధ మొనర్చునదికాదు. ఒకవేళ నట్లుచేసెనా మీరు క్షమింపవలయును.

కమల లజ్జతోఁ దలవంచి కూర్చుండి యుండెను. కల్యాణీబాయి "చక్రవర్తిజీ! మీరు లేశమును జింతింపఁబనియేలేదు. సతిని నాకడుపునఁబుట్టినబిడ్డవలెనాదరింతును, గృహకృత్యములవిషయమై యామె కెవ్వరు నేమియుఁ జెప్పనక్కఱలేదు. ఇప్పుడే యీమె గృహమునను, సేవకజనులమీఁదను నధికారముసాగింప మొదలిడియున్నది. నాయొద్దనుండి ముఖ్యమగుదాళపుఁజెవులుసైతమామె లాగికొనినది. చౌర్యమునఁ బ్రవీణయైనయీసతి కింకేమికావలయునో చెప్పుఁడు!" అనియెను.

చక్రవర్తి—మీరీప్రకారముగానే యెల్లకాలము నీమెపైఁ బ్రసన్నులై యుండవలయును; ఇదియే యీశ్వరునికడ మాప్రార్థన.

మాటలాడుచుండఁగనే చక్రవర్తినేత్రములలో నశ్రువులు ప్రత్యక్షమయ్యెను; కమలనయనబాబు నిశ్చలమానసముతోఁ జక్రవర్తిపలుకుల నాకర్ణించుచుండెను; అందఱును వెడలిపోయినయనంతర మాతఁడు తన శయనగృహమున కేగెను. శీతకాలము సంజకెంజా

యచే నతనిపడకటిల్లొక విధముగు నెఱ్ఱనిరంగుతో సుశోభితమయి యుండెను. ఆరంగు నవవివాహరక్తచ్ఛటలఁ బ్రదర్శించుచుండెనో యనునట్టులుండెను; ఆరక్తప్రభ కమలనయనుని రోమరంధ్రద్వార ములఁ బ్రవేశించి యతని మనసునుసైత మనురంజిత మొనరించెను! కమల యటనున్నబల్లపై గులాబీపువ్వులుంచియున్నందున నాపుష్ప సుగంధముచే గదియంతయుఁ బరిమళించుచుండెను; ఆ శూన్యగృహ మునఁ బ్రవేశించుచున్న సంధ్యాప్రకాశముచేతను, గులాబీపువ్వుల సుగంధముచేతను నతనిమనసు చంచలమయ్యెను; ఇన్నిదినములు నాతని హృదయమున శాంతియుండెను; జ్ఞానగాంభీర్య ముండెను; స్థైర్యమునుండెను; నలుగడలను సంయమనశక్తి కావలియుండెను, కాని, నేఁ డాతనిహృదయమున ననేకవిధముల మధుర శబ్దము లెసం గువాద్యము లెటనుండి వాయింపఁబడుచుండెనో యెవ్వరికెరుక? ఏదయ్యదృశ్యనర్తకి తన పదవిన్యాసములయు, నూపురములయు ధ్వని మూలమున సాశాంతికుటీర రంగమునఁ బర్యవసానముండెనో యెవరు నెఱుగఁజాలరు! కమలనయనునిదృష్టి మంచమువైపునకుఁ బ్రసరిం చెను. శయ్యపై శిరోభాగమున గులాబిపువ్వు లుంచఁబడి యుండెను. కమలనయనుఁ డాపుష్పములలోఁ బసపురంగుగల పుష్పము నొక్క దానిని దీసికొనియెను. ఏదేశాక కోమలహస్తాంగుళీస్పర్శమైనట్లాతని హస్తమునకుఁ దోఁచెను. అతని దేహము పులకరించెను. అతడాపుష్ప మును దన కనురెప్పలపైఁ ద్రిప్పుకొనసాగెను! సంధ్యాసూర్యప్రభ క్షీణమయ్యెను. కమలనయనబాబు పడకటింటినుండి వెడలిపోవనుద్యు క్తుఁడయ్యెను; ఇంతలో మంచమున కట్టువైపున నొకమూల నొక యువతి ముఖముపై ముసుగు వైచికొని లజ్జచేఁగాఁబోలు నధోవద నయై చూచుచున్నట్టు లతనికిఁ గనబడెను. కమల సిగ్గున కంతము లేకపోయెను. ఆమె కమలనయనుని శయ్యపై గులాబీపువ్వులనుంచి

పోవఁజూచునంతలోఁ గమలనయనుఁ డచటి కేతెంచెను. ఆమె మంచమున కటువైపున డాఁగెను. సంయోగవశమునఁ గమలనయనుఁడును నచటికరుదెంచెను. ఆమెకిపుడు తప్పించుకొని పోవుటకు వేఱు మార్గము లేకపోయెను. ఆ యువతి యచ్చటనే సంకుచితగాత్రయై నిలిచిపోయెను.

లజ్జాసంకుచితయగు నీ తరుణీమణి లజ్జావిముక్తఁగా నొనర్చుటకై కమలనయనుఁడు బయటికి వెడలిపోవసాగెను; కాని; యతఁడు ద్వారమువఱకుఁబోయి యతనిమానసున నేమితోఁచెనో తెలియదు గాని, వెనుకకుఁదిరిగివచ్చి కమల సమక్షమున నిలిచి "నాయెదుట నీవింత సిగ్గుపడెద వేమి?" అనియెను.

---

## ముప్పదవ ప్రకరణము.

### "నావృత్తాంతము నెవ్వానికిని జెప్పవలదు!"

మఱునాఁ డరుణోదయముననే కమల చక్రవర్తిగారి గృహమున కరిగెను. ఏకాంతముననే నన్నపూర్ణను గాంచినంతనే కమలయామె మెడచుట్టును జేయిఁ బెనవైచి కౌఁగిలించుకొనియెను. అప్పుడన్నపూర్ణ కమలగడ్డమునుబట్టుకొని సంతోషముతో 'ఏమే చెలీ! నేడు నీకింత యానందమగుట కేమి కారణమే?" అని యడిగెను.

"నాకుఁ దెలియదు; కాని, నాహృదయములోని భారమంతయు దగ్గిపోయెనో యనునట్లు నాకగపడుచున్నది."

"చెప్పుము! చెప్పుము; ఏమేనయ్యెనో! మేము వెడలివచ్చిన పిమ్మటనింకేమేమి జరిగెనో చెప్పుము."

"ఏమియును లేదు. నాకు దోఁచుచున్నదికదా. నాయభీష్టములన్నియు సమకూడినవని—సర్వేశ్వరునకు నాపైఁ గృపఁగలిగినది."

"నీయదృష్టము నమితోత్కటమగు సుఖమున్నది; నీకే దేదిలభింప వలయునో యన్నియుఁ దప్పక లభింపఁగలవు!"

"నాకన్నియు నులభించినవి. ఏవంకను నాకేమియుఁ గొఱఁత లేదు. నేనిఁక విధాత నెంతమాత్రమును దూషింపను; నాకుఁ గావలసి నదంతయు నాతఁడు దయచేసెను."

అంతలోఁ జక్రవర్తి గారిని కేతెంచి "కమలా! కొంచమిటురమ్ము; రమేశబాబు వచ్చియున్నాఁడు." అనియెను.

ఇంతవఱకును జక్రవర్తి గారాతనితో మాటలాడుచుండిరి. ఆయన రమేశచంద్రునితో "మీకుఁ గమలతో నెట్టిసంబంధముండెనో సర్వము నేనెఱుంగుదును. నేనిపుడు మీకింతమాత్రమే చెప్పుచున్నాను; మీయొద్దఁ గొంతకాలము కమలనివసించియుండెనని మీరెవ్వరితోడను జెప్పవలదు." అని చెప్పియుండెను.

అందునకు రమేశుఁడు "సర్వవృత్తాంతము నొక్కచూరు కమలనయనబాబుగారికెఱుకపడఁ జేయకున్న నాహృదయము నిలువదు." అనియెను.

"సరే! మీరుండుఁడు; నేనిప్పుడే వచ్చెద" నని చెప్పి చక్రవర్తి వెడలిపోయెను. రమేశుఁడటనున్న కిటికీమార్గమున బయట దిరుగుచున్న జనులఁ జూచుచు నిలుచుండెను. ఒకింతతడవునకుఁ బాదధ్వనులు వినరా నతఁడు వెనుకకుఁ దిరిగి చూచెను. ఒక తరుణి నేలపైఁ దలనిడి యతనికిఁ బ్రణామము సేయుచుండెను. రమేశచంద్రుఁ డుండఁజాలక పోయెను. అతఁడు "కమలా!" అని పిలిచెను. కమల చిత్తరువు బొమ్మవలె నిశ్చేష్టయై నిలిచెను.

చక్రవర్తి—రమేశబాబూ! నేటివఱకుఁ గమల యెట్టికష్టములకు సైచియున్నదో మీరెఱింగియేయున్నారు. ఇప్పుడీశ్వరుఁడామెకు సౌఖ్య

దినములఁ గూర్పెంచియున్నట్టులగపడుచున్నది. ఆమె కష్టసమయములలో మీరామెను సంరక్షించియున్నారు; ఆమెకు మీరొనర్చిన యుపకార మల్పమైనది కాదు. ఈమె నేఁడు మీయొద్ద శాశ్వతముగ సెలవు వేడుచున్నది. ఈమెకు దీవెనలొసఁగిపంపుఁడు.

రమేశుఁడొకింతతడవూరకుండెను; అనంతరమాతఁడు కంపిత స్వరముతోఁ దడఁబడుపలుకులతోఁ "కమలా! నీవు సుఖమనుభవింతువుగాక! నీసౌఖ్యము వృద్ధియగుఁగాక! తెలిసియో తెలియకయో నీయెడల నేనెట్టి అపరాధము సల్పియున్నను నన్ను క్షమింపుము అనియెను.

కమలయేమియుఁ బలుకలేదు; నిలిచినట్లే నిలిచియుండెను.

రమేశ—(మరల పలుకఁదొడఁగెను.) నీకు నావలన నేదైన నుపకారము కావలసియున్న యెడలఁ దెలుపుము; నాచేతనైనంత పరిశ్రమ చేయుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.

కమల—(ముకుళితహస్తయై) నావృత్తాంతము లెవరికిని మీరు చెప్పకుండిన నంతియే చాలును.

రమేశ—చాలకాలమువఱకు నీవృత్తాంతమంతయు రహస్యముగనుంచియుంటిని. నేను దానిని బ్రకటించినందువలన నీకు నష్టము కలుగదని నాకు నిశ్చయముగఁ దెలిసినపిమ్మట నాసంగతులొకరిద్దఱు స్నేహితులతోఁ జెప్పితిని—ఘనానందుల చిరంజీవులైన యోగీంద్రబాబుతోఁడను, నాతని సోదరియగు నలినితోడను మాత్రమే—

చక్ర—ఆమెకుఁ గమలవృత్తాంతము తెలియునా?

రమేశ—తెలియును. ఆమెకిఁక నేమైనఁ జెప్పవలసిన యెడలఁ జెప్పుదును. కాని, స్పష్టముగా నుడువుచున్నాను. ఆమెయెదుట కేగుటకు నాకిష్టము లేదు. నాకిప్పుడీవిషయములయందు విసుఁగు పుట్టియున్నది. అందుండి నేనెప్పుడు విముక్తుఁడగుదునా యని యనుకొనుచున్నాఁడను.

చక్ర—(రమేశుని చేతులుపట్టుకొని స్నేహభావమున) రమేశబాబూ! మీరిప్పు డేమియుఁ జేయనక్కఱలేదు. ఎన్నియో కష్టములు మీరోర్చియున్నారు. ఇఁకమీఁదనైన మీజీవితశేషమును శాంతితోఁ గడపుదురుగాక యని నాయభీష్టము.

రమేశుఁడు వెడలిపోవునప్పుడు వెనుకకుమరలి కమలతో "సరే! నేనిపుడు నీయొద్ద సెలవందెదను" అనియెను.

కమల యేమియు మాఱుపలుకకయే యతనికి మరలసాష్టాంగప్రణామమాచరించెను. రమేశుఁడు వెడలిపోవుచుఁ దనలో నిట్లనుకొనెను—"కమల సందర్శన మొదవుట మేలే యయ్యెను. అట్లుగాకున్న నీసందర్భములు ముగిసియుండవు. ఆనాఁటిరాత్రి గాజీపురము వీడిపోవుటకామె కేమితోచెనో తెలియలేదు. తెలిసికొనుట నాకంత యావశ్యకముగాదు. ఇప్పుడు నన్నుఁగూర్చియే నేను విచారింపవలసియున్నది. ఇఁకముందునుగూర్చియే యోచించు కొనవలయును. వెనుకకుఁ దిరిగిచూచుటనావశ్యకము!"

---

## ముప్పది యొకటవ ప్రకరణము.

---

### ప్రేమోచ్ఛదశ.

కమల చక్రవర్తి గృహమునుండి మగిడివచ్చునప్పటికి నళిని కళ్యాణీబాయితో మాటలాడుచుండుట యామె కగపడెను. కమలను గాంచినంతనే కల్యాణీబాయి "ఇదిగో సతి వచ్చుచున్నది. బిడ్డా! నీవు నళినిని నీగదిలోనికిఁ దీసికొనిపొమ్ము. ఘనానందబాబుగారికి ఫలాహారము సిద్ధపఱచెదను అనియెను.

గదిలోని కరిగినంతనే నళిని కమల కంఠమును కౌఁగిలించుకొని "చెలీ! కమలా!" అని పిలిచెను.

కమల—(ఆశ్చర్యచకితయై) నా పేరు కమలయని నీకెట్లు తెలిసినది ?

నళిని—ఒకవ్యక్తివలన నీ చరిత్రమంతయు నేనెఱింగితిని; అప్పటినుండియు నీవే యాకమలవని నానమ్మకము.

కమల—నా పేరెవ్వరికిని దెలియఁగూడదని నాకోరిక. నాకా పేరుపై నసహ్యము కలిగినది.

నళిని—కాని, యానామధేయమువలననే కదా నీవు నీయధికారమును సంపాదించుకొనవలసినది !

కమల—(మెడఁద్రిప్పి) నాకదేమియుఁ దెలియుటలేదు.

నళిని—మఱి నీవు నీవృత్తాంతమును నీపతికెఱుకఁజేయవానేమి? ఎంతకాలమని గుప్తముగా నుంచగలవు? రహస్యముగా నుంచిన నెట్లుసాగును !

ఆకస్మికముగఁ గమల స్వరూపము వివర్ణమయ్యెను. ఆమె స్తబ్ధయై నళినిముఖమువంక నీక్షించుచుండెను. అనంతరమొక కొంత తడవున కామె 'పరమేశ్వరుఁడు ప్రత్యక్షదర్శకుఁడు. నాయెడల నెట్టి యపరాధములును లేనప్పుడు నాకేటికాతఁడు దుఃఖములు కల్పించును? నిష్కారణముగా నన్నేటికా సర్వవ్యాపకుఁడు శాసించును? నాయీలజ్జాస్పదచరిత్రము నేనెట్లు పతితో వచింపగలను?' అనియెను.

నళిని—(ప్రేమతో) కమలా! నీవిషయములను గుప్తముగా నుంచఁగూడదుసుమా! మనసు దృఢపఱచుకొని చెప్పివేయుము; అందువలననే నీకుఁ గల్యాణము కాఁగలదు. నీవు నీపతికి నిన్నెఱుక పఱచుకొనవలయును.

కమల—ఉన్న యీస్వల్పసౌఖ్యమునుగూడఁ బోనాడుకొందునేమోయని నాకు భయమగుచున్నది, ఔను; నీవు నాహితమునకే చెప్పుచున్నావు! నేనెంతకాలము వారికెఱుకపఱుపకుండ నుండఁగలను? ఎప్పుడైన నొకప్పుడు వారికన్నియును దెలియనేగలవు.

నళిని—(దయార్ద్రయై) మఱి, నీవు కాకింకెవ్వ రతనితో జెప్పెదురు ?

కమల—నేనే చెప్పెదను. వారికిఁ జెప్పకుండ నేనేదియు రహస్యముగా నుంచుదాననుగాను !

నళిని—మంచిది. మనకిఁకపురకును బునర్దర్శనమగునో కాదో మేమందఱ మిటనుండి వెడలిపోవుచున్నాము. నీసెలవందుటకై నేనిటకు వచ్చితిని.

కమల—మీ రెక్కడకుఁ బోవుదురు?

నళిని—కలకత్తాకు. చెలీ! నన్ను మఱవవుకదా!

కమల—(ఆమెచేయిఁ దనచేతఁబట్టుకొని) ఉత్తరములు వ్రాయుచుండవా ?

నళిని—అవశ్యముగ వ్రాయుదును.

కమలకు నళినివిషయమై యొకింతవిచారము కలిగెను. నళిని ప్రశాంతముఖముపై నేఁడు దృగ్గోచరమగుచున్న యొక వింత భావముంగని కమల కన్నులశ్రుపూరితములయ్యెను. నేఁడు నళిని రహస్యమంతయుఁ గమలయెదుటఁ బ్రకటితమయ్యెను. కాని, యామె పైకి గంభీరభావము నగపఱచుచు వెడలిపోయెను. ఆమె వెడలిపోవునప్పుడు కేవలవిషాదపూరితమగు వైరాగ్యమును మాత్రము కమలకడ వీడిపోయెను.

ఆ దినమంతయుఁ గమల నళిని స్మరణయే కలిగియుండెను. సాయంకాలమున నామె పూలమాల కట్టుచుండెను. కల్యాణీబాయి యామెకడ కేతెంచి "ఆహాహా! నేఁడు నళిని నాకు నమస్కరించి

వెడలిపోవునప్పుడు నాకెంతవిచారము కలిగెననియందువు! ఎవ్వరే మన్ననుసరే! నళిని మహోత్కృష్టబాలికయే. ఆమెను నాకోడలిగా జేసికొననైతినిగదాయని విచారించుచున్నాను. ఆసుందరి నాకుఁ గోడలయి నాయింటికి వచ్చియున్న నాకెంతో సంతసమయియుండును. సర్వమును సంసిద్ధమైనది. కాని, నాకుమారునకుఁ దెలియఁజేయువారెవ్వరు! చెప్పినను వాఁడు వినువాఁడా! తనకేమి తోఁచుటవలన నీవివాహము నిరాకరించెనోయాతఁడేచెప్పుంగవలయును!'' అనియెను.

వెనుకఁ దాను నావివాహమున కసమ్మతిని బ్రకటించియుంటి ననుమాట కల్యాణీబాయి మఱచిపోయెను. ఇంతలో బయట నెవ్వరిదో యడుగులధ్వనివినరాఁ గల్యాణీబాయి "కమలనయనా! ఇటు వచ్చిపొమ్ము!" అని పిలిచెను.

కమల తటాలునఁ బుష్పములను బయ్యెదక్రిందదాచి ముఖమున ముసుఁగు వైచికొని కూర్చుండెను. కమలనయనునితోఁ గల్యాణీబాయి "నళిని నేఁడు వెడలిపోయినది, నీవు వారినందఱ దర్శించితివా! " అని యడిగెను.

"ఔను; వారినిరైలుబండిలోఁ బ్రయాణముసేయించివచ్చితిని."

నీవేమన్ననుసరే కాని, నళినివంటి యుత్తమకన్నియ నెందును జూడ లేను."

నలిని సౌందర్యవిషయమై తనయభిప్రాయమునకును గమలనయనునభిప్రాయమునకును భేదమున్నట్టు లామె మాటలాడుచుండెను. కమలనయనుఁడు మందహాసముచేసెను.

"చాలు నీనవ్వు నవ్వుచున్నావు! నే నేమనుచున్నానో యే మైన నాలోచించుచున్నారా! నేను నళినిని నీకుఁ బెండ్లిసేయుటకు నిశ్చయించితిని; నీవన్నియుఁ జెడఁగొట్టితివి; ఈవిషయమై నీకేమియుఁ దోఁచకున్నది!"

కమలనయనుఁడొక్కమాఱు చకితదృష్టితోఁ గమలవైపు నకుఁజూచెను. ఆమెముసుంగునుండి యాత్సుక్యముతో నాతనివంకఁ గాంచుచుండెను. నేత్రములునాలుగును సమ్మేళనమైనపిమ్మటఁ గమలతనదృష్టిని మరలించెను.

కమలనయన—అమ్మా! మీమాటలచేతనే వివాహమగుటకు మీరనూరుఁ డంతిసంపన్నుఁడా? వన్నుఁబోలిన క్షుద్రవ్యక్తి నెవ్వరు మెత్తురు?

ఈతుదిపలుకులు చెవులఁబడినంతనే కమల మరలఁ దలయెత్తి చూచెను. ఆక్షణముననే కమలనయనుఁడు నావంకఁ గాంచెను. కమలకు మిక్కిలి సిగ్గయ్యెను. అక్కడనుండి లేచిపోవుదమా యని యాెమెకుఁదోఁచుచుండెను. కల్యాణీబాయి—పోపో! ఊరక వాగకుము నీమాటలు వినిన నాకు సంతాపము హెచ్చుచున్నది.

కమల పుష్పహారమును సిద్ధపఱచెను. ఆహారముపై నీరు జల్లి దానిని గమలనయను నుపాసనామందిరమున నుంచెను. పిదప నామె తనగదిలోని కరిగి కూర్చుండి, యింతకుముందుఁ దాను గాంచినకమలనయనునిదృష్టివిషయమై యాలోచింపసాగెను. కమలనయనుఁడు నేఁడేటి కామె నంతప్రేమభరితదృష్టితోఁ గాంచుచుండెను? పూర్వ మెన్నఁడైన నాతఁ డామెను గాంచినప్పు డామె యాఁ దనదృష్టిని మఱొకవైపునకు మఱలించుచుండెను. నేఁడాతని

కామెమనోగతము తెలిసియుండెనా! ఇటీవలఁ గమలయు నాతని యెదుటికి బలుమాఱువచ్చుచుఁ బోవుచుండెను. అతనిసమక్షము నకు రాకుండుటయు నామెకు దుష్కరముగ నుండెను. ఆమెస్వయ ముగ 'ఈబాలిక నన్నెక్కడనుండి తెచ్చెనోకదా! ఈవిగ్న జ్ఞాబాలిక కేమూర్ఖుఁడు 'సతి!' యని పేరిడెనో?—అని యాతఁ డనుకొనుచుండునా!' అని వితర్కించుకొనెను. కమలనయనున కొక్కమాఱిట్టిభావన నుద్భవించెనా? కమలకీ జగమున నుండుటకు స్థలమే లేకపోవును.

కమల రాత్రికయ్యెపైఁబరుండునప్పుడు తనలో నిట్లుదృఢ ప్రతిజ్ఞచేసికొనియెను.

'ఏమైనఁ గానిమ్ము! రేపే వారికి సకలము నెఱింగించెదను!'

మఱునాఁ డరుణోదయమున లేచి కమల స్నానముసేయ వెడలిపోయెను. నిత్యనియమము తెఱంగున నామెస్నానముచేసి వచ్చి నపిమ్మటఁ గమలనయను నుపాసనామందిరము స్వచ్ఛముసేయఁబోయె ను; నేఁడు కమలనయనుఁ డప్పుడే యక్కడకు వచ్చి కూర్చుండి యుండెను కమల కాశ్చర్యమయ్యెను. ఏలయనఁ, గమలనయన బా బింతప్రాతఃకాలముననే యెప్పుడును నుపాసనామందిరమునకు వచ్చు టలేదు. ఆమె యటనుండి వెనుకకుఁ దిరిగెను; ఇంతలో నామె కేమి తోఁచెనో గాని, యామె మరలి ద్వారముకడ కేగి యట గూర్చుం డెను. ఆమెనెవ్వరైన నట నాఁపిరేమో యామెకు దెలియదు; ఎంత ప్రొద్దెక్కెనో యామెకుఁ దెలియదు; తాను మేల్కొనియున్నదో లేక నిద్రించుచున్నదో యామె యెఱుఁగదయ్యెను. ఆమెస్వప్న దృష్టిలోనే యనుపమసౌఖ్య మనుభవించుచుండఁబోలును ? ఒకింత

నేపైనపిస్మృట నటుచూడఁ గమలనయనబాబు గదిబయటికి వచ్చి ద్వారముకడ నిలిచియుండుట యామెకుఁ గనఁబడెను. కమల పుడమిపైఁదలనిడి యతనికి సాష్టాంగప్రణామ మొనరించెను; అప్పుడే తానమాడియుండినందున నామెతడిసినవెంద్రుక లతనిపాదములకు సోకెను; కమల లేచి నిలిచెను. ఆమె తలపై మేలిముసుఁగు తొలఁగి స్కంధముపైఁ బడియుండుటామెకుఁ దెలియలేదు. కమలనయనుఁడ నిమేషలోచనములతో నామెంగాంచుచుండెను. ఆజవ్వని బాహ్యజ్ఞానశూన్యయై నిలిచియుండెను. ఆమెహృదయము శూన్యమయియున్నందునకుఁ బ్రమాణముగఁ గాఁబోలు "నేనుకమల" యనుశబ్దమామెనోటినుండి వెలువడెను.

కాని, యీశబ్దము వెలువడినవెంటనే యామెధ్యానము భంగమయ్యెను. ఆమె యేకాగ్రత బాహ్యజ్ఞానమునఁ బరివర్తనమయ్యెను. ఇప్పుడామె సర్వాంగములును గంపింపసాగెను. ఆతరుణీమణి తలవంచెను; ఆసుందరిహృదయము కటకట కొట్టుకొనసాగెను; అచ్చోటబాసి కదలుటకుసైత మామెకు శక్తిలేకపోయెను. ఆయువతి తనసర్వధైర్యమును, సర్వసాహసమును, సర్వప్రజ్ఞను, "నేనుకమల" యను వాక్యరూపమునఁ గమలనయనుని చరణములపై వైచెను. ఇఁక నంతయుఁ గమలనయనునిదయాబుద్ధిపై నాధారపడియున్నది. కమలనయనుఁ డతికోమలమగుతనహస్తమున నామెప్రాణిని గ్రహించి "నీవు నాకమలవని నేనెఱింగితిని. రమ్ము; నాగది కేగుదము;" అనియెను.

కమలనయనుఁ డామెకూర్చినహారమును గైకొని కమలకంఠము నలంకరించి "రమ్ము; మన మిరుపురముఁజేరి పరమాత్మునకు బ్రణామము సేయుదము." అనియెను.

ఇరువురు నవనతవదనులై పరమాత్ముని ధ్యానించుటలో లీనులై యుండఁ గిటికీద్వారమునఁ బ్రాతఃకాలమనోజ్ఞప్రకాశము వారిశరీరములపై సోఁకెను.

పరమేశ్వరధ్యానము ముగిసినపిమ్మట మఱియొకసారి కమల కమలనయనునిపాదములపై శిరసిడి నమస్కరించెను. ఇఁక లజ్జాదుస్సహవేదన యామెహృదయమున నుండలేదు ఆమెముఖముపై విషాదచ్ఛటయు నుండలేదు; హర్షముప్రతిబింబితమయి యుండలేదు. ప్రభాతప్రకాశమునకుఁ దోడయి యామెముఖముపై శాంతతేజము దృగ్గోచరమగుచుండెను. ఆమెకు భక్తితరంగము లుద్భవిల్లెను, చూడంజూడ నామెనేత్రములనుండి యశ్రుజలము కాలువలై ప్రవహించుచుండెను. ఆమెహృదయాకాశమున ననేకదినముల నుండియు నేదుఃఖమేఘపటలము వ్యాప్తమైయుండెనో, యది నేఁడు నేత్రద్వారమున నానందాశ్రుస్వరూపమును దాల్చి వెలువడియెను. ఆమెయంతఃకరణము నిర్మలమయ్యెను. కమలనయనుఁ డేమియుఁ బలుకలేదు; అతఁ డామెకపోలములపైఁ బడియున్నముంగురుల సవరించి యటనుండి వెడలిపోయెను.

కమలప్రేమపూజ యింకను సంపూర్ణము కాలేదు; ఇంకను భక్తిపూర్ణములగుపూజ లొనర్పవలెనని యామె యుత్సుకమైయుండెను. ఆమె కమలనయనునిశయన గృహమున కేగెను; తనమెడనున్నపుష్పహారము నెత్తియట బీరువాలోనున్న కమలనయనుని పాదుకలపై భక్తితో వైచెను. పిమ్మట నాపాదుకలకు నమస్కరించి మరల వలువులు మూసెను.

పిమ్మట గృహకృత్యములకుఁ దొడంగెను. నేఁడామె విశేషోత్సాహముతోడను, జాకచక్యముతోడను, బనులు సేయుచుండెను. కళ్యాణీబాయి "బిడ్డా! నీవేమిసేయుచున్నావే? ఒక్కనాఁడే గృహమును వాకిలియు నంతయు నలంకరింపవలెనని నిశ్చయించియున్నావా యేమి!" అనియెను.

మూఁడవజామునఁ గమల తనగదిలో నాసీనయైయుండఁ గమలనయనుఁడు స్థలకమలముల నటకుఁ దెచ్చి "కమలా! ఈకమలములను నీటఁ దడిపియుంచుము. ఈసాయంకాలము మన మిరువురముఁ జేరి తల్లిగారికిఁ బ్రణామము సేయఁబోవుదము." అనియెను.

కమల—(తలవంచుకొని) నాసకల వృత్తాంతమును మీరు విని యుండరు.

కమలనయన—నీవేమియుఁ జెప్పనక్కఱలేదు; నాకన్నియు దెలియును.

కమల—కాని, మాతృశ్రీ—

అటుపై నామె మాటలాడఁజాలకపోయెను.

కమలనయన—నేను జన్మించినదాదిగ నాసర్వాపరాధములను మాయమ్మ సైచియున్నది; అట్టిదో, నిశ్చయముగ నపరాధము కాని దానికై యేటి కామె మన్నింపకుండును!

కమల—మీవాక్కులు సత్యమగుఁగాక!

కమలనయన—దైవలీలలు విచిత్రములు, నగాధములు నైన వికదా! ఆతఁ డెపుడు దేని ఘటింపఁజేయునో యంధులకు నియమము

కలదా? లేదు. మనజీవితముననే యెన్నియో విచిత్రములు సంభవింపలేదా ?

కమలనయనుని యీప్రశ్నమునకుఁ గమల కేవలప్రేమాశ్రుజలముతోడనే ప్రత్యుత్తర మొసఁగెను. కమలనయనుఁ డామెకరకమలమును ముద్దిడికొని యటనుండి వెడలిపోయెను.

ఇంచుమించుగ సూర్యాస్తమయ సమయమునకుఁ గమలాకమలనయను లిరువురును గూడి మాతుశ్రీగారికి సాష్టాంగప్రణామ మొనర్చిరి. ఆమె దీవెనలచే నాయిరువురును గృతార్థులైరి.

సమాప్తము.

---

# నవలలు

| | | రు | అ |
|---|---|---|---|
| కృష్ణవేణి | | 0 | 12 |
| ప్రేమలత | | 1 | 0 |
| కర్పూరమంజరి | 1 భా | 1 | 8 |
| డిటో | 2 భా | 1 | 8 |
| రామచంద్రవిజయం | | 1 | 0 |
| సౌందర్యతిలక | | 1 | 8 |
| వినోదములు | 1 భా | 0 | 12 |
| [illegible] | 2 భా | 0 | 12 |
| **Tales of Rajasthan** అను రాజస్థానకథావళి | 1 భా | 1 | 8 |
| డిటో | 2 భా | 1 | 8 |
| మణిమంజరి | | 0 | 6 |
| సుశీర్ణసుపుత్రుడు | | 0 | 6 |
| చమత్కారమంజరి | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| **Lives of Great Men** మహాపురుషుల జీవితచరిత్రలు | 1 భా | 0 | 12 |
| డిటో | 2 భా | 1 | 0 |
| డిటో | 3 భా | 1 | 0 |
| రామకృష్ణపరమహంస **Life and Teachings** | | 1 | 0 |
| ప్రహసనమంజరి | | 0 | 12 |
| నవ్వులగని | | 1 | 8 |
| నానక్ చరిత్ర | | 0 | 12 |
| గురుగోవిందచరిత్ర | | 0 | 12 |
| సిద్ధార్థచరిత్ర (గౌతమబుద్ధుని జీవితం) | | 1 | 0 |
| రఘుకులచరిత్ర | | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300 పే॥ **Lake of Palms** | | 2 | 0 |
| గణపతి (హాస్యనవల) | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| నందచరిత్ర | | 0 | 4 |
| కృపాంభోనిధి (భక్త చింతామణిలో వలెనే భక్తిరస పద్యములు కలవు) | | 0 | 4 |
| భారతకథామంజరి | | 0 | 8 |
| విశ్వనాథ సత్యనారాయణగారి ఆంధ్రపౌరుషము | | 0 | 6 |

**వేదాంత కవిగారి గ్రంథములు**

| | | రు | అ |
|---|---|---|---|
| కెరటాలు | | 1 | 0 |
| కవితాసంస్థానం | | 2 | 0 |
| అవ్వాయిచువ్వలు | | 0 | 12 |
| దండయాత్ర | | 1 | 0 |
| వరదలు | | 1 | 0 |
| గడుగ్గాయి | | 1 | 0 |
| చినరసాలు | | 0 | 8 |
| భగవన్మతభాష్యం | 1 భా | 1 | 4 |
| డిటో | 2 భా | 1 | 0 |
| నాయుడుబావ (చక్కని పద్యములు) | | 1 | 0 |

# ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి

## ప్రఖ్యాతినొందిన నవలలు

| | | | |
|---|---|---|---|
| సీతారాము | 1 8 | పూర్ణానందం | 1 8 |
| రాజసింహ | 2 0 | నౌకాభంగము 1 భా | 2 0 |
| మృణాళిని | 1 8 | డిటో 2 భా | 2 0 |
| విషవృక్షము | 1 8 | దృఢప్రతిజ్ఞ | 1 8 |
| మృణ్మయి | 1 8 | వసుమతీవసంతం | 2 0 |
| కృష్ణకాంతుని మరణశాసనం | 1 8 | నూర్జహాన్ | 1 8 |
| శ్రీకృష్ణ చరిత్రం 1 భా | 1 8 | అపరాధిని | 1 8 |
| డిటో 2 భా | 1 8 | ధర్మసామ్రాజ్యం | 1 8 |
| కమలాకాంతుడు | 0 6 | ప్రణయచాంచల్యం | 1 8 |
| రజని | 1 0 | రామాశ్రమం | 1 8 |
| శకుంతల | 1 0 | అపరాజిత | 1 8 |
| వంగవిజేత | 1 8 | క్షమార్పణము | 1 8 |
| | | మధుర | 1 8 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.